సరస్వతీ గ్రంథమండలి:

# నన్నయభట్టు - విజ్ఞాన నిరతి

శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావు



పబ్లిషర్సు: అడ్డేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# NANNAYABHATTU VIJNĀNA NIRATI

By

GOBBURI VENKATANANDA RAGHAVARAO

First Edition : December 1959

Price Rs. 4-00





Publishers : ADDEPALLY & CO.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.)

# విజ్ఞాన నిరతుడు - నన్నయ్యభట్టు

"విద్వత్సం స్తవనీయ భవ్యకవితావేశులును" "మృదుమధుర రసభావభాసురనవార్థ వచనరచనావిశారదులును" నైన మహాకవిలోక బాంధవులనేకులు మన తెనుగునాట నుదయించి, స్వీయకవితామయూఖముల దశదిశలంబఱపి ధన్యులైరి. అట్టి మహనీయ కవిభానులలో నన్నయభట్టారకుడే మనకు తెలిసినంతవఱకు ప్రథముడు. ఆకవితల్లజుని కావ్యరసము గ్రోలుచు నేను నలుబది సంవత్సరములపై కాలము గడిపితిని. ఎఱ్ఱాప్రెగ్గడ వర్ణించినట్లు, నన్నపార్యుని రచన భద్రకుంజర గమన మనుటతో నాకు తృప్తి కలుగలేదు.

నేటి దిన జీవనమునుండి యొక యుపమానము గ్రహింతము.

మింట మేఘజాలముం బురుడించు పొగలుమియుచు, జలజనిత పవనబలచోదితమై, విస్మయ మహాకాయ విశిష్టమై, భయసంభ్రమములం గొల్పుచు, వింశత్యధిక సంఖ్యగల శకటశ్రేణి నిండ కిటకిటలాడుచు నిరుకుకొనియున్న ప్రయాణీజనసమూహాల వెంటగొనుచు పొగరుం* జొచ్చి వెడలిపోవు నూతన ధూమయంత్ర బల, వేగ, గాంభీర్య, గమన విశేషములం దలపింప జేయగలది, నన్నయభట్టారకుని భారత రచన. ఈధూమయంత్రోపమానము కంటెను మన తెనుగునాటిం బవిత్రముగావించు దక్షిణగంగా స్మరణము కర్తవ్యము. వర్ష ఋతువున, రెండుగట్ల నొరసికొని, మహాజవముతో పొంగి, పొరలి, కెరలి, యద్భుతముగా ప్రవహించు నఖండ గౌతమీపుణ్యస్రవంతి నన్నయ కృత భారతముతో నుపమింప దగియున్నదనిన నాహృదయమింకను సంతసింపగలదు.

---

* పొగరు Railway Station Compound or Harbour. విశాఖపట్టణ మాండలిక పదము.

# ప్రకాశక విజ్ఞప్తి

ఆంధ్రదేశమునందలి విమర్శకులలో శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారి పేరు సుపరిచితమైనది. ఆయన ఖగోళశాస్త్ర పరిశోధన వ్యాసములు పెక్కుర ప్రశంసలకు పాత్రములైనవి. ఖగోళ విషయ విజ్ఞానమే కాక ఆంధ్రసాహిత్యముకూడ ఆయన పరిశీలనకు రంగస్థానమైనది. వారి గ్రంథములు కొన్ని మేము ప్రకటించుటకు నిశ్చయించుకొన్నాము. అందులో మొదటిది "నన్నయభట్టు విజ్ఞాననిరతి" అను పేరుగల యీగ్రంథము. ఆదికవియగు నన్నయభట్టారకుని భారతాంధ్రీకరణము ఆధారముగా ఆయన ఖగోళవిజ్ఞానము ఎంతటిదో యీగ్రంథమున సమగ్రముగా చక్కగా వివరింపబడినదని, అభిజ్ఞులైన పాఠకులకు వేఱుగా మేము చెప్పనక్కఱలేదు. ఈగ్రంథము తరువాత శ్రీ వేంకటానందరాఘవరావుగారి "ఆంధ్ర వచన రచనా పరిణామము" ప్రకటించుచున్నాము. "అనుదిన విజ్ఞానము" అను పుస్తకము మఱియొకటి కూడ త్వరలో ముద్రితమై వచ్చుచున్నది. పాఠకుల ప్రోత్సాహముతో విజ్ఞానసేవాదృష్టి పాటించి యిట్టి గ్రంథములు ముద్రించుచున్న మాయుద్యమము సరస్వతీ కంఠాభరణ మగునట్లు రచయితలాశీర్వదింపవలయును.

రాజమహేంద్రవరము
1 — 1 — 1960

ఇట్లు
ప్రకాశకులు

# వి ష య సూ చి క

---

—

# నన్నయభట్టు విజ్ఞాననిరతి

'విద్వత్సం_స్తవనీయభవ్యకవితావేశులును'' 'మృదుమధురరసభావ భాసురనవార్థ వచన రచనావిశారదులు' నైన కవిలోకబాంధవు లనేకులు మన తెనుగునాట నుదయించి స్వీయకవితా మయూఖములను దశదిశలం బఱపి ధన్యులైరి. అట్టి మహనీయ కవిభానులలో నన్నయభట్టారకుడే మనకు తెలిసినంతవఱకు ప్రథముడు. ఇప్పటికి తొమ్మిదినందల యేండ్ల క్రిందట - ననగా క్రీ. శ. 1022 మొదలు 1063 వఱకు తెనుగుదేశమును పరిపాలించిన రాజరాజనరేంద్రుని యాస్థానకవియని నన్నయ ప్రసిద్ధి చెందెను. ఆనాడు తెను సీమకు వేంగీదేశమని పేరుండెను.

'అఖిలజలధి వేలావలయిత వసుమతీవనితావిభూషణం బైన' యీ వేంగీదేశమునకు నాయకరత్నంబునుంబోని రాజమహేంద్రపురంబునందు మహామహిమతోఁ బరమానందంబున ననవరత మహామహీరాజ్యసుఖంబు లనుభవించుచు రాజరాజనరేంద్రు డీదేశమును పరిపాలించుచుండెను.

చాళుక్యరాజచూడామణి యగు రాజనరేంద్రుని పరిపాలనా విధానమును ఈ క్రింది పద్యము చక్కగా వివరించుచున్నది —

సీ॥ నిజమహీమండల ప్రజఁ బ్రీతిఁ బెంచుచు
బరమండలంబుల ధరణిపతుల
నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును,
బలిమి నీయని భూమి వలయపతుల
నుక్కడగించుచు దిక్కులఁ దనయాజ్ఞ
వెలిగించుచును విప్రకులము నెల్లఁ
బ్రోచుచు శరణన్నఁ గాచుచు భీతుల
నగ్రజన్ములకు ననుగ్రహమునఁ

జారుతర మహాగ్రహారంబు లిచ్చుచు
దేవభోగముల మహావిభూతి
దనరఁ జేయు చిట్టు మనమార్గుఁ డగు విష్ణు
వర్ధనుండు వంశవర్ధనుండు॥ ఆది. 1-7

రాజనరేంద్రునకు వేదములయందును, వేదచోదిత కర్మలయందును, అత్యంతమగు నాదరాభిమానము లుండెను. తన రాజ్యకాలమునకు ముందు వేదబాహ్యములైన జైనబౌద్ధాదిమతములు తెనుగునాట ప్రబలియుండెను. భారతకథా విశేషముల యాథార్థ్య మెఱుఁగలేక తెనుగునాట జనసామాన్యము 'గాసటబీసటే చదివి' లేనిపోనిగాథలు త్రవ్వుకొనుచుండిరి. పంచమవేదమై భాసిల్లు భారతము సంగతి తెలియక తెనుఁగులు అజ్ఞానాంధకారమున బడియుండిరి.

రాజరాజునకు మిక్కిలి ప్రీతి కలిగించునట్టి కార్యములు అయిదు – 1. ఈశ్వరపదాబ్జ ధ్యాన పూజా మహోత్సవములు. 2. భారత కథా శ్రవణము. 3. బ్రాహ్మణోపాస్తి 4. సంతత దానశీలత 5. శశ్వత్ సాధు సాంగత్యము. ఇందు దేవ బ్రాహ్మణ పూజలు దాన ధర్మములు సత్కాలక్షేపములు రాజరాజు నిత్యము చేయుచున్నాడు. భారత శ్రవణాసక్తిని మిక్కిలి పెంపొందించి యా మహీకాంతుని హృదయమున నతిశయింప జేయుచుండిన విశేషములు కొన్ని గలవు. వాని నిట వక్కాణించుట అవసరము.

అందు మొదటిది, వంశాభిమానము. రాజరాజు చంద్రవంశజుడు హిమకరుని పిమ్మట పూరుడు, భరతుడు, కురుప్రభుడు, పాండురాజు నను మహారాజులు వంశకర్తలై ఆవంశమునకు అసమాన ఖ్యాతిని గూర్చిరి. పాండవులు పాండురాజు కొమాళ్ళు; విమలసద్గుణ శోభితులు;. వారి పుణ్యచరిత్రమే భారతము వంశాభిమాన చోదితుడైన రాజరాజు చిత్తము అనిశమును భారతకథా శ్రవణప్రవణమగుట సహజము.

రెండవది. భారతకథా శ్రవణము అత్యంత పుణ్యప్రదము ఉత్తమవేద విప్రులకు బంగారు కొమ్ములు, బంగారు గొరిజలు నవ

ర్చిన కపిల గోవులు ఒకవంద యథావిధిగా దానము చేయుటచే కలుగు పుణ్యము ఒకసారి భారతము వినుటచే కలుగుట నిక్కవము.

మూడవది. భారత బద్ధస్పృహులై బహుజనముల వలన బహు భాషలలో బహువిధముల భారతకథ వినువారికి బహుయాగములు యథావిధిగ చేయుటవలన కలుగు ఫలము తప్పక కలుగ గలదు.

రాజనరేంద్రుడు సహజముగా విద్యావిలాస గోష్ఠీప్రియుడు. ధారా నగరము రాజధానిగా మాళవదేశము నేలిన విద్యాప్రియుడు భోజ రాజు మన రాజునకు సమకాలికుడు. భోజుడొక్క సంస్కృతమునే పోషించెను; రాజరాజన్ననో మృదుమధుర రసభావ భాసురన వార్థ వచన రచనా విశారదులును, అష్టభాషావిదులు నైన మహాకవులను పెక్కండ్రను పోషించెను. రాజరాజు నాస్థానము ముగురంబలు, శ్రీవాణీ గిరిజా దేవులు నిర్మత్సరలై విహరించు రమ్యోద్యాన మైనది. ఆప్రభుసభ దివ్యకావ్య సౌరభోపేతమై, మహనీయ కవిరాజ విరాజితమై యెంతయు నలరారుచుండెను. అట్టి విశిష్టవిద్వత్సభలో, భారతము తెనుగున వెలయింప జేయవలెనని ఆవిద్వత్ప్రభువునకు గాఢమైన సంకల్పము కలిగెను.

"తన మనోవాంఛితమును చక్కగా నెఱవేర్పగల సామర్థ్యము సభలో నెవ్వరికున్నది? పంచమవేదమును పండితపామరజనమనోజ్ఞ ముగా తెనుగున రచింపగల కవితాపటిమ ఎవరికి గలదు? ఈ మహా కార్యనిర్వహణ దక్షులైన కవీంద్రు లెవరు?" అని రాజరాజు యోజించెను.

రెండవసూర్యునివలె ప్రకాశించుచు, బ్రహ్మతేజోవిభాసియై, ఆమహాసభను వెలిగించుచున్న నన్నయభట్టారకునిపై రాజరాజు దృష్టి నిలిచెను. ఎవరీ నన్నపార్యుడు?

సీ॥ తనకుల బ్రాహ్మణు ననురక్తు, నవిరళ
జపహోమ తత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణ విజ్ఞాన నిరతు

బ్రాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాత చరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు
నిత్యసత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా
భరణుఁ డిట్టు లనియెఁ గరుణతోడ॥ ఆది. 1-9

## నన్నపార్యుడు

1. చాళుక్య రాజరాజప్రభువు వారి యింటి పురోహితుడు.
2. రాజభక్తి గలిగి రాజరాజునందు మంచి అభిమానము కలవాడు.
3. అనుదినము యథావిధిగ జపము, హోమము నిర్వర్తించువాడు.
4. ఋగ్వేదసంహిత మొదలుగా వేదమూలమును అధ్యయనము చేయుచుండువాడు.
5. బ్రహ్మాండాదిపురాణములు పదునెనిమిదింటిని ఉపపురాణ సహితముగా చక్కగా చదివి, అందలి విజ్ఞానవిషయములను పూర్తిగా నవగతము చేసికొని, నిత్యము తా నాచరణలో పెట్టుచు, పాఠకులచే నాచరింపజేయ కౌతూహలము కలవాడు. (విజ్ఞానశబ్దార్థము ఈ క్రింద ప్రత్యేకముగా చర్చింపబడును.)
6. యోగ్యుడు; సత్ శీలము కలవాడు.
7. కృష్ణ యజుశ్శాఖాధ్యాయి; ఆపస్తంబఋషీశ్వరరచితములైన సూత్రముల ననుసరించుచు షోడశకర్మలు, యజ్ఞయాగాదులు స్వధర్మములు నిర్వర్తించువాడు.
8. వేదఋషియగు ముద్గలగోత్రోద్భవుడు.
9. సత్పురుషుల ప్రశంసాపాత్రమై శ్రేష్ఠమైన చరిత్రగలవాడు.
10. లోకజ్ఞుడు. శ్రోత్రియులు "వేదజడులని, బుద్ధిమాంద్య జనితో

స్త్రాదుల'' ని ప్రతీతి. నన్నయ సంహితాభ్యాసుడైనను వేదజడుడు కాడు. చక్కని లోకజ్ఞత కలవాడు.

11. ఉభయ భాషాకావ్య రచనాభిశోభితుడు. తెనుగున, సంస్కృతమున, ధారాళముగా కవిత్వము చెప్పి చక్కని కావ్యముల రచింపగలవాడు. [రాజరాజు సభలో నారాయణభట్టు అష్టభాషాసుకవి రాజశేఖరుడు. పావులూరి మల్లన గణకుడు. గణితశాస్త్రమును బోధించు గ్రంథము తెనుగున రచించెను. దానినే పావులూరి గణిత మందురు. మల్లన, నారాయణభట్టును కూడ ఉభయ భాషాకావ్య శోభితులని వారు రాజరాజు వలన పొందిన శాసనములు సాక్ష్యమిచ్చుచున్నవి.]

12. సత్ప్రతిభాభి యోగ్యుడు. చక్కని ప్రతిభ గల్గినవాడు; ప్రతివాది భయంకరుడు.

13. నిత్యసత్యవచనుడు; లీలలందును బొంకులేనివాడు; సత్యవ్రతుడు.

14. మత్యమరాధిపాచార్యుడు: బుద్ధియందు బృహస్పతితో సమానుడు.

15. సుజనుడు, సత్పురుషుడు; యోగ్యుడు.

ఇట్లన్ని విధములచేతను పూజ్యుడును వంద్యుడు నైన నన్నపార్యుని జూచి రాజరాజిట్లనెను "భట్టారకా! ఎన్నెన్నో పురాణములు వింటిని; అర్థధర్మ శాస్త్రముల క్రమము తెలిసికొంటిని; రసవత్తరములైన కావ్యనాటకములం దిలకించితిని. జనాభ్యర్చితములైన ఆగమములందు మనస్సు నిల్పితిని. ఏమిచేసినను తనివి కలుగదు. ఎల్లప్పుడును భారతమునే వినగోరుచున్నాను. నా నైసర్గికాభిరతికాస్పదములు ఐదు గలవు. దేవపూజ, బ్రాహ్మణభక్తి, నిత్యదానము, సత్పురుష సాంగత్యము, భారత శ్రవణాసక్తి. విశేషించి, భారతము మావంశాను చరితము; యథోక్తానంత గోదాన పుణ్య ప్రదము భారతశ్రవణము; బహుయాగ ఫలప్రదము. ఎన్ని భాషలలో, ఎంతమంది వలన నెన్నిసార్లు వినినను భారతమే వినవలెను. కావున

కం॥ జననుత! కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారత బ

క్షనిహాపితార్థ మేర్పడ
తెనుగున రచియింపు మధికధీయుక్తి మెయిన్ ॥"
అని యానతిచ్చెను.

రాజరాజు కోరిన తెనుగుభారతము సంస్కృత మూలమునకు బానిస భాషాంతరీకరణము (Slavish translation) కాదు. వేదవ్యాస మునీంద్రుడు సంస్కృతములో రచించిన భారతార్థము, పూర్వుని తావివలె మూలగ్రంథము నాక్రమించి, నవలక దానిననుసరించియున్న అర్థ విశేషములు, అవసర వ్యాఖ్యాన తాత్పర్యములతో కూడి తెనుగు ప్రజకు హృద్యమైన విధమున తెనుగున రచింపుమని, తెనుగుభాషలో భారతము నవతరింప జేయుమని, రాజరాజు నన్నయ్యను కోరియున్నాడు. నన్నపార్యుడు రాజరాజు నభిప్రాయముకనిపెట్టినాడు.

రాజరాజు నన్నయశిరస్సున కెత్తిన భారము సామాన్యమైనదికాదు. అది తన తలకు తగని బరువని అతడెఱిగి యుండెను. రాజాజ్ఞకు వినమ్రుడై, కవి, రాజుమ్రోల నిలిచెను; నిలిచి ఇట్లని విన్నవించెను:

" చ॥ అమలిన తారకాసముదయంబుల నెన్నను, సర్వవేదశా
స్త్రముల యశేష సారము మొదంబున బొందను, బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థజల గౌరవ భారతభారతీ సము
ద్రము దఱియంగనీదను విధాతృనికైనను నేరబోలునే॥ "

" ప్రభూ ! ఆకాశముమీద అమరియున్న నక్షత్రములను ఎవరు ఎన్న గలరు ? అన్ని వేదములయొక్క శాస్త్రములయొక్క అశేషసారము ఏఒక్కరైనను సంతోషముతో సాధించి పొందగలరా ? ఇక భారతమా? అతిక్రమింపరాని అర్థసమన్వితము, విజృంభించు నుప్పెనవలెను, ముంచుకొని వచ్చు ప్రళయజలధివలెను, దారుణముగా పైకొనుచు, దుర్గమమైన భారతాంభోధిని, స్వబుద్ధియనెడు బాహుసంచలన సాధనముచే, ఎవడైనను బారలువైచుకొనుచు ఈదగలడా ? ఉత్తరింప గలడా ? భారతవాఙ్మయసముద్రమును పూర్తిగా నీది ఒడ్డుచేరుట బ్రహ్మదేవునికైనను సాధ్యము కానిపని ; ఇక నా బోటి యల్పునకు, కించిజ్ఞునకది యెట్లు సాధ్యము కాగలదు ?"

నిండుకుండ తొణక దందురు. నన్నయభట్టారకుడు ఈక్షణమున వినతుడై మహోన్నతుడైనాడు.

రాజరాజనరేంద్రుని యాజ్ఞ నన్నయ చెవుల పడినంతలో మున్ముందు నన్నపార్యునిమనస్సు, నక్షత్రవిరాజితమైన ఆకాశము మీదికి పోయినది. ఆవిషయమును గూర్చి ఈ ప్రకరణమున ప్రత్యేకముగా చర్చింపవలసియున్నది.

ఇంగ్లీషులో "So vast is art, so narrow human wit, That one Science only will one genius fit" అని సామ్యము కలదు. శాస్త్రజ్ఞానము అంతములేనిది. మానవుని ఆయుష్కాలము అత్యల్పము. ఈస్వల్ప కాలములో నొక మేధాశాలి ఏదైన నొక్క శాస్త్రమున ప్రవీణుడు కావచ్చును. శాస్త్రములు అన్నింటిని మానవమాత్రుడొకడెవడు సాధింపగలడు? విద్యకు వినయమే ఫలము. కంచుమ్రోగునట్లు కనకము మ్రోగదు. ధీశాలి తనకు తెలిసినది అత్యల్పమని బిడియపడును; సర్వజ్ఞుడని గర్వపడడు. కావున నన్నయభట్టు రాజాజ్ఞను శిరసావహించి, వినయవినమితోత్తమాంగుడై, "దేవా! నీయనుమతంబున, విద్వజ్జనంబుల యనుగ్రహంబునంజేసి నానేర్చు విధంబున నిక్కావ్యంబు రచించెద" నని ప్రత్యుత్తర మిచ్చి, భారతము తెనుగున రచింప నారంభించెను.

భారతమహా సంగ్రామమునందు నరునకు నారాయణుడు తోడ్పడినట్లే, నన్నపార్యునికి ఇష్టుడును, సహాధ్యాయుడును, వాఙ్మయ ధురంధరుడును నగు నారాయణభట్టు తోడై తెనుగు భారత రచనను నిర్వహింపజేసెను.

ఈకావ్యరచనోద్దేశమును, దీనినొనరించుటలో తన సంకల్పమును, నన్నయ తన కావ్యారంభమునందే ఇట్లు ప్రవచించి యున్నాడు.

ఉ॥ సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలి (వి?) తార్థయుక్తితో
నారసి మేలునా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు దెనుంగున న్మహా
భారతసంహితా రచనబంధురు డయ్యె జగద్ధితంబుగన్ ॥

జగద్ధితముచే యభిలషించి నన్నయ్య తెనుగు భారత రచనకు పూను కొనినాడు. తెనుగునాట నుద్దండ పండిత ప్రకాండులు కవీంద్రులు పలువురున్నారు. ఇతరులు పామరులున్నారు. కావ్యరసగ్రహణ దక్షు లైన విద్వజ్జనులు, కవీంద్రులు, ఇందలి ప్రసన్న కథాకలి (వి?) తార్థ యుక్తిని చక్కగా విమర్శించి మేలు మేలని మెచ్చుకోవలెను ఇతరులు ఇందలి శ్రుతి సామ్యాది *శబ్దాలంకార విశేషములను గమనించి, దీని దగు నక్షయ మాధుర్యమును నిత్యమును తనివిదీర గ్రోలుచు నానం దింప వలయును. తెనుగు ప్రజానీకమునకు నీవిధముగా మేలొడ గూర్చుచు, శాశ్వతముగా వారి మన్ననల బడయుచు తెనుగు భారతము విలసిల్లుచుండవలెనను సత్సంకల్పముతో నన్నయభట్టు, తన మిత్రుడగు నారాయణభట్టు సాయముతో తెనుగుభారతము రచించెను.

## 2. సంస్కృత భారత సంభవ ప్రశంస

మూలము (ఆది 3 - 386) శ్లోకమున భారతావతరణ మిట్లు గలదు :—

"ద్వైపాయనౌష్ఠపుట నిస్సృతమప్రమేయం
పుణ్యాం పవిత్రమథ పాపహరం శివంచ
యో భారతం సమధిగచ్ఛతి వాచ్యమానం
కింతస్య పుష్కర జలై రభిషేచనేన"

నన్నయభట్టారకు డీశ్లోకము నిట్లు తెనిగించెను :-

ఉ॥ ఇట్టుగ స్వరలోకజను లెవ్వనియేని ముఖామృతాంశుబిం
బంబున నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణరం
ధ్రంబను, నంజలిందవిలి త్రావుదురట్టి మునీంద్రలోకవం
ద్యుంబరముంబరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్ ॥

(ఆది 1 - 76)

కృష్ణద్వైపాయన మహర్షి ఓష్ఠపుటముల నుద్భవించిన భారత పుష్కర జలము అప్రమేయము, పుణ్యము, పవిత్రము, పాపహరము, మంగళ కరమని మూలమునందు భారత పుణ్యకథా ప్రశంస. నన్నయ భారత

* English Alliteration.

మూలమును అమృతమని నిరూపించినాడు; శ్రీకృష్ణద్వైపాయనుడను అమృతాంశుని ముఖబింబమున నుద్భవించిన భారతామృతమును, చెవులనెడి దోసిళ్ళతో పట్టి ప్రజలు త్రాగుచుందురో అటువంటి వేదవ్యాసునకు మునీంద్రలోకవంద్యునకు మిక్కిలి భక్తితో ప్రణామముచేసి " — ఈపద్యమున భారతము అమృతమే యని సావయవ రూపకాలంకార శోభితమైన పద్యముకూర్చి నిరూపించినాడు.

దీనికిముందు 72 పద్యమునందు ఈ భారతమునే ఆకాశగంగ యని నిరూపించి యున్నాడు.

ఉ॥ సాత్యవతేయ విష్ణుపదసంభవమై విబుధేశ్వరాబ్ధి సం
గత్యుపశోభితంబయి జగద్ధితంబగు భారతీయ భా
రత్యమలాపగౌఘము నిరంతర సంతత పుణ్యసంపద
న్నత్యభివృద్ధిసేయు వినినంగొనియాడిన నెల్లవారికిన్ "

(ఆది 1 – 72)

"గగనమేఖల దివమునఅుత నౌఱయు ముక్తిమయమాల " వ్యోమ గంగ, విష్ణుపాదోద్భవ ; మింట పెక్కుమార్గముల ప్రవహించి తుదకు శివుని జటాజూటముం జేరుకొన్నది. ఈ గాథ సమస్త పురాణ ప్రసిద్ధము. ఈయర్థము నీక్రిందిపద్యము హృద్యముగా వర్ణించినది :- (Figure). Add

సీ॥ బ్రహ్మాండభాండ సంపత్తికుక్షినిగల్గు
పద్మనాభుని పదాబ్జమునబుట్టి
అఖిలలోకాధ్యక్షుడై మించి విహరించు
శివు జటాజూటాగ్రసీమ నిలిచి "

వేదవ్యాసుడు విష్ణుసన్నిభుడని, నన్నయభట్టు ఇంతకుముందే పేర్కొన్నాడు : (ఆది 1 – 31)

" వివిధవేద తత్త్వవేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు

విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు"

పిమ్మట 72 పద్యములో వేదవ్యాసుడు విష్ణుభగవానుడే యనియు; భారతము ఆకాశగంగయనియు, నామిన్నేఱు తుదకు "విబుధేశ్వరాబ్ధి సంగతిచే శోభించుచున్న" దనియు సావయవరూపకాలంకార విలసితమైన పద్యమునుగూర్చి నన్నయ ప్రశంసాపాత్రుడగుచున్నాడు. ఈపద్య భావము మూలభారతములో నుండుట సంభవింపదు. ఈ పద్యమునందు నన్నయ ప్రదర్శించిన జ్యోతిశ్శాస్త్ర విజ్ఞానము అత్యద్భుతము. గంగావతరణ ఘట్టము విమర్శించునపుడు సావకాశముగా నావిషయమును పరిశీలింతము.

## 3. విజ్ఞానశబ్దవిచారణ

ఈగ్రంథము నన్నయభట్టారకుని విజ్ఞాన నిరతిని ముఖ్యముగా వివరించి తెలుపుటకు వ్రాయబడినది. అందుకు ఉపోద్ఘాతముగా భారతావతరణమునుగూర్చి ప్రశంసించితిమి. ఇకవిజ్ఞానమనగా నేమో మనము నిర్వచించుకొని పిమ్మట నామహనీయుడు తెనుగుభారతమున ప్రదర్శించిన విశేషములనువక్కాణించి,నన్నయవిజ్ఞాననిరతి యిట్టిదని నిరూపింతము.

ఇది విజ్ఞాన యుగ మనుచున్నారు. పాశ్చాత్త్యులు ఇంగ్లీషుభాషలో (Science) సైన్సు శబ్దము నే యర్థములో వాడుచున్నారో, మనవారు నేడు విజ్ఞానపదము నాయర్థములోనే వాడుచున్నారు. Science is an organised body of Knowledge వర్గీకరణాది విధానములచే సంస్కరింపబడి క్రమమునకు తెచ్చి కూర్చిన జ్ఞానమే విజ్ఞానమగునని పాశ్చాత్త్యుల నిర్వచనము. విజ్ఞానమనగా విశిష్టమైనజ్ఞానమని మనవారును తెలుపుచున్నారు. ఈవిశిష్టత ఎట్టిది? జ్ఞానమనగానేమి? జ్ఞానమును ఏవిశిష్టత ఆశ్రయించిన నది విజ్ఞానము కాగలదు? నన్నయభట్టారకుడు తాను "బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుడ నని" వక్కాణించుకొనియున్నాడు. అతని భావనలో నెట్టిది విజ్ఞానము? తాను రచించిన తెనుగు భారతములో నీవిజ్ఞానము నెట్లు ప్రదర్శించి

యున్నాఁడు ? అను ప్రశ్నలకు మనము ఉత్తరములను బడయవలసి యున్నది.

## 4. క్రమ మెఱుఁగని కలయికలు

పొలములో దొడ్డికట్టి నిలిపిన మేకలమంద, 'మేకతోకకు మేక, తోక మేకకుతోక' అన్నట్లు చిందరవందరగా పడియుండును. పల్లెటూళ్ళ సంతలలో ప్రజలును దొమ్మిగా మసలుదురు. సంతలకు వచ్చినబండ్లు ? ఒక బండి కాడిమీఁద మరొక బండి చక్రము; ఒక చక్రముమీఁదకు మరొక బండి పజ్జము. సంబరములలో క్రిక్కిఱిసి జనము; డప్పులు, డోళ్ళు కొట్టుకొనుచు పోవు ఊరేఁకలు; ఇవన్నియు నసహ్యముకలిగించు నక్రమసన్నివేశములు.

బారులు తీర్చి, వరుసతప్పక పోవుచీమలు; డ్రిల్లు చేయు పోలీసు భటులు; కవాతు చేయు మిలటరీ భటులు, రైల్వేస్టేషను పరిసరములో పోలీసు ఆజ్ఞానువర్తులై బండ్లను వరుసగా నిలుపుబండివాండ్రు; తమ స్థానములలో క్రమముగా కూరుచుండి నిశ్శబ్దముగా ప్రశ్నలకు జవాబులు వ్రాయు పరీక్షార్థులు; చెవుల పండువుగా జరుగు పాటకచ్చేరి – వీనిలో వరుస, క్రమము, ఆజ్ఞ, శిక్ష, శాస్త్రకట్టు మొదలగు లక్షణములు ఉండుటచేత చూడవేడుకగా, వినసొంపుగా నుండును. అక్రమసన్నివేశముతో దొమ్మి; దొమ్మితో అల్లరి; అల్లరితో అసహ్యము జనింపకమానవు. క్రమముతో శిక్ష, శిక్షతో హాయి; హాయివలన ఆనందము; ఆనందమువలన నభివృద్ధి; ఇవి యీ క్రమమున జనింపగలవు.

నిత్యజీవనములో, శిక్షాపూర్వకమైన క్రమగతి నవలంబింప గలుగుటలో మానవుని బుద్ధి వికసించి ప్రవర్ధమాన మగుచున్నది. ఈ లోకములో బహుప్రదేశములందు బహువిధముల వ్యాపించి భిన్నత్వ శంక దోపించు కార్యగతులందును వస్తుతతులందును ఏకత్వవివేకము గలుగుట శాస్త్రాభివృద్ధికి మూలము. అగ్ని ఇంటింటను వాడుకలో నున్నది. ఎన్ని యిండ్లలో, ఎన్ని విధములుగా ప్రతిష్ఠింపబడినను అగ్ని

మాత్రే మొక్కటే. చీకటులు పారద్రోలుచు, నూహారను, దేశదేశములను, ఖండఖండములను వెలిగించు లోకబాంధవుడు సూర్యు డొకడే దినదినము పూర్వోక్తమాత్రూర్వాయు తూర్పుదిక్కున బహువర్ణశోభితమై మెఱయు చున్న ఒక్కటే. పెక్కు రూపములు ధరించి బహుభంగుల తోచునది. సూక్ష్మముగా పరిశీలించి, విమర్శించి చూచునప్పుడు, ఇన్ని వేషములతో నిన్ని విధములుగా నగపడునది, అసలు ఒక్కటే నని ఆవస్తుతత్త్వము తేలిపోయి, భ్రమచే దాని కారోపింపబడుచున్న భిన్నభావము నశించి, యదార్థవివేకోదయమై, ఆమూలముగా శాస్త్రమభివృద్ధి చెందుచుండును. సృష్టిలో నితర జంతుకోటికి లేని యత్యద్భుత శక్తులు మానవునికి రెండు గలవు. అందొకటి భాషాజ్ఞానముతో కూడిన విమర్శనా సామర్థ్యము. రెండవది అగ్ని వశీకరణము. ఈ సాధకముల మూలముగా మానవుడు తన పరిసరమును జయించి, సృష్టికి తలకట్టై, ప్రకృతిని వశీకరణము చేసికొని, పెక్కు సందర్భములలో తానే ప్రకృతికి యజమానియై, భౌతికముగా ప్రకృతినిగూడ ఏల గలుగుచున్నాడు.

స్థావరజంగమాత్మకమై, లెక్కకుమీరిన సంఖ్యలుగల రూపములతో అక్షిగోచరమగుచున్న విశ్వమును అక్షికగోచరములైన విశేషములతోనిండిన యీవిశాల విశ్వమునందుగల చేతనాసీకము ఎట్లు పుట్టినది? సృష్టివ్యవహార మెట్లు జరుగు చున్నది? తుదకీ విశ్వమేమగును? అనుజిజ్ఞాస తొలుత వేదమంత్రద్రష్టలైన ఋషులమనస్సులలో పొడమినది. వారి తపోమహిమచే నీప్రశ్ననుసాధించి వేదములందు భద్రపఱిచిరి. వేదములసారము భారతము. భారతసారము భగవద్గీత. గీతలో జ్ఞానము నాలగవ అధ్యాయము నందును, విజ్ఞానము ఏడవ అధ్యాయము నందును వివరింపబడినవి. క్షణికములైన ఇహలోక విషయములందాసక్తులు కాక, మానవులు పరమునుగురించి ఎక్కువ కృషిచేయవలెననియు, కర్మఫలాపేక్షలేకయే విధివిహితకర్మల నాచరించి, సర్వమును భగవదర్పితము చేసి మోక్షము నొందవలెననియు గీత బోధించుచున్నది. నాల్గవ అధ్యాయములో జ్ఞానమనగా బ్రహ్మ

జ్ఞాన సహితమైన ప్రకృతిజ్ఞాన మనునర్థము తెల్లమగుచున్నది. *ఏడవ అధ్యాయములో ప్రకృతి పరిణామ విశేషములకు ప్రాధాన్య మిచ్చి తన్మూలమున సర్వాంతర్యామియు, సర్వశక్తుడును విశ్వనియంతరమైన భగవంతుని తెలిసికొని, పరముసాధింపుమని వక్కాణింప బడినది. భూమి, వాయువు, అనలము, నీరు, ఆకాశము నను పంచభూతము లును, జీవులకు అనుగ్రహింపబడిన మనోబుద్ధి అహంకారములను ప్రవృత్తులు మూడును, మొత్తము ఎనిమిది విధములుగా వ్యాప్తమై ప్రకృతిజీవులను పరివేష్టించియున్నది.

1. కాంతిసంపదచే మింటమెఱయు సూర్యచంద్రాది గోళములు. 2 వాతావరణమున వ్యాప్తిగను శబ్దము. 3. అగ్నికిగల ఉష్ణశక్తి. 4. మహీమండనము లైన పచ్చని ఓషధులు, చెట్లు. 5. దివ్యసౌర భోపేతములైన పుష్పరాజములు. 6. జలములకుగల తాపోపశమన, బీజాంకురోద్ధరణశక్తులు 7. సంతానోత్పత్తి సామర్థ్యసహితములైన జీవకోట్లు 8 మహాయోధుల క్షాత్రశక్తులు 9. మేధాశాలుర ధీశక్తులు 10. మహాఋషుల తపశ్శక్తులు.

ఇవన్నియు విజ్ఞానవర్గములో చేరినవే; పరాత్పరుని విభూతు లేయని విభూతియోగ విజ్ఞానయోగములు వక్కాణించుచున్నవి. ఆస్తికులును. భగవద్ధ్యానారాధన తత్పరులునైన భారతీయ ఋషులు భగవంతుని యందే సమస్తము కలదని కనిపెట్టిరి; విశ్వమంతటను భగవంతుని సందర్శించిరి.

"యోమాంపశ్యతి సర్వత్ర, సర్వంచమయి పశ్యతి" గీత 6-30 భారతీయసంస్కృతి యావత్తును ఈదృష్టితోనే పెంపొందింపబడినది.

---

* Gita VII - 8 to 11 enumerate the following :— 1. fLight of bright orbs 2 Sound propogated through air, 3. Heat energy of Fire. 4. Beauty of earthly plants, 5 Aroma of flowers 6. Germinating and thirst-quenching power of water. 7. Innumerable varietiest of life with wonderful procreative potencies 8. Manifestations of Energy as in the Prowess of mighty Warriors and 9. Intellectual genius of eminent men. 10. Concentrative Research of Sages. All these are bu Manifestations of Supreme Lord.

పాశ్చాత్యప్రకృతి పరిశోధకులకు ఈదృష్టి ఏమాత్రమును లేదు. వారి విజ్ఞాన గ్రంథములలో భగవత్ చింతన జిజ్ఞాస అనునవి కంచు కాగడాలు వేసి వెదకినను కానరావు. అందు భగవంతుని ప్రమేయమున్న పక్షమున నాగ్రంథము మతగ్రంథముగా పరిగణింపబడును గాని విజ్ఞానగ్రంథ మనిపించుకోదు. (Considered Religious but not Scientific)

పాశ్చాత్యవైజ్ఞానికులు సాధారణముగా నాస్తికులు ; దేవుడు లేడని భావించువారు. నాస్తికులుగాకున్న ఎగనాస్తికులగుదురు. (Agnostics). దేవునిఊసు వారికక్కరలేదు. "దేవుడుఉంటే ఉండుగాక ; ఉండకున్న మానెగాక ; వానిజోలి మనకెందుకు ? వాని గొడవ మనకేల ?" అని యుపేక్షించువారే ఎగనాస్తికులు '. (Agnostics). అట్టివారిచే రచింపబడు గ్రంథములలో దైవవిషయములైన వాక్యములు ఉండవు ; ఉండబోవు. పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రములు (Natural Sciences) నేడు శాఖోపశాఖలుగా పెరిగి మిక్కిలి విజృంభించు చున్నవి. అవి జ్ఞానగ్రంథములు సాంకేతిక పదజాలముతో నిండి (Full of Technical terms) సామాన్యులకు కొఱకబడవు. ఒకప్పుడు కొఱక బడినను, రసహీనములగుట ఆకర్షణీయములుకావు ; సరేకదా, పొడిదుమ్ముల వలె అసహ్యకారణములై జనసామాన్యము అంటుటకును, ముట్టుటకును గూడ జంకు గలిగించుచు నిరాకరింప బడుచున్నవి. వైజ్ఞానిక సత్యములను రసవంతముగాకూర్చి హృద్యముగా రచించి, పాఠకుల నాకర్షించి, జనసామాన్యముయొక్క ఆదరాభిమానములు బడయుటకు పడమటిదేశములలో ఇటీవల కొంతకాలము నుండి ప్రయత్నములు జరుగుచున్నవి. Spencer, Tyndall, Darwin, Sir James Jeans మొదలగు వైజ్ఞానిక శిరోమణులు కొరకరానికొయ్యలవంటి సాంకేతిక పదజాలమును, మ్రింగుటకు సాధ్యముగాని గణితవివరములను పరిహరించి, మంచిమంచి గ్రంథములు రచించి, ప్రజలదృష్టిని కొంతవఱకాకర్షింప గలిగిరి. ఇంకను మరికొన్ని గ్రంథము లిటీవల రచింపబడు చున్నవి. కాని మొత్తముమీద పడమటివైజ్ఞానికులు విజ్ఞానసత్యములను జన

సామాన్యమునకు చక్కగా బోధించుటకు చేసిన యత్నములలో సఫలమనోరథులైరని ఇంకను చెప్పనొప్పదు.

భారతీయ వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాసాదులు భగవత్ చింతనతో కూడిన విజ్ఞాన గ్రంథములు. అనుభవసిద్ధమైన ఎఱుక విజ్ఞాన మగుననియు, అనుభవసిద్ధముకానిది జ్ఞానమగుననియు గీతా వ్యాఖ్యానములు తెలుపుచున్నవి. పాశ్చాత్యులు Theoretical Knowledge అనునదే మనవారిచే జ్ఞానమనబడు చున్నది. Practical Knowledge అనునది మనవారి విజ్ఞానమునని తేలుచున్నది.

విశిష్టమైన జ్ఞానము — విజ్ఞానము. అనుభవసిద్ధమై స్థిరపడినపుడే జ్ఞానము — విజ్ఞానముకాగలదు. కాబట్టి అనుభవవిశిష్టమైన శాస్త్రీయ జ్ఞానము విజ్ఞానమగునని నిర్వచించుకొనుటకు అభ్యంతరము ఉండ కూడదు. ఉదాహరణముల మూలముగా ఈయంశమును స్పష్టము చేసికొందము.

పసుపును, సున్నమును గలిపిన పారాణి యగును. స్పష్టముగా బుజువు కానంతవరకును ఈవాక్యము జ్ఞానవిషయము. పచ్చని పసుపు గుండలో కొలదిగా నీరు కలిపి తెల్లని సున్నము నొకింత చేర్చినంతలో ఎఱ్ఱని పారాణి తయారగును. పారాణి వాడుకలోనికి వచ్చినపుడు విజ్ఞానవిషయమగును.

"తిలేతైలం గవిక్షీరం కాష్ఠే పావక మంతతః
ధియాధీరో విజానీయా దుపాయంచాస్యసిద్ధయే॥ (అరణ్యా. 32-27.)

కట్టెలలో నిప్పు ఉన్నది; ఆవులో పాలున్నవి; నూగింజలలో చమురున్నది. ఇ వేవియు బైటకు కానరావు; కాన రానంతవఱకు అవన్నియు జ్ఞానవిషయములే. కాష్ఠముల నొకకతో మథించి నిప్పు పుట్టించవలెను; ఆవుపాలు పితికి తీయవలెను; తిలాగర్భితమైన తైలమును ఉపాయముచే వెడలించి వాడుక కందియ్యవలె. అప్పు డివి విజ్ఞాన విషయములు కాగలవు. బుద్ధిమంతులు చక్కగా యోజించి, ఉపాయములను కనిపెట్టి, ఎక్కడ కవసరమైన యుక్తుల నక్కడ పన్ని తెలివితేటలతో ప్రయోగించి సమస్త కార్యములను సాధింప గల్గు

చున్నారు. వారి యుక్తులమూలముగా మానవజీవితమునకు సౌఖ్యము, సౌకర్యము, సహాయము లభించుచున్నవి; విజ్ఞానము వే విధముల నభివృద్ధి చెందుచున్నది. ఇట్లు -నుభవసిద్ధమై నిత్యోపయోగ విశిష్టమైన జ్ఞానము - విజ్ఞాన మనబడు చున్నది.

భగవద్గీత విజ్ఞానయోగము 4, 8, 9, 10, 11 శ్లోకములలోని విజ్ఞానాంశముననే పడమటి శాస్త్రజ్ఞులు ఈ క్రింది విషయములుగా బోధించుచున్నారు.

1. Acoustics శబ్ద (నాద) శాస్త్రము 2. Astronomy జ్యోతిశ్శాస్త్రము. 3. Biology జీవశాస్త్రము. 4. Botany వృక్ష,ఓషధిశాస్త్రములు. 5. Geography భూగోళశాస్త్రము, 6. Geology భూతత్వశాస్త్రము. 7. Hydrostatics జలశాస్త్రము. 8. Meteorology వాతావరణ శాస్త్రము. 9. Military Science సమర శాస్త్రము 10. Physics–Heat and Light భౌతికశాస్త్రము - తేజోష్ణశాస్త్రములు 11. Physiology శరీరనిర్మాణశాస్త్రము. 12. Psychology మానసిక, నైతిక శాస్త్రములు. 13. Zoology జంతుశాస్త్రము. వీనిని గూర్చి సంస్కృతభారతమున గల విషయములను, మూలమున లేకున్నను తెనుగు ప్రజల విజ్ఞానాభివృద్ధి గోరి నన్నయ స్వతంత్రముగా చేర్చిన విషయములను మనము చక్కగా వివరించి తెలిసికొందము.

పైని పేర్కొనిన శాస్త్రములన్నియు పాశ్చాత్యుల ప్రకృతిశాస్త్రములు. (Natural Sciences). పడమటి దేశములలో నివి శాఖోపశాఖలుగా పెరిగి పెంపొందుచున్నవి. పడమటివారి శాస్త్ర సజ్జకట్టులో ధర్మశాస్త్ర నీతిశాస్త్ర విషయములకు తావులేదు. మహాత్ముడు గాంధీ లోకముననొక గొప్ప సత్యమును పునః ప్రతిష్ఠించి ధన్యుడైనాడు.

**Moral Laws are as much Laws of Nature as Physical Laws.** భౌతిక ప్రకృతి సూత్రములెంత సత్యములో నైతిక ధర్మసూత్రములు కూడ అంతే సత్యములు; అవి అనుభవ సిద్ధములైన విజ్ఞానవిషయములు.

నైతిక ధర్మసూత్రములను నిర్లక్ష్యముచేసి త్రోసిపుచ్చ వలనుపడదని ఘంకామీద దెబ్బకొట్టి మహాత్ముడు భేరీలు మ్రోయించుచు, లోక మున కెలుగెత్తి చాటినాడు. శాస్త్రజిజ్ఞాసువుల దృష్టి ఇటుమరల్చి నాడు. ఈ మహాసత్యమును నన్నయభట్టారకుడు ఆనాడే కనిపెట్టి తానురచించిన భారతములో సందర్భశుద్ధి గమనించి పలుతావులలో పలుమరు ప్రవచించినాడు. తెనుగు భారత ప్రారంభమున మంగళ శ్లోకములో నీప్రవచనము దివ్యముగా ధ్వనించుచున్నది.

"శ్రీవాణీగిరిజాశ్చిరాయదధతో వక్షోముఖాంగేషు యే।
లోకానాం స్థితి మావహంత్య విహితాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషాస్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరా శ్శ్రేయసే॥"

శ్రీ,వాణీ, గిరిజలు జగన్మాతలు. శ్రీదేవిని వక్షమున ధరించి శ్రీపతి పురుషోత్తముడు, విష్ణుభగవానుడును, వాణీదేవి, తనసతిని, ముఖముల. ధరించి బ్రహ్మదేవుడును, స్వీయధర్మపత్ని గిరిజాదేవి కర్ధాంగమిచ్చి మహేశ్వరుడును త్రిమూర్తులను గౌరవించి, తాము త్రిమూర్తులై జగద్వంద్యులు కాగలిగిరి.

"ఆదిగర్భేశ్వరి, యాజ్ఞసేని, పాండవధర్మపత్ని, ద్రౌపదీదేవిని అవమానించి కౌరవాధములు దుర్యోధన దుశ్శాసనులు సోదర పుత్ర మిత్ర పరివారసమేతముగా మడిసిమట్టియైనారు. త్రిమూర్తుల గౌర వించి జాగ్రత్తగా మసలుకొనుడి" అని ధ్వనిగల హెచ్చరింపుతో దివ్యమైన మంగళశ్లోకము తెనుగుభారత ముఖమున ననుసంధించి, తానురచింపబోవు భారతకథావిధానమును సంగ్రహముగా మొదటనే సూచించుచు నన్నయభట్టారకు డీకృత్యాద్యవస్థనుండి చక్కగా బైట పడి ధన్యుడైనాడు. పిమ్మట

కం॥ తగునిది తగదని మొదలో
వగవక సాధులకు ఖేదవారల కెగ్గుల్
మొగిఁజేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబులైన భయంబుల్"

ఆది 1 - 85 పద్యము:

ఈ పద్యమునందు నీతి ధర్మసూత్ర మెంతో చక్కగా తెలుపబడినది. సరమ యను దేవశునని కుమారుడు, సారమేయుడను చిన్నవానిని జనమేజయుని తమ్ములు నిష్కారణముగా కొట్టి బాధించిన యాకుక్కచేత జనమేజయునకు చెప్పించిన నీతివాక్య రత్నమిది. ప్రపంచచరిత్ర యంతయు నీపద్యమునకు ఉదాహరణము. కేవల స్వార్థప్రోదితులై ఈ ధర్మసూత్రమును ధిక్కరించిన వారందరును అధోగతి పాలగుట నిశ్చయము. హిరణ్యకశిప, ఇంద్రజి, ద్రావణ, కీచక, దుర్యోధనాదుల చరిత్రము లాయా యుగములలో నీసూత్రము యదార్థ మని స్థాపించుచున్నవి. నవీనయుగములో క్రిందటి, పందొమ్మిదవ శతాబ్దములో నెపోలియన్ యోధుడును, ఈశతాబ్దములో హిట్లరు జర్మను నియంతయు నీ విజ్ఞానసూత్రమును ధిక్కరించి, పతితులై, దీనిని స్థిరపఱచినారు. 1919 సంవత్సరములో హిట్లరు నెపోలియనుల మధ్య జనరల్ డయ్యరు నాయకుడగు ఆంగ్ల సేనాని యొకడిది తథ్యమని బాగుగా నిరూపించినాడు. ఆసంవత్సరము ఏప్రిల్ పదమూడవ తేదీని జలియన్‌వాలాబాగులో సభనిమిత్తము సమావేశమైన వేలకొలది అమాయకప్రజపై నీ క్రూరకర్ముడు తుపాకీమందు కలంతవఱకు వదలక, ఘోరముగా గుండ్లు ప్రేల్చి ప్రేల్చి, లెక్కలేనంతమందిని చంపి నెత్తురుటేరులు ప్రవహింపజేసివారల "యుసురు పోసుకొనినాడు." తత్కాలమునం దీ గుండ్ల దెబ్బలు అందు సమావేశమైన జనసమూహమునకు తగిలి ప్రాణక్షయము కావించినను, తుదకా గుండ్లదెబ్బలు బ్రిటిష్‌వారికే తగిలి కొట్టినవి. రవి యస్తమింపని బ్రిటిష్‌సామ్రాజ్యమునే బెడిసికొట్టి, ముప్పదేండ్లైనకాకముందే ఆమహాసామ్రాజ్యమును ఛిన్నాభిన్నము చేసివైచినవి. పేదల యుసురును, సాధుజనుల గోలయు నూరకపోవు. వారల హింసించిన వ్యక్తుల కధికారమిచ్చిన రాజ్యసామ్రాజ్యములను కూకటివ్రేళ్ళతో కూలద్రోయగల మహాద్భుతశక్తి పేదసాదల దీనాలాపములకు కలదు. భగవంతునివలెనే అనాదినుండి యీ ధర్మసత్యమును మరల మరల ఋజువగుచునే యున్నది. సుమారు రెండువేల సంవత్సరముల క్రిందట

ప్లూటార్క్ నామధేయుడు, మహనీయుడు, గొప్ప జీవచరిత్ర గ్రంథము రచించెను. గ్రీసు రోము దేశములలో నుద్భవించిన మహా మహుల చరిత్రలను అందతడు రసవంతముగ కూర్చెను. ఆ గ్రంథ సారాంశమిది :—

* నీతిబలము తగ్గినకొలది జాతి బలము తగ్గి జాతి పతితమగుట నిక్కువము. నాడుప్లూటార్కును, పిమ్మట నన్నయయు నిన్న మొన్న గాంధిమహాత్ముడును ఈ ధర్మసూత్రము శాశ్వతమైన విజ్ఞానసత్య మని నిరూపించిరి.

నన్నయభట్టునకు స్త్రీపాత్రలయం దత్యంత గౌరవముకలదు. నన్నయ పిమ్మట నారువందల యేండ్లకు మహారాష్ట్ర దేశోద్ధారకుడైన శ్రీ ఛత్రపతి శివాజీమహారాజుద్భవించెను. అతడు తన తల్లి గఱపిన నీతులననుసరించి, స్త్రీలయందు మాతృత్వమే గమనించి ధన్యజీవి యయ్యెను. ఇటీవల శ్రీరామకృష్ణ పరమహంసకూడ స్త్రీవ్యక్తు లందఱును తన మాతృదేవతలేయని భావించెను. నన్నయభట్టు తాను తెనుగు భారతమున చిత్రించిన స్త్రీపాత్రలందఱును తన మాతృదేవ తలుగానే భావించి భారతము రచించెను. ఇందుకు రెండు ఉదాహరణ ములను పరిశీలింతము.

కుంతి తన భర్తయైనపాండురాజు కోరినను ఒకంతట క్షేత్రజ సంతానోత్పత్తికి అంగీకరింపలేదు. పున్నామనరకమున బడకుండ కాపుమని నిర్బంధము చేసి భర్త వేడుకోగా ఆమె యమ, వాయు, శక్రుల నారాధించి ధర్మజ, భీమార్జునులను ముగ్గురు కొడుకులం బడ సెను. 'తినినవారిదే వాపి; కనినవారిదే వాపి' అని లోకోక్తిగలదు. పాండురాజునకీ కొడుకులు చాలక, ఇంకను కొడుకులకొఱకు వాచి పోయి, సంతానార్థము కుంతిని మరల ప్రయత్నింపుమనెను. ఈవిష యమై పాండురాజునకును కుంతీదేవికిని జరిగిన సంభాషణము మూల

* "It is an oft proven certainity that the loss of moral saniyt will sooner or later entail political disintegration and national decay.

భారతమున గలదు. కుంతి ఇట్లనెను: "ఇంకను సంతానముకోరి, నేను పరపురుషు నంటితినేని అతడు నాల్గవ భర్తయగును. నలుగురు మగలతో సంగమించిన స్త్రీ స్వైరిణి యనిపించుకొనును; ఐదవవానిని గూడిన బంధకి యగుదును. ఈయపకీర్తి దోషములకు నన్ను పాల్పఱుప వల" దని వినయముతో పాండురాజును వేడుకొని అతనిసంకల్పము నుండి మరల్చెను.

ఇటీవలి విమర్శకులు కొందఱు కుంతీదేవి 'పచ్చి వ్యభిచారి' యనియు, కోడలు ద్రుపదపుత్రి తనవెత్తిపొడిచి యాక్షేపింప కుండ ముందరకాళ్ళకు బంధమువైచి ఆమెకు పంచపాండవులను భర్తలంజేసి కట్టిపెట్టెనని వ్రాయుటయే గాక ఉపన్యాసము లిచ్చిరి. కుంతి నిజముగా వ్యభిచారస్త్రీయే యైనపక్షమున భర్త కోరికపై పెక్కండ్రు పరపురుషులను బొందియుండును. మూలగ్రంథము జాగ్రతగా చదువక భారతపాత్రలను విమర్శించుట చాల అవివేకము; సాహసకార్యము.

నన్నయభట్టారకుడు ఈకుంతీ పాండురాజ సంవాద ఘట్టము (ఆది 123 : 77-80) ను తెనిగించక విడిచిపెట్టినాడు. విశేషించి మూలములో లేని యీక్రింది వాక్యములు స్వతంత్రముగారచించి తెనుగుభారతమున చేర్చి కుంతీపాండురాజులం గౌరవించి తన్ను తాను గౌరవించుకొనినాడు. (ఆది - 5 - 128) : —"పాండురాజు పరమోత్సవంబునం గుంతివలనం బురుషత్రయసమానం బయిన పుత్రత్రయంబు వడసి భువనత్రయ రాజ్యంబు వడసినంతియసుఖంబున సంతసిల్లి, కుమారులతోడి వినోదం బులం దగిలి యున్నంత" - ఇందు ఔదార్యమను కావ్యగుణము చక్కగా పోషింపబడినది.

మనము పరిశీలింపవలసిన రెండవ ఉదాహరణము ఊర్వశీ - అర్జున సంవాదము (ఆరణ్య 1 - 359, 360, 366, 367) సంఖ్యలుగల రచనలలో నీఘట్టము వర్ణితము. ఈరచనలు రమ్యశబ్దాలంకార భూషితములై అక్షరరమ్యములై విలసిల్లుచున్నవి.

359 - "అంతసూర్యాస్తమయ సమయమునం జంద్రుండుదయించి సాంద్రచంద్రికా విలాసంబున దిగ్వనితల నలంకరించుచుండ...ఊర్వశి

మందగమనంబునఁ బురందర నందనుమందిరంబున కరుగు దెంచిన, నప్పురుష సత్తముండు భయభక్తి సంభ్రమంబులతో ప్రత్యుత్థానంబును దండప్రణామంబునుఁజేసి కరకమలంబులు మొగిచి యిట్లనియె :-

360. "క॥ నను బుత్రస్నేహంబున
మనమున మన్నించి శుభసమగ్రునిఁజేయం
జనుదెంచి తీవు ముదమున
జనయిత్రీ! యేఁ గృతార్థజన్ముఁడ నైతిన్".

ఈఘట్టమున నూర్వశి, యర్జునుని కామినీ పిశాచమువలె పట్టి, పీడించి, భంగింపనెంచినది. కీ॥ శే॥ గురజాడ అప్పారావుగారి కరటక శాస్త్రి వాక్యములు ఈసందర్భమున తప్పక జ్ఞప్తికివచ్చుచున్నవి: "నాబోటి అల్పప్రజ్ఞ గలవాడు లభ్యం కానప్పుడెల్లా ఆంటినాచే ... యజ్ఞయాగాదులు చేసి టిక్కట్లు కొనుక్కొని, చచ్చిన తరువాత ప్రో – నాచ్" అయిన మహానుభావులకు గాని లభ్యముకాని ఊర్వశీ సమాగమము అర్జునునికి అప్రయత్నముగా — తనకుతానై లభించినది. ఇట్లు తనను కోరివచ్చిన అప్సరస, ఊర్వశి విషయమున నర్జునుడు అక్షరములా 'ఆంటినాచ్' అయి, నిర్వికార ధైర్యధుర్యుడైనాడు. తన సంగమ మపేక్షించి వచ్చిన దేవవిలాసిని, ఊర్వశియందు, అర్జునుడు, మాతృత్వదృష్టి మాత్రమే నిలిపి "మదీయ వంశకర్తయైన పురూరవునకు బత్నివైన కారణంబునను, బురందరునకు బరిచర్య యొనర్చుటను నాకు జననివగుట సందియంబులేదు. తల్లీ! నన్ను బుత్ర వాత్సల్యంబునం జూడుమని" ప్రార్థించినాడు (౩౬౨). ఇక్కడ అర్జునుని నోట నన్నయ పలికించిన 'పరిచర్య' పదమొక్కటియు నొక లక్ష విలువచేయును. శచీదేవివలె ధర్మపత్ని కాకున్నను, ఊర్వశి, దేవేంద్రుని భోగస్త్రీయై యతనిని సేవించుచున్నది. ఆసేవనే 'పరిచర్య' యని అర్జునుడు గౌరవభావముతో వక్కాణించి, ఊర్వశిని నిరాకరించినాడు. అందుల కింద్రుడలరి

"నీయట్టి ధైర్యవంతుని
నేయుగముల నెందుగాన మెన్నండును ధ

ర్మాయత్తమతివి మునులకు
నీయింద్రియజయము గీర్తనీయము తండ్రీ"

అని యర్జునుని శ్లాఘించినాడు (367).

## 5. సంగ్రహశీలత.

శ్లో: అర్థవ్యం తథ్యంహితం వాక్యం లఘు యుక్త మనుత్తరమ్॥
సభా 2-

"కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడ తెనుగున రచియింపు మధికధీయుక్త మెయిన్" అని రాజరాజు-నన్నపార్యుని నియమించెను. కావున యథామూలముగా భారతము తెనిగించ వలసిన యవసరము నన్నయకు లేకపోయినది. అందుచేత తెనుగు భారతము చాల సంక్షేపశీల మైనది.

అదియునుంగాక, తెనుగుప్రజకు సాధారణముగా ఓపిక చాల తక్కువ; విసువు ఎక్కువ; గ్రంథము విస్తారమైనకొలది దానిం జదువ వలెనను నపేక్షపాఠకులకు మందమగుచుండును. తెనుగువారి తత్త్వము చక్కగా వాడివడబోసిన నన్నయభట్టు తెనుగు పాఠకులకు ఇష్టమగురీతిచే అవలంబించి మూలమును చాల సంగ్రహపఱచి భారతము తెనిగించెను. అజగరోపాఖ్యానమైన తరువాత నరణ్యపర్వమున శరత్కాల వర్ణన వఱకు మాత్రమే నన్నయప్రణీతము. ఇంతవఱకును సంస్కృతమునగల మూలము (Great Primer) గ్రేట్ ప్రిమర్ తెనుగు అక్షరములతో వావిళ్ళవారు 1929 లో ముద్రించిన భారతభాగము రాయల్ సైజున సుమారు వేయిపుటలున్నది. నన్నయ విరచితమైన తెనుగుభారతము అదేసైజు, అదేఅక్షరములతో నాలుగు వందల ఏబది పుటలు మాత్రమున్నది. తెనుగుభారతము చంపకమాలాది పద్యములలో ఒకొక్క పాదము పూర్తికాగానే పంక్తి చాలించి, కాళీ విడిచి, తరువాతి పంక్తి ప్రారంభించి అచ్చున కూర్చినది. నాలుగువందలఏబది పుటలైనది. ఒక్కొక్కపుటలో ప్రతిపంక్తిని అక్షరములతోనింపి అచ్చుకూర్చిన పక్షమున నన్నయ ప్రణీత భారత

మంతయు రాయల్ సైజున గ్రేట్ ప్రిమర్ అక్షరములతో నాలుగు వందల పుటలకు మించనేరదు. నన్నయచేతిలో వేయిపుటలమూల గ్రంథము తెనుగులో నాలుగువందల పుటలకు దిగినది. నన్నయనూటి కరువదిపాళ్ళు, ఐదింట మూఁడుపాళ్ళు తగ్గించి, రెండుపాళ్ళు మాత్రమే నిలిపి తెనుగుభారతము కూర్చినాఁడు.

వైజ్ఞానిక గ్రంథములకు సంక్షేపశీలతి యొక వ్యుఖ్య లక్షణముగా చెప్పఁబడుచున్నది. 'Brevity is the soul of wit.' 'చమత్కార వాక్యము అల్పాక్షరయుక్తము' అని పాశ్చాత్య లోకోక్తి గలదు. ఇటీవలి తెనుగుప్రబంధములలో నీలక్షణము చాలవఱకు లోపించినది. బూరగాళ్ళవలె తెగబెఱిగిన వర్ణనలతో కూడుకొని, చూచుట కింపు గాక చదువుట కసహ్యమై యీ ప్రబంధములు కొన్ని జుగుప్స గొల్పుచున్నవి. నన్నయ విరచితభారతములో, ప్రబంధరచన కనుకూలము లైన కథలనేకము లున్నవి. యయాతిచరిత్ర, దుష్యంతకథ, ద్రౌపదీ స్వయంవరము, నలోపాఖ్యానము, సౌకన్యాఖ్యానములో నగునవి ప్రబంధానుకూలములైనను, నన్నపార్యునిచేతిలో నవి యతిసంగ్రహ శీలములై సర్వజనాకర్షణీయములై అక్షరరమ్యతతో నలరారుచున్నవి.

వైజ్ఞానికములైన రచన లెట్లుండవలెనో చక్కఁగా సూచించు శ్లోక రత్నమొకటి యీప్రస్తావనారంభమున నుటంకింపబడినది. వ్యాసరచిత మైన యీశ్లోకము సంస్కృత సభాపర్వద్వితీయాధ్యాయమున కలదు. సుభద్రాహరణమైన పిమ్మట కృష్ణభగవానుడు పాండవులున్న ఖాండవ ప్రస్థమున కరిగి, ముందుగా మేనత్త కుంతికి, నమస్కరించి, పిమ్మట చెల్లెలు సుభద్రను పలుకరించెను. ఆనంద బాష్పాన్వితలోచనములతో భద్రభాషిణి, సుభద్ర, అన్నగారి చెంతకు వచ్చెను. కృష్ణుఁ డామెతో సంభాషించిన వాక్యములను వ్యాసుడిట్లు వర్ణించెను :-

"అర్థ్యం, తథ్యం, హితం, వాక్యం, లఘు, యుక్త మనుత్తరమ్."

ఇందొకొక్కమాటకుగల అర్థములను విమర్శింతము: (సభా. 2-5)

1. అర్థ్యం = చక్కని అర్థము గలది; అర్థవంతమైనది. [పొల్లు

మాటలు - Husk, పాదపూర్ణములు - వ్యర్థపదములు కాని ]
మంచిమాటలతో కూడి సార్థకమైన పలుకులు.

తథ్యం = నిజము నిరూపించునవి ; యథార్థములు ; అబద్ధములు కానివి.

హితం = వినుట కింపుగా నుండి మేలు చేయునవి ; క్షేమ లాభముల గూర్చు ప్రయోజనకారులు.

లఘు = అల్పాక్షరములుగలవి ; తేలికయైనవి ; సంక్షేపశీలమైనవి

యుక్తం = యుక్తిమతమ్ అనగా న్యాయము, ఉపాయము. యుక్తి - వీనితో కూడుకొనినవి.

అనుత్తరమ్ = ఎదుటివారు ఆక్షేపించుటకు గాని, శంకించుటకుగాని అవకాశ మొసగని మేటిమాటలు ; శ్లేషపదములు కలది.

ఇట్టి లక్షణములుగల వాక్యములతో రచన సాగించి వైజ్ఞానిక విషయములను తెనుగు ప్రజకు బోధించవలయునను నియమము మనమున నిడుకొని, మఱువక, నన్నయ తెనుగున భారతము రచించె నని నొక్కివక్కాణింతుము. వైజ్ఞానిక విషయప్రమేయములేని వాక్యములుగూడ ఈసరళినే రచించి గ్రంథమంతయు రమణీయము, రసవంతము, విజ్ఞాన ప్రతిపాదకము గావించి, స్వకీయ విజ్ఞాననిరతిని పోషించుకొని నన్నయభట్టారకుడు ప్రశంసార్హుడైనాడు.

## 6. కాల ప్రకరణము

నేడు పాశ్చాత్య వైజ్ఞానికులు భౌతిక విషయములను చర్చించుచు వ్రాసిన గ్రంథములను పఠించి చూడగా, వారి రచనలకు ముఖ్యాధారములు, మూల సూత్రములు, మూడు ; మూడే గలవని స్పష్టము కాగలదు 1. కాలము, 4. దేశము 3. శక్తి. (Time, Space, and Energy). ద్రవ్యము దేశావృతము. (Matter is contained in Space). దేశ కాలములు పరస్పరాశ్రయములు. కాలము వినా దేశములేదు. దేశమువినా కాలములేదు. ఇటీవల సర్ జేమ్సు జీన్సు అను పాశ్చాత్యవైజ్ఞానికోత్తముడు తన గ్రంథములలో భూలోకము ను ప్రశంసించుచు "Our Home in Space and Time," దేశ కాల

దృష్ట్యా మన నివాసమైన యీభూగోళ క్షేత్రమని వర్ణించినాడు. దేశ కాలములు పరస్పరాశ్రయము లనెడి గొప్ప సత్యము పడమటివారికి నిన్న, నేడు బోధపడినది; మన పూర్వుల కీ సంగతి ఏనాడో తెలిసి యుండెను. దేశకాలములను జమిలిచేసి జోడించి, ద్వంద్వ సమాన ముగా నెన్నివేల సంవత్సరములనుండి మనవారు వాడుచున్నారో చెప్పలేము. పవనాంధము లన గాలి తగులని ద్రవ్యము లున్నవి; కాని కాలము తగులని దేదియు విశ్వమునలేదు. కాలము దురవగాహ మైనది (Time is Abstract). అది ద్రవ్యముగాదు. కంటి కగపడదు. దానిని పట్టుకొనుటకు, ముట్టుకొనుటకు, అంటుకొనుటకు ఎవరికిని సాధ్యముకాదు. కాలస్వభావమును జాగ్రత్తగా గమనించి, సంవత్స రాత్మకమైన కాలచక్రమును మొట్టమొదట చక్కగా గుఱుతించి వర్ణించిన మహాపురుషుడు దీర్ఘతము డను వేదఋషి. కాలము దుర్గ్రాహ్యమే; అయినను స్థూలదృష్టికితోచు సూర్యచంద్రుల గతులవల నను, వాని ననుసరించి, యుక్తిగల ధీశాలురు పన్నిన ఉపాయముల వలనను కాలగతి నిర్ణయింపవచ్చును. కాలమును కొలచుటకు కొల బద్దలు సూర్యచంద్రులే. ఉదయము మొదలు అస్తమించువఱకు సూర్యుడు తన దీప్తులచే లోకమును వెలిగించుచున్నాడు. సూర్యోదయ, అస్తమానముల మధ్యకాలము "పగలు" అనబడుచున్నది. పొద్దుక్రుంకి నంతనే, చీకటితో, నిశి జగత్తు నావరించుకొనును. నిశా కాలము రాత్రి. ఒక పగలును, ఒక రాత్రియు కలిపిన ఒక దిన మగును. ఇట్టి దినములు సుమారు ఇరువది తొమ్మిదిన్నర – ఇరువది తొమ్మిది దినముల పండ్రెండు గంటల నలుబది నాలుగు మినిట్ల 2.87 సెకెండ్లకాలములో చంద్రుడొకసారి క్రాంతి వృత్తమును చుట్టి రాగలడు. చాంద్రమానరీత్యా ఈకాలమొక నెల. ఇట్టివి పండ్రెండు నెలలైన 354 దినముల 8 గంటల చిల్లరయగును. భూమి ఒకసారి సూర్యునిచుట్టి వచ్చుటకు 365 దినముల 5 గంటల 48 మినిట్ల 49.7 సెకెండ్లగును. ఇది సౌర సంవత్సరము. చాంద్రమాన సౌరమాన సంవత్సర పరిమితికి తేడా సుమారు పది దినముల, ఇరువదియొక గంట

చిల్లర. సూక్ష్మగణితసాధ్యమైన యీ లెక్కను బట్టి యీనాటివఱకు నెల, ఈనాటివఱకు సంవత్సరమని నిర్ణయించుట సాధ్యము కాదు. ఆచరణయోగ్యము, ననుష్ఠాన సాధ్యము నైన మరొక పద్ధతి జన సామాన్యమునకు కావలసి వచ్చినది. చిల్లర లెక్కలను తరువాత సర్దుకోవచ్చును; 354 — 365 మధ్య సదుపాయము ననుకూలమునైన ఏసంఖ్యను సంవత్సర పరిగణనమునకు అవలంబింపవలెను? అని దీర్ఘత ముడు యోజించి చూచెను. అనేక కారణములనుబట్టి 360 చాల సదు పాయమగునని యాఋషి నిశ్చయించెను. 30 దినములు నెల; పండ్రెండు నెలలు సంవత్సరము. అనగా 360 దినములు సంవత్సరము. తిథుల నా ప్రకారము సర్దుకో వచ్చును. ఇక చాంద్రమాన సౌరమానముల సమన్వయించుకొని ఋతువుల సంరక్షించుకొనుటకు మూడేండ్లలోపున నొక యధికమాసము వేసికొనిన సరిపోవును.

ఏమనగా చాంద్ర, సౌరమాన వత్సరములకు సంవత్సరమునకు పది దినములు సుమారు తేడా. మూడు సంవత్సరములలోపున నొక అధికమాసము $3 \times 10 = 30$ దినములుచేర్చి రెంటిని సరిచేయవచ్చును. (చూ I - 25 - 8 ఋగ్వేదము.) "వేదమాసోధృతవ్రతో ద్వాదశః ప్రజావతః వేదాయఉపజాయతే" కాబట్టి 360 దినములుగల సంవ త్సరము, ముప్పది దినముల మాసము, ఇవి లోకమునకు దీర్ఘతమ మహాఋషి పెట్టినభిక్షు.

అంతేకాదు. సూర్య రథమునకు చక్రమొకటే. ఈ చక్రము జ్యోతిశ్శాస్త్ర రీత్యా 360 దినములుగల సంవత్సరాత్మక చక్రము. విశేషించి రేఖాగణితశాస్త్రదృష్ట్యా (Geometry) రేఖా గణితచక్రము నకు 360 డిగ్రీలు. దినమునకొక డిగ్రీ. ఈయేర్పాటు మూలముగా క్షేత్రగణిత జ్యోతిర్గణితములు ఏకచక్రాధారము గలవైనవి. (Circle) చక్రమునకు 360 డిగ్రీలు. ఇందులో సగము 180 డిగ్రీలు. (Bisect a circle and you get two semicircles; each of 180°) "దళీకృతం చక్ర ముశంతిచాపం; (Bisect a semicircle, you get quadrants.) కోదండ ఖండం ఖలు తుర్యగోళం. తుర్యగోళమున 90 డిగ్రీలుగల

(Right Angle) సరికోణమున్నది. ఈనాటి విజ్ఞానశాస్త్రమునకు తొంబది డిగ్రీలుగల సరికోణము (Right Angle with 90°) పునాది – ఈపునాది వైచినదిట్ట దీర్ఘతమ ఋషీశ్వరుడే. రేఖాగణితము గ్రీసు దేశస్థులలో పైథాగరస్, యూక్లిడ్ మొదలగువారు కనిపెట్టి మనకిచ్చిరనుట వట్టి కల్ల; పచ్చి యబద్ధము. చదువుడీ వేదమంత్రములను :-

i. 164 – 48 "ద్వాదశ ప్రధయశ్చక్రమేకం త్రీణినభ్యానిక ఉతచ్చికేత తస్మిన్ త్సాకం త్రిశతాన శంకవోర్పితాః షష్ఠిర్నచలాచలాసః" సంవత్సరాత్మక చక్రమునకు 300 + 60 = 360 శేకులు (దినములు). నేమి భాగములు పంన్రెండు (మాసములు లేదా ద్వాదశ రాసులు). దీనికి నాభులు మూడు (రెండు కేంద్రములు, ఒకమధ్యనాభి).

i. 164 – 11 : "ద్వాదశారం నహితజ్జరాయ వర్వర్తి చక్రం పరిద్యామతస్య ఆపుత్రా అగ్నేమిధునాసో అత్రసప్తశతాని వింశతిశ్చతస్థు) క్రాంతిచక్రము మార్పులేనిది. దానికి వార్ధక్యము (నాశనము) లేదు. దానికి పంన్రెండు శేకులున్నవి. రెండురెండు చొప్పున జతలు కట్టుకొని ఏడునందల ఇరువది (ఆకులు) మంది పుత్రులా చక్రమున నున్నారు.

దుర్జ్ఞేయము, దుర్గ్రాహ్యము (Abstract) నైన కాలవిశేషములను జనసామాన్యములకు కూడ చక్కగా బోధపఱుపగోరి వ్యాసభగవానుడు పంచమ వేదమైన భారతమూలమునందు, దీర్ఘతమోక్తము లైన శ్లోకరత్నముల అర్థము చక్కగా స్ఫురింపజేయు వర్ణనలను, దృశ్యములను చేర్చి వన్నె కూర్చినాడు. భారతారంభమందే (ఆది I. - 253 - 255) ఈ క్రింది శ్లోకములు కలవు :–

253. కాలమూల మిదం సర్వంభావా భావౌ సుఖాసుఖే కాలః సృజతి భూతాని కాలస్సంహారతే ప్రజాః

254. కాలః ప్రజానిర్దహాతి కాలః శమయతేపునః కాలోహి కురుతేభావాన్ సర్వాన్ లోకేశుభా శుభాన్

255. కాలస్సంక్షిపతే సర్వాః ప్రజావిసృజతేపునః కాలస్సుప్తేషు జాగర్తికాలోహి దురతిక్రమః

నన్నయభట్టారకుడు మఱచిపోయెనో? యేమో! కాని తెనిగింపక ఈశ్లోకములను వదిలిపెట్టుట మిగుల శోచనీయము.

పిమ్మట మనము ఉదంకుని చరిత్రమును చదువుదము. (ఆది 1 - 93).

"అయ్యుదంకుడు గురుహిత కార్యధురంధరుండై, గురుపత్నీనియోగంబునం బౌష్యుండను మహారాజు దేవికుండలంబులం బ్రతిగ్రహించి తేరంబూని వనంబులో నొక్కరుండ చనువాఁడెదుర నొక్క మహోక్షంబునెక్కి చనుదెంచువాని నొక్క దివ్య పురుషుంగని వాని పన్నిన వృషభగోమయ భక్షణంబు సేసి యమ్మహాత్ము ననుగ్రహంబు వడసి...

108. (ఉరగ లోకంబున కరిగి) యందు సితాసిత తంతు సంతాన పటంబు ననువయించుచున్న వారి, నిద్దఱ స్త్రీలను, ద్వాదశార చక్రంబుం బరివర్తింపించు చున్నవారి నాఱ్వురఁ గుమారులను అతి ప్రమాణ తురంగంబు నెక్కిన వాని మహాతేజస్వి నొక్క దివ్య పురుషునిం గని విపులార్థవంతంబులైన మంత్రంబుల నతి భక్తి యుక్తుండై స్తుతించిన ...

118. ఈదృశ్యముల యర్థము గురువు, ఉదంకున కిట్లు వివరించెను:

సీ॥ అప్పురుషుం డింద్రు డయ్యుక్షమైరావతంబు
గోమయ మమృతంబు నాగ
భువనంబులోగన్న పొలతు లిద్దఱు ధాత
యును విధాతయు వారి యనువయించు
సితకృష్ణతంతురాజితతంత్రమది యహో
రాత్రముల్ ద్వాదశారములు గలుగు
చక్రంబు మాసాత్మసంవత్సరంబు,
గుమారుల య్యాఱ్వురు మఱియు ఋతువు
లత్తురంగ మగ్ని యప్పురుషుండు
పర్జన్యు డింద్రసఖుడు...."

ఋగ్వేదమునందు ఉషస్సును, దివారాత్రములను ప్రశంసించు సూక్తము లనేకము లున్నవి. భగవన్నియామకము ననుసరించి దివారాత్రములు తమలో దాము స్పర్ధలుబడక, సంఘర్షణము నొందక,

దేనివేళ కదివచ్చి, కాలము సరిపడినంతలో సౌమనస్యముతో రెండవ దానికి తావిచ్చి తాను నెమ్మదిగా తొలగిపోవుచు సమన్వయము పాలించుచున్నవి. వరుస తప్పక, క్రమమును పాటించుచు, రాత్రింబవళ్ళు ఒకదాని వెంబడి నొకటి సౌమ్యముగా వచ్చుచు బోవుచున్నవి. ఈ యర్థము సమస్త జనుల యెదుట కనులకు కట్టినట్లు కనబఱచుటకే, ధాతవిధాతలను పొలతు రిద్దఱును, వారు చాచిన పడుగును, ఉదంకునికి చూపబడినవి. ఆ పడుగులో ఒక తెల్ల దారమును, దాని తరువాత నల్లదారమును, నల్ల దారము ప్రక్క తెల్ల దారమును, తెల్లదారము తరువాత నల్ల దారమును, ఒకదాని వెంబడి మరొకటి కూర్పబడినవి. వికల్ప నిర్మాణశీలమైన యీ మగ్గమునందు తెల్లదారము పగటిని నల్లదారము రాత్రిని సూచించుచున్నవి. అహోరాత్ర తంత్రము ఈ సితాసిత తంతు సంధానమిషమున చక్కగా ప్రదర్శింపబడుచున్నది. ఆ ప్రక్కనేగల ద్వాదశారచక్రము సంవత్సరాత్మకమైన కాలచక్రము. అందలి పండ్రెండాకులును పండ్రెండు మాసములు. అవి మాసాత్మకములు కావచ్చు. రాశ్యాత్మకములు గావచ్చు. రెండేసి మాసములు జతలుగా కూడి ఆఱు ఋతువు లగుచున్నవి. ఋతువు లారును ద్వాదశారచక్రము ననువయించు కుమారు లాఱ్వురుగా నిరూపింపబడి, ఉదంకున కట్లే చూపబడెను. షడ్రుతు, ద్వాదశ మాసాత్మకమైన కాలతంత్రము (Gerahic presentation) ఈ చక్రరూపమున, ప్రత్యక్షముగా మానవులకు ప్రదర్శింపబడినది.

కాలచక్రవివరణ బ్రహ్మసభావర్ణన ఘట్టమునందుకూడ మూల భారతములో గలదు. (సభా 11-36-38)

36. క్షణా, లవా, ముహూర్తాశ్చ దివారాత్రిస్తథైవచ

37. అర్ధమాసాశ్చ మాసాశ్చ ఋతవః షట్చభారత సంవత్సరాః పంచ యుగ మహోరాత్ర...

38. కాలచక్రంచ తద్దివ్యం నిత్య మక్షయమవ్యయమ్

నన్నయ యీశ్లోకముల నిట్లు తెనిగించినాడు :- (సభా - 80)

"క్షణలవముహూర్తాహోరాత్ర పక్షమాస ఋతుసంవత్సర యుగాత్మకంబైన కాలచక్రంబు" బ్రహ్మసభం గలదు.

క్షణలవములకంటె సూక్ష్మతరములైన కాలవిభాగములు భారతమున వేదవ్యాసుడిచ్చి యుండలేదు. కాని క్షణలవములకంటె సూక్ష్మతరముగా విభజించిన కాలవిజ్ఞానము మైత్రేయ మహామునికి గలదు. భాగవత తృతీయస్కంధమున విదురమైత్రేయ సంవాదఘట్టమున, నావివరములు సంస్కృత భాగవతమున (113-10) గలవు. నన్నయభట్టారకుడు "బ్రహ్మాండాది నానాపురాణవిజ్ఞాన నిరతుడు". ఇటీవల పాశ్చాత్యులు కనిపెట్టగలిగిన వెలుగు వేగము Velocity of Light నన్నయభట్టారకుడు తొమ్మిది శతాబ్దములకు ముందు ఎఱిగియుండెను. సంస్కృత భారతమూలమున నీ విషయములేదు. లేకపోయినను, తెనుగుప్రజల విజ్ఞానాభివృద్ధికోరి భారతార్థమును తెనుగునరచించిన విజ్ఞాన నిరతుడు నన్నయభట్టు. సందర్భశుద్ధి గమనించి భారత స్వర్ణభూషణము వెల నిర్ణయింపరాని యీ విజ్ఞాన రత్నమును నేర్పు దీపింప పొదిగి తెనుగు భారతమునకు వన్నె తెచ్చినాడు. మేటి వజ్రము మంటి దిబ్బలో పడియున్నట్లు బ్రాయసకాంద్ర యజ్ఞానముచే బహుకాల మిది యజ్ఞాతముగా పడియుండవలసి వచ్చెను. తెనుగు భారతమును ముద్రించి లోకోపకారము చేయవలయునను సదుద్దేశ చోదితులైన ముద్రాపకులును, ముద్రాపకులుకూర్చి యిచ్చిన చిత్తులందిద్ది ముద్రణకాయత్తము గావించిన పరిష్కర్తలును, కుక్కుటములవలె, ఈ రత్నప్రభాప్రాశస్త్యములను గుఱుతింప జాలకపోవుట తెనుగునాడు చేసికొనిన దురదృష్టము. జయపురాధీశులు, సాహిత్య సామ్రాట్ శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారును, తెనుగునలువ, శ్రీమారేపల్లి రామచంద్రశాస్త్రి - కవిగారును, కొన్ని యచ్చుప్రతులను, పెక్కు తాళపత్ర ప్రతులనుజూచి, పాఠాంతరములు వేయుచు పరిష్కరించి. విశాఖపట్టణమున ముద్రించి ప్రకటించిన భారత ప్రతిలో నీవెలుగువేగము సరిగా నీయబడినది. నన్నయకు పిమ్మట నాలుగువందల యేండ్ల నాడున్న సాయణమాధవులు విద్యారణ్య భాష్యమనుపేర ఋగ్వేదభాష్యము రచించిరి. వేదమునర్థము చేసికొనుటకు ఆధారము ప్రాక్ప్రతీచీపండితు లందఱకును

ఈ విద్యారణ్యాభాష్యమే. ఋగ్వేద ప్రథమ మండలము నందుగల ఏబదవసూక్తము సౌరసూక్తము. ఆ మంత్రద్రష్ట ప్రస్కణ్వ మహాఋషి. విశ్వమున వెలుగు (Light) నకు గలవేగము మరి దేనికిని లేదని ప్రస్కణ్వుడు తెలిపియుండెను. * ఈమంత్రమునకు వ్యాఖ్యానము వ్రాయుచు సాయణమాధవాచార్యులవారు "యోజనానాం సహస్రే ద్వే, శతే ద్వే, ద్వేచ యోజనే, ఏకేననిమిషార్థేన క్రమమాణ నమోస్తుతే" అని వెలుగు వేగమును వక్కాణించిరి. విద్యారణ్యుల పిమ్మట నొక శతాబ్దములోనుండిన కవిసార్వభౌముడు, శ్రీనాథుడు, స్కాందపురాణము నుండి కాశీఖండము తెనిగించెను. స్కాందపురాణము మూలమున లేకున్నను, సూర్యలోకవర్ణన సందర్భమున శ్రీనాథుడుకూడ వెలుగు వేగము "నిమేషార్థమున రెండువేల రెండువందల యోజనముల" ని తెలిపియుండుటచూచి యద్భుతపడితిని. ఇటీవల భాస్కరరామాయణము చదువుచుండ, నందు, మల్లికార్జునభట్టు తెనిగించిన కిష్కింధాకాండ భాగము 578వ రచనమున వెలుగువేగము నిర్వచింపబడెనని తెలిసికొంటిని. సుగ్రీవుడు సీతనువెదకుటకు పడమటి దిక్కునకు సుషేణు నంపుచు తెలిపిన విశేషములలో నిట్లుగలదు. "ద్విసహస్ర యోజన పర్యంతంబు నిమిషార్థంబునగమించు నాసూర్యుండు" మల్లికార్జునభట్టు 13 - 14 శతాబ్దములనాటివాడు. భాగవత పంచమస్కంధము నందును ఈవేగము తెలుపబడెను.

ఇట్లు రామాయణము తెనిగించిన మల్లికార్జునభట్టునకును కాశీఖండము తెనిగించిన శ్రీనాథునకుని, వేదవ్యాఖ్యాత విద్యారణ్యులకును బహుశతాబ్దములముందుండిన నన్నయభట్టునకు మూలభారతమున లేకున్నను వెలుగు వేగమెట్లు తెలిసినది? అది ఎక్కడ నెందుకు తెలుపవలసి వచ్చినది? అతడు తెలిపినలెక్క ఈనాటివిజ్ఞాన వేత్తల లెక్కలకెట్లు సరిపోవుచున్నది? అను ప్రశ్నలకు మనము సమాధానములిచ్చి నన్నయ్య విజ్ఞాననిరతి నిరూపింప వలసియున్నది.

---

* I 50 - 4; "తరణిర్ విశ్వదర్శతో జ్యోతిష్కృదసి సూర్య విశ్వమాభాసి రోచనం"

ఆదిపర్వము సప్తమాశ్వాసమున నర్జునునకును, అంగారపర్ణునకును జరిగినసంవాదములో నాగంధర్వుడు "మీరుపాండవులు తాపత్యులు" ని వక్కాణించెను, మేము "తపతి కపత్యులమైన తెఱగు చెప్పుమయ్య" యని అర్జునుడడిగెను. సూర్యపుత్రియగు తపతినిజూని పౌరవవంశజుడగు సంవరుణుడామెను మోహించి "తదీయగుణమయ పాశబద్ధుండునుం బోలె గదలనేరక, తన్ని వేశిత మానసుండునుంబోలెఁ దన్నెఱుంగక, తద్రూపామృత పానంబున ననిమిషత్వంబు నొందిన తన నయనంబులు దానియంద నిలిపెను. తపతిగూడ సంవరుణుని ప్రేమించి, సూర్యు నారాధించి తన్ను బడయుమని, అతనికి ఉపాయముచెప్పి యదృశ్య యయ్యెను. సంవరుణుడు, సూర్యునారాధించుచు, తన పురోహితు వసిష్ఠుం దలచెను. వసిష్ఠుడు తపతీ సంవరుణులు పరస్పర ప్రేమపాశబద్ధు లగుట యెఱిగి, సంవరణుని కొఱకు తపతినిమ్మని సూర్యునడుగ బోయెను. (ఆది. 7 – 85).

చ॥ జగదభివంద్యు డాతఁడమసమ్మతి సంవరణప్రయోజనం
బొగినొనరింపఁగా నియుతయోజనముల్ సనిలోకలోచనుం,
డగు దిననాథునాతత సహస్ర కరుంగని సన్నుతించె న
త్యగణిత వేదమంత్రముల నమ్మునినాథు డతి ప్రియంబుతోన్ ॥

భూగోళస్థితుడైన వసిష్ఠుడు, నియుతయోజనముల దూరమున నున్న సూర్యమండలమును చేరెను. నియుత మనగా లక్ష. భూమండల సూర్యమండల మధ్యదూరము లక్షయోజనములని నన్నయభట్టు ఈ పద్యము ప్రవచించినాడు. యోజనమనగా నెన్ని మైళ్ళు అగునో ఈ దిగువ చర్చింతము. భూగోళ సూర్యగోళముల దూరము లక్షయోజ నములని నన్నయ నిర్వచనము. ఇదికూడ మూలమున లేదు. నవీన విజ్ఞానము దీని నంగీకరించునోలేదో దిగువచూతము.

వసిష్ఠుడు సూర్యమండలమున కరిగి సంవరణునికి తపతినిచ్చి పెండ్లి చేయుమని సూర్యు నడిగెను. కూతులగన్న ఫలము సద్ధర్మపరులైన వరుల కిచ్చుటేగదా ? సూర్యుడు తన కూతు, తపతిని, సంవరుణున కిచ్చుట కంగీకరించి యా పెండ్లికూతును వసిష్ఠునితో భూలోకమునకు

పంపెను. "నిమిషార్థంబున రెండు వేల యోజనంబులు నడుచు సూర్యు రథము" నని వెలుగు వేగము తెనుగు ప్రజలకు తెలుపుటకు నన్నయకు తగిన సందర్భము లభించినది. ఈయవకాశము జారబెట్టక విజ్ఞాననిరతుడగు నన్నయభట్టు, మూలమున లేకున్నను, ఇందు జేర్చి వంద్యుడగు చున్నాడు.

నన్నయభట్టు విద్యారణ్యులు శ్రీనాథుడు మల్లికార్జునభట్టులోనగు మహామహులందరును వెలుగు వేగము నుగ్గడించుచు నిమిషశబ్దమును ప్రయోగించినారు. ఇంగ్లీషు వారీ దేశమున నడుగిడి అధికారమును వృద్ధిచేసికొనుచుండిన దినములలో నెవ్వడో అభాజనుడు * నిమేషమునకు ఇంగ్లీషుమినిటునకు పర్యాయపదముగా వాడినాడు. ఆపాడుపని బ్రౌనుదొర చేయలేదు - అనివకాశించితురు - మినిటునకు అరువది సెకండ్లు. అరువది సెకెండ్లుగల పడమటి మినిటుతో నిమేషమును సమీకరించి హిమాలయమంత గొప్పతప్పుచేసి యా మూఢుడు మన విజ్ఞానమభివృద్ధి చెందకుండ బొమ్మ్మచెముడుకంప పాతి యరికట్టినాడు. నిమిషమనగానేమో మైత్రేయునడిగి తెలిసికొందము.

మనవారు ద్రవ్యలేశమును పరమాణువనుట అందరమెఱుగుదుము.

---

| | | | |
|---|---|---|---|
| * 2 పరమాణువుల | కాలము | 1 అణు కాలము | (పరమాణువుల సంఖ్య 2 |
| 3 అణువుల | కాలము | 1 త్రసరేణు " | (ఇందు కాల పరమాణువుల సంఖ్య 6 |
| 3 త్రసరేణువుల | కాలము | 1 త్రుటి " | [ " 3 × 6 = 18 |
| 100 త్రుటుల | కాలము | 1 వేధ " | [ " 100 × 18 = 1800 |
| 3 వేధలు | కాలము | 1 లవ " | " 3 × 1800 = 5400 |
| 3 లవముల | కాలము | 1 నిమేషము " | ( ఇందు 3 × 5400 = 16200 పరమాణువుల కాలము గలదు. |
| 3 నిమేషములు | | 1 క్షణము | ( ఇందు 3 × 16,200 = 48,600 పరమాణువుల కాలము గలదు |
| 5 క్షణములు | | 1 కాష్ఠ | ( ఇందు 5 × 48,600 = 2,43,00[illegible] పరమాణువుల కాలము గలదు.) |

1 కాష్ఠ కాలములో 3 × 5 = 15 నిమేషములు గలవు. [తరువాత పేజీ]

ద్రవ్యము దేశావరణమధ్య స్థితము. దేశకాలముల వినాభావ సంబంధము కలవి. ద్రవ్యదేశము పరమాణువైనపుడు కాలదేశము కూడ పరమాణువేయగుట న్యాయ్యము. ఈన్యాయ్యమును పాటించి కాల తత్త్వవేత్త, మైత్రేయుడు, కాలదేశమును గూడ పరమాణువనియే వ్యవహరించినాడు.

భారతీయుల నిమేషము $1 =$ ఇంగ్లీషువారి $1$ సెకండులో $\frac{16}{75}$ అంశ

నిమిషార్ధము $= \frac{16}{75} \times \frac{1}{2} = \frac{8}{75}$

నిమిషార్ధములో వెలుగు 2202 యోజనములు పోవును. యోజనమునకు క్రోసులు నాలుగు; క్రోసునకు 2000 బారలు. బారలకు

[ 33 పేజీ తరువాయి ]

15 నిమేషములు కాష్ఠ †

30 కాష్ఠలు 1 కళ

30 కళలు 1 ముహూర్తము

30 ముహూర్తములు 1 దినారాత్రము $= 24$ గంటలు :

$= 24 \times 60$ మినిట్లు

నిమేషములు $= 24 \times 60 \times 60$ సెకండ్లు

$15 \times 30 \times 30 \times 30$ $= 24 \times 60 \times 60$ సెకండ్లు

$$1 \text{ నిమేషము} = \frac{24 \times 60 \times 60}{15 \times 30 \times 30 \times 30} = \frac{16}{75}$$

భాగ III : 11 — 5 6. 7

5॥ అణుర్ద్వౌపరమాణుస్యాత్ త్రసరేణుస్త్రయస్స్మృతః

6॥ త్రసరేణు త్రిక భుంక్తే యః కాలః స త్రుటిస్స్మృతః
శతభాగస్తు వేధస్యాత్త్రిభిస్తులవస్స్మృతః

7॥ నిమేష స్త్రిలవో జ్ఞేయం అమ్నాత స్తేత్రయః క్షణః
క్షణవాన్ పంచవిదుః కాష్ఠాన్

† మఱియు సంస్కృతమార్కండేయ పురాణము 43 - 23, 24.

23॥ నిమేషైర్దశభిః కాష్ఠాశథాపంచభి రుచ్యతే,
కళాత్రింశచ్చ తై కాష్ఠాముహూర్త త్రింశదేవతాః

24॥ అహోరాత్రమ్ ముహూర్తానాంన్నృణామ్
త్రింశత్తు తైస్మృతమ్ ॥

...ండ* లనిగూడ పేరు గలదు. [Light of Asia. Edwin Arnold

బార = దండ = 2 ఇంగ్లీషు గజములు = 6 అడుగులు

రెండు మైళ్ళు ఒక క్రోసని తప్పు అభిప్రాయము మనవారి నావేశించి నది. రెండుమైళ్ళు అనగా $2\times1760 = 3520$ గజములు మాత్రమే యగును; క్రోసు 2000 బారలు (దండలు) =4000 గజములు. రెండు మైళ్ళు క్రోసు కంటె 480 గజములు తక్కువగను.

యోజనము = 4 క్రోసులు = $4\times2 = 8$ మైళ్ళు + $(4\times480)$ = 1920 గజములు అనగా 1760+160

= 9 మైళ్ళు 160 గజములు = $9\frac{1}{11}$ ఇంగ్లీషు మైళ్ళు.

$\frac{8}{75}$ సెకెండ్లలో వెలుగు 2202 యోజనములు; $\frac{2202\times100}{11}$ ఇంగ్లీషు మైళ్ళు.

1 సెకండులో వెలుగు $\frac{2202\times100}{11}\times\frac{75}{8}$ ఇంగ్లీషు మైళ్లు.

= 1,87,670 మైళ్ళు.

ఇంగ్లీషు లెక్క ప్రకారము వెలుగు 1,86,325 మైళ్ళు పోవును.

నన్నయభట్టు ఈవెలుగు వేగమును ఎక్కడ సంగ్రహించి తెచ్చి ఈఘట్టమున చేర్చినాడో నాకు తెలియలేదు. ♦

---

* Edwin Arnold దొరగారు "ఏషియాఖండజ్యోతి"యను పేరుగల బుద్ధ చరిత్ర రచించి వందు వెయ్యెను. బుద్ధుడు తన గురువు విశ్వామిత్రు నొద్ద విద్యాభ్యాసము చేయునపుడు పరమాణువు మొదలుగా కాలమానములను (బారలు) దండలలో నగు కొలమానములను చదివెను. ఆకాలమానస్థలమానము లా గ్రంథమున నియ్యబడినవి.

♦ 1952 నవంబరునెలలో ఏలూరు దివ్యజ్ఞాన సభాభవనమున నేనిచ్చిన ఉపన్యాసమువిని. నామిత్రులు బ్రహ్మశ్రీ సూర్యభట్ల లక్ష్మీనరసింహము గారు సాంబపురాణములో వెలుగువేగ నిర్ణయము ప్రవచింపబడెనని తెలిపిరి. విశేష శ్రమచేసి వారాపుస్తకము సంపాదించి నాకు తెచ్చి యిచ్చిరి వారికి నాకృతజ్ఞతావందనములు. ఆగ్రంథమునందలి 20 వ అధ్యాయము 20శ్లోకమిట్లున్నది. "యోజనానాం సహస్రే ద్వేశతే ద్వే చైవయోజనే । నిమిషార్ధమాత్రేణ దివిసూర్యః ప్రసర్పతి॥" పైనవివరింపబడిన తక్కినప్రమాణములు నిమిషార్థములో వెలుగు రెండువేల రెండు వందల యోజనములు గడిచిపోవునని తెలుపుచున్నవి. ఈశ్లోకము నిమిషాంతమున నాదూరము గడచుననుటచే, సగము వేగము తగ్గినట్లు తెలుపును. సూర్యగోళ విశేషములు ఈపురాణమున చాల వర్ణింపబడినవి. గో. వేం. రా. ఈమధ్య పునర్ముద్రణమైన బ్రౌణ్యని ఘంటులో గంటకు 97,200 నిమిషములని శ్రీ॥ శే. సురవరం ప్రతాపరెడ్డి గారు గ్రంథాలయ సర్వస్వములో విమర్శించి నాలెక్కల ప్రశంసించినారు.

పై లెక్కలవలన నీక్రింది విజ్ఞానవిషయములు నిశ్చితములగుచున్నవి.

1. నిమేషమనునది ఇంగ్లీషు సెకెండులో సుమారు $\frac{1}{5}$ వంతు: $\frac{16}{75}$ భిన్నాంకము.

2. నిమేషకాలములో పదునారువేల రెండువందల కాలపరమాణువులున్నవి.

3. పరమాణుకాలము ఇంగ్లీషు సెకెండులో $\frac{1}{76,000}$. అంశమాత్రము సుమారు 2.47

4. పరమాణుకాలములో వెలుగు సుమారు $2\frac{1}{2}$ ఇంగ్లీషుమైళ్ళు పోగలదు.

5. పరమాణుకాలములో వెలుగు 1 క్రోసుపైని సుమారు 320 గజములు పోగలదు.

## 7. భూగోళ సూర్యగోళముల మధ్యదూరము

భూమి·సూర్యుల మధ్యదూరము నిర్ణయించుటగూడ ముఖ్యమైన విజ్ఞానవిషయము. తపతీ వివాహసందర్భములో సూర్యుని కడకు వసిష్ఠుడు వెళ్ళెనని మాత్రము మూలమున తెలుపబడినది. అంతే కాని, భూమి సూర్యుల మధ్యదూరము ఇంతగలదని వ్యాసుడు తెలుపలేదు. విజ్ఞాననిరతుడు నన్నయాచార్యుడా దూరమెంతో తెలుపక మిన్నకుండువాడు కాడు; ఆది. 7-85 పద్యములో భూమి సూర్యులమధ్యదూరము "నియుత" యోజనములని నన్నయ ఖండించి వ్రాసెను. నియుత మనగా లక్ష. యోజన మనగా తొమ్మిది ఇంగ్లీషు మైళ్ళ 160 గజములు; $9\frac{1}{11}$ ఇంగ్లీషు మైళ్ళు. నన్నయ లెక్కప్రకారము $\frac{1,00,000\times100}{11}$ ఇంగ్లీషు మైళ్ళు భూమి- సూర్యులమధ్య దూరమని నిర్ణయము; తొమ్మిదిలక్షల తొమ్మిదివేల తొంబదిమైళ్ళని లెక్క తేలినది. ఈనాటి వైజ్ఞానికుల లెక్కననుసరించి ఈ దూరము తొమ్మిదికోట్ల ఇరువది లక్షల మైళ్లు సుమారు. ఈలెక్క ప్రకారము నన్నయభట్టు ఇచ్చిన అంకె తప్పే అనుటకు సందేహము లేదు. ఒక విజ్ఞానవేత్త ఒక సంగతి తప్పుగా చెప్పవచ్చును. అంతకంటె విశేష

పరిశీలన చేసిన మరొక విజ్ఞానవేత్త దానిం దిద్దవచ్చును. ; ఎన్నో తప్పటడుగులు వేసి, పడుచు లేచుచుండినగాని బాలకుడు సరిగా నడుచుట కలవాటు పడజాలడు. విజ్ఞాన విషయముకూడ అట్టిదే. తప్పటడుగు లెన్నో వేసి పిమ్మట సరిగా నడుగువేయుచు వైజ్ఞానికులు ముందునకు పోగల్గు చున్నారు.*

తెనుగు ప్రజల విజ్ఞానాభివృద్ధి కోరి నన్నయభట్టు తెనుగున భారతము రచించినాడు. మూలమున లేకున్నను సందర్భశుద్ధి గమనించి వీలైన చోట్ల తనకు తెలియవచ్చిన విజ్ఞానాంశములను పొందుపఱచి నాడు. సంస్కృతమూలమున నున్నవి, లేనివి, బ్రహ్మాండాది నానా పురాణ పఠనమువలన తాను తెలిసికొనినవి,ఇతరత్ర తనకు లభ్యమైనవి, ఈ సమస్త విషయములను ఆంధ్ర జగద్ధితము గోరి నన్నపార్యుడు తెనుగు భారతమున చక్కగా కూర్చినాడు, "విబుధజనుల వలన, విన్నంత, కన్నంత, తెలియవచ్చినంత" తెనుగులకు విజ్ఞానాంశములను నన్నయ తేటపఱచి మనకు వంద్యుడైనాడు. మనము బాగుగా గ్రహించి ప్రశంసించవలసినది ఆమహనీయుని విజ్ఞాననిరతి. నన్నపార్యుని కావ్యగుణము లన్నింటిలో మన మెన్నతగినది, మిగుల శ్లాఘించి జోహారు లొనర్పవలసినది, ఈ విజ్ఞానాంశ సేకరణము. ఇట్లు సేకరించిన రత్నసంచయమును స్వర్ణమయమైన వ్యాసభారతము నందొప్పికతో ననుకూలము లైనచోట్ల పొందుపఱచి, నవరత్నవిరాజితము గావించి, తెనుగు భారతమును తెనుగుప్రజ కర్పించి నన్నయ ధన్యుడైనందుకు మనము నమోవాకములర్పించుచున్నాము.

## 8. నన్నయభట్టారకుని జ్యోతిశ్శాస్త్ర విజ్ఞానము

"మహాభారతబద్ధ నిరూపితార్థమేర్పడఁ దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్" అని రాజరాజు నన్నయభట్టారకుని నియమింపగా, నన్నపార్యుడులేచి, వినతుడై "అమరిన తారకా సముదయం

* Said Sir Michael Faraday "The path of the progress of Science is strewn with the corpses of dead and dying Hypotheses."

బుల నెన్నను...భారతీ సముద్రముఁ దఱియంగనీఁదను విధాతృన
కైనను నేరఁ గోలుచే" అని విన్నవించెను. భారతప్రశంస రాగానే,
నన్నపార్యునిమనస్సు ముందుగా నక్షత్రవిరాజితమైన యాకాశపథము
మీదికి పోయినది. ఎక్కడ ఏ ఇతరజిజ్ఞాసకంటెను నన్నయకుజ్యోతిర్లోక
జిజ్ఞాసయందు ప్రీతి యధికముగుటచేత, తన యభిమాన శాస్త్రముపైకి
అతని దృష్టిమరలుట సహజము; కావున నన్నయ "అమరిన తారకా
సముదయంబుల నెన్నను" అని ప్రత్యుత్తరములో మొదట
విన్నవించెనని నాయభిప్రాయము. విమర్శకులు నాయభిప్రాయము
నొకంతట అంగీకరింపరు. కష్టసాధ్యములును లెక్కించుటకు
సాధ్యముగాని పనులనుగూర్చి మాటలాడునప్పుడు, ఇట్టి యుపమాన
ములు సాధారణముగా నెవనినోటనుండియైన వెడలగలవు. గయుడు
యజ్ఞము చేయునపుడిచ్చిన దక్షిణాద్రవ్యము నెవరును లెక్కించి తెలుప
లేక పోయిరని వక్కాణించుపట్టున భారతమూలమున వేదవ్యాసుడే
ఈదిగువశ్లోకము రచించెను. (చూ. ఆరణ్య 95 - 29, 30).

29. "సికతా వా యథా లోకే యథా వా దివి తారకాః
యథా వా వర్షతో ధారా అసంఖ్యేయాః స్మ కేనచిత్"

30. తథా గణయితుం శక్యా గయ యజ్ఞే న దక్షిణాః

లోకములో ఇసక రేణువులను, ఖగోళమున నక్షత్రములను, కుంభ
వృష్టిలో జలబిందువులను, గయమహారాజిచ్చిన యజ్ఞదక్షిణలను
ఎవరు లెక్కింపగలరు? ఇవన్నియు లెక్కింప సాధ్యముగానివని యర్థము.
అట్లే భారతరచన అసాధ్యమనుటకే నక్షత్రప్రస్తావన చేయబడినదని
పాఠకులూహించుట సహజము.

ఆరణ్య 2.315. తత్కృతక్రతు బహుదక్షిణాసంఖ్యయు నుడు
సికతాసంఖ్యయును నెఱుఁగగాదు.

అని నన్నయ్య వక్కాణించెను. కావున ఈయొక్కటే వాక్య
మునుబట్టి నన్నయ జ్యోతిశ్శాస్త్ర విశారదుడనుట యుక్తముకాదు;
కాని యీదిగువ వివరింపబడిన యుపపత్తులన్నిటిని జాగ్రత్తగా పరిశీ
లించిన పక్షమున విమర్శకుడెంత కఠోరుడైనను, గుణము గ్రహించి,

నన్న పార్శ్వని జ్యోతిర్విజ్ఞాన ప్రతిభ తిలకించి చేతులుమోడ్చి నమస్కరించి తీరవలయునని నామనవి.

మానవులభ్యసించిన శాస్త్రము లన్నిటిలో మొదటిది జ్యోతిశ్శాస్త్రమే. విశేషించి సర్ జేమ్సు జీన్సుదొరగారు చక్కగా చెప్పినట్లు శాస్త్రములన్నింటిలో 'Most Poetical of all Sciences' కవిత్వసుశ్రీ విరాజితమైన శాస్త్రముకూడ ఈ జ్యోతిశ్శాస్త్రమే. ఈ శాస్త్రమునకును, మానవ విజ్ఞానాభివృద్ధికిని మార్గదర్శకులు వేదమంత్రద్రష్టలైన మహాఋషులు. వారు ప్రకృతి పరిశోధకులలో నగ్రగణ్యులు. విశేషించి, భావాంబర వీధిన్విహరించుచు, వాణీ కటాక్షపాతులై, ఆవేశముతో వేదమంత్రము లనెడి దివ్యకావ్యములు ప్రవచించి, వారు మహాకవులును, ప్రవక్తలును, విజ్ఞానవేత్తలును, జ్యోతిశ్శాస్త్ర ప్రచారకులును కాగలిగిరి. సాధారణ మానవులకు లేని యద్భుతశక్తులు భగవంతుడు వారి కనుగ్రహించి యుండెను. తపశ్శక్తిచేతను, యోగసాధనచేతను, వారి దృష్టి బహునిశితమై, సూక్ష్మతమమై యొప్పుచుండెను. కెప్పులు మూత బడినప్పుడుకూడ వారి దృష్టి కాటంకము నంతరాయమును లేవు విశ్వమనస్సును ఋషి వివరించినట్లు (చూ. ఋ. VIII 25 9.)

"అక్షణశ్చిద్గాతువిత్తరానుల్బణేన చక్షుసా
ని చిన్మిషంతాని చిరాని చిక్యతుః"

మూసిన నేత్రములతోనే వారు సర్వము చూడగలరు; గ్రహించగలరు. తలపెట్టిన పనులు నిర్విఘ్నముగ కొనసాగించగలరు. శప్తుడై పుట్టుగ్రుడ్డియైన దీర్ఘతమమహర్షి ఋగ్వేదము (I: 140 - 164) ప్రథమ మండలము, సూ 140 నుండి 164 అంతము వఱకుగల ఇరువదియైదు సూక్తములకు మంత్రద్రష్ట. ఇప్పటికిని మనము వాడుకొనుచున్న ద్వాదశమాసయుక్త సంవత్సర ప్రతిష్ఠాపకుడు. దినమున కొక డిగ్రీ లెక్కను 360 డిగ్రీలతో సంవత్సరచక్ర, క్షేత్ర గణితచక్ర నిర్మాత; గణిత విజ్ఞానములకు మూలమైన సరికోణమునకు (Right angle) తొంబదిడిగ్రీల నేర్పఱచిన గణకచక్రవర్తి. ఎన్నెన్నో

పేళ్ళుపెట్టి ఎంతమంది దేవతలనో వేదము పేర్కొనుచున్నను దైవ మొక్కడే. "ఏకం సద్విప్రా బహుధా వదంతి" అని ఏకేశ్వరో పాసనా మతమును స్థాపించిన మహానుభావుడు. సూర్య కుటుంబము నకే గాక సమస్త జ్యోతిర్గోళములకు గమ్యస్థానము, ఆధారము, ఆశ్ర యమునని "ఇనో విశ్వస్య భువనస్య గోపా" అని జ్యోతిర్లోకములలో విష్ణుని పరమపదస్థానము నిరూపింప గలిగిన వాడు. అతని సూక్తము లను చక్కగా అర్థము చేసికొనుటకు ఈనాటి వైజ్ఞానికులకు బుద్ధి బలము చాలదు. ఇంతటి శక్తియుక్తులుగల యీమహర్షి మామతే యుడు, జాత్యంధుడైనను, అతని కేమి లోపము గల్గినది? అటువంటి మహానుభావునిచేతిలో జ్యోతిశ్శాస్త్రమును, ఇతర శాస్త్రములును ఎట్లు అభివృద్ధి చెందినవో నిరూపించుటకు ప్రత్యేకగ్రంథము వ్రాయ వలసియుండును. "గ్రుడ్డివాని వలన శాస్త్రాభివృద్ధియా? అందును జ్యోతిశ్శాస్త్రాభివృద్ధియా?" యని విమర్శించు మిట్టబుద్ధులకును, వేదాం తులకును బోధ చేయుటకే యుపపత్తులను పేర్కొనవలసి వచ్చినది.

ఒకానొకవ్యక్తికి దేనియందు వైకల్యము కల్గినపుడు, ఆలోప పరి హారార్థమాయన భగవంతుడా వ్యక్తికి మరొక విషయమున నత్య ద్భుతశక్తుల ననుగ్రహించి ఆవ్యక్తిని లోకారాధ్యుని చేయుచుండు ననుట అనుభవ సిద్ధమైన సత్యము. నేత్రావరోధ బాధితులయ్యు శ్రీ ద్వారము వేంకటస్వామినాయుడుగారు జగద్వంద్యులైన గాయక శిఖామణులు కాగల్గిరి. వారికి నిత్యమును మనము జోహారులర్పించు కొనుచున్నాము. ధ్యానతపశ్శక్తులచే మానవులు లోకోత్తర చరిత్రులు కాగలుగుదురనుటకు వారి పవిత్రజీవనము దివ్యమైన నిదర్శనము. మహర్షి మామతేయుడనబడు దీర్ఘతమునివలె నంగవైకల్య బాధితు లైనను వేదఋషులు, తపోయోగసిద్ధులై, మహాద్భుత శక్తిసంప న్నులై లోకమాన్యులైరనుట నిర్వివాదాంశము. వ్యాసముని ప్రణీత పరమార్థమైన సంస్కృతభారత విశేషములకు, సంహితాభ్యాసుడగు నన్నయభట్టారకుడు వేదఋషుల విజ్ఞానమును, స్వకీయ ప్రతిభావైదు ష్యములనుచేర్చి దివ్యముగా బోధించి తెనుగుభారత మను నద్భుత

విజ్ఞాన గ్రంథమురచించి ధన్యుడయ్యెనని నేను ప్రవచించు చున్నాను. ఈప్రవచనకు ఉపోద్ఘాతముగా ప్రాచీన నవీన ప్రాక్ప్రతీచీ జ్యోతిర్విద్యా విశేషముల సమన్వయించి నా నేర్చిన కొలది అనుబంధము రచించి పాఠక మహాశయులకు సమర్పించుకొనినాడను. ఆ యనుబంధమును ముందుగా నోపికతో పఠించి, పిమ్మట నిటుపై వ్రాయబోవు పుటలను చదువవలయునని కైమోడ్పులతో విన్నవించుకొనుచున్నాను.

అమృతముకొఱకు దేవదానవులు క్షీరసాగరమును మథించిరి. అందువలన జనించిన వస్తునయము యొక్క వివరములు సమస్తపురాణములందును వ్రాయబడి యున్నవి. సంస్కృత భారతమున గూడ వ్రాయబడియున్నవి. నక్షత్ర శోభితమైన యాకాశము వంక తల యెత్తి చూచువారి కందరికి మింటనొకానొక ధవళదృశ్యము నేత్ర గోచరము కాగలదు. ఆదృశ్యము కొన్ని తావులందు మిగుల సాంద్రముగానుండి ధవళతేజముతో మెఱయుచు కానవచ్చుచుండును. ఋగ్వేదకాలమునుండి యీసాంద్ర ధవళదృశ్యము పాలసంద్రమన బడుచున్నది. నభోమండలమున మఱికొన్ని చోట్ల నయ్యది ధావళ్యము తగ్గి పొల్లపూవువలె (పాల విఱుగువలె, మజ్జిగ తేటవలె) తెలతెల్లగా కనబడును. మఱియు వైశాల్య విషయమున గూడ నంతట నొక్క లాగున నుండక ఆ దృశ్యము ఒకచోట వెడల్పుగాను, మరొకచోట సన్నగాను రకరకములైన యాకారవిశేషములతో కానవచ్చుచుండును. ఈ ధవళదృశ్యమునే మనవారలాకాశగంగ యనిరి. ఒకచో చిమ్మలు, మరొకచో చిదపలు, వేరొకచోచాలు, ఇంకొకచో తరంగములట్లు గ్రిమ్మఱు మరొక ప్రదేశమున పోటు పాటులం బడుచున్నట్లు, అనేక విధములుగా తోచుచు, నీ వింత దృశ్యము ఆకాశమును మహా సర్పములాగున చుట్టియున్నట్లు కనబడును. భారతీయులు క్షీరసాగర మనియు, వ్యోమగంగయనియు సాంద్రతనుబట్టి రెండు భాగము లుగా దీనిని విభాగించిరి. కాని పడమటివారు దీని నంతటిని కలిపి **Milky Way** అనిరి. దీనికి సరియైన తెనుగు 'పాలవెల్లి'. మన గృహములలో దేవతాప్రతిష్ఠాపనము గావించుతీనెలమీద, నీధవళ దృశ్య

సంజ్ఞికముగా 'పాలవెల్లిలోనను, బైటను మెఱయు నక్షత్రములను సూచించుటకు, మనయిండ్లలో స్త్రీలు రసగుండ్లనబడు పాదరసపుబుడ్లను వ్రేలగట్టి శోభకల్పింతురు. తేజముకలట్లు మెఱయు పాదరసపుబుడ్లు దొరకనపుడు లక్క-కాయలు, వెలగకాయలు లోనగు గుండ్రకాయలను నక్షత్రగోళముల సూచించుటకు వ్రేలగట్టెదరు. జ్యోతిశ్శాస్త్ర వేత్తలకు ఒక విశేషము చక్కగా తెలిసియున్నది. మిక్కిలి తేజస్సుగలిగి మెఱయుచుక్కలీ పాలవెల్లిలోనను, ప్రక్కను గలవు. క్షీరసాగరమథనముచే నుద్భవించినవని పురాణములలో పేర్కొన బడిన సమస్తమును నక్షత్రరూపమున పాలవెల్లి పరిసరములలోనే గానవచ్చుచుండుట మనము బాగుగా తెలిసికోవలసిన విషయము. మఱొకముఖ్యవిషయ మేమనగా — వేదపురాణ ప్రసిద్ధులైన మనవారి దేవత లందరును నక్షత్ర స్వరూపులు. "అహోరాత్రే పార్శ్వే; నక్షత్రాణి రూపమ్" అని శ్రుతి దేవతలకు రాత్రింబవళ్ళు రెండును రెండు పార్శ్వములు. వారి రూపమన్ననో నక్షత్రస్వరూపము. అశ్విన్యాది నక్షత్రములకు వరుసగా నేయే దేవత లధిదేవతలో వేదమే నిర్ణయించి ప్రవచించినది. అంతేకాకుండ, ఆయానక్షత్రఉదయ విశేషములను బట్టి భారతీయులకు పండగదినము లేర్పఱుపబడినవి. (ఋ V: 77 - 1) "ప్రాతర్యావాణా ప్రథమా యజధ్వం." సూర్యుడుదయించకముందు ఏనక్షత్రము తూర్పున పొడచూపునో, ఆనక్షత్రాధి దేవతకు ఆనాడు ముందు తప్పక పూజచేయవలెను. పూజ పూర్వాహ్ణమందే జరుగవలెనని సాయణాచార్యుల వ్యాఖ్యానము. రెండవ పక్షము చేత, సూర్యాస్తమయముకాగానే తూర్పుననుదయించు దేవతకైనను ఆనాడు పూజ జరిగించనగును. "నోతనసాయమస్తి దేవాయా అజుష్టం." భాద్రపదశుక్ల చతుర్థినాడు సూర్యోదయాత్పూర్వము (సప్తఋషుల ప్రక్కనే) వినాయకుడు ఉదయించుటచేత నానాడు వినాయకచతుర్థి. మరునాడు సూర్యోదయమునకు ముందుగా సప్తఋషులుదయమగుటచే నాదినము ఋషిపంచమి యైనది. ఈ ఆరునెలలు గడచిన పిమ్మట, చైత్రశుక్ల చతుర్థినాడు సూర్యాస్తమానము కాగానే తూర్పున

నక్షత్రరూపి విఘ్నేశ్వరుడు ఉదయించును. కావున నానాడు కూడ మన పంచాంగములు గణేశపూజ విధించుచున్నవి.

దేవశబ్దమునకు 'ప్రకాశమానమైనది' అని అర్థము. జ్యోతిర్గోళమున తేజస్సుగలిగి ప్రకాశించు దివ్యనక్షత్రములు మనవారి దేవతలు. వారి వాహనములు, వారి ధ్వజములు, వారిని పూజింపవలసిన పండగ దినములు, అన్నియు ఆయా నక్షత్రముల ఉదయ విశేషములను బట్టి భారతీయ జ్యోతిశ్శాస్త్రము నిర్ణయించుచున్నది. ఈనక్షత్రము లుదయించు వేళకు అస్తమించు నక్షత్రములు చుక్కఎదురగుట వీరిప్రతిస్పర్థులు. దానవులు: ఈదానవులను ఆ నక్షత్రాధి దేవతలు సంహరించినట్లు వేదపురాణగాథలు. అవి మనకు అర్థముకావలెనన్నచో క్షేత్రగణితాన్వయముతో జ్యోతిర్గోళ విశేషములను మనము చక్కగా గ్రహించి తెలిసికోవలెను. అట్లు తెలిసికొనుటకు ఓపికలేని భారతీయులకును, విదేశస్థులకును వేదపురాణ వాఙ్మయమంతయు ("Nonsense; Bushelfuls of Chaff.") "అసందర్భములు; ఊకబుట్టలు"నని తోచుట సహజము. ఓపికతో చదివి గ్రహించువారికి మన వేదపురాణములు మహనీయవిజ్ఞాన రత్నాకరములు. పెంటకుప్పలమీద వరి, చోడి, జొన్న, బియ్యపు గింజలనేరుకొనితిని బ్రతుకుకోడికి రత్నహారమెందుకు? బకధ్యానములుచేయుచు, నే చేపనో, జెల్లనో పట్టుకొని తిని, కడుపునింపికొనుచు పెక్కండ్లు బ్రతుకు కొక్కెరజీవులకును, ఏకళ్లెములనో తిని పొట్టనింపుకొని కలకాలము బ్రతుకు కాకిజీవులకును మనవారి సంస్కృతి వెగటుగ దోచుట సహజము. ఇట్టి పరభాగ్యోప జీవులకు "నన్నయ కంపు ఇంపుగానేరదు" కాకున్నను మించిపోయినదిలేదు.

క్షీరసాగర మథనసందర్భమున నుద్భవించిన హయరత్నము ఉచ్చైశ్శ్రవము, వేదములోనిది. పేద్వఘూశ్వమనియు దధిక్రయనియు వర్ణింపబడియుండెను. * సముద్రపుటొడ్డున నీ శ్వేతాశ్వమున్నపుడు కశ్యపప్రజాపతి భార్యలు వినతయు కద్రువయు దానింజూచిరి. కశ్యప

---

* Reference for పేద్వఘూశ్వము and దధిక్ర to be given as (ఋ I-1 2-163).

మహాఋషి నక్షత్రరూపుడై ధ్రువక్షితిలో మెఱయుచున్నాడు. "కశ్యపువలనఁ జరాచరభూతరాశి యెల్లనుద్భవిల్లె" (ఆది 3-58). అతనికి పదమువ్వురు భార్యలు. అదితి, దితి, దను, కాలా, నాయు, స్సింహికా, ముని, క్రోధ, ప్రలంబారిష్ట, వినతా, సురభి, కద్రువులు పదు మువ్వురును కశ్యప పత్నులు. దేవతలు అదితి సంతానము; దితికి దైత్యులు, దనువునకు దానవులు, కాలకు వినాశక్రోధాదులును, ఆయువునకు వృత్రాదులును, సింహికకు రాహువును, మునికి గంధర్వు లును, సురభికి గోగణము నప్సరసలును, వినతకు అనూరు గరుడ పక్షులును, కద్రువకు నాగజాతియు నుద్భవించెను; దేవతలలో ఇంద్రుడు పెద్ద; దైత్య, దానవాది దేవశత్రులకు వృత్రుడు పెద్ద. ఖగోళఉత్తర ధ్రువమునుండి దక్షిణధ్రువమునకు వ్యాపించు.ధ్రువరేఖలు (Meridians) కశ్యపుని భార్యలు; వారి సంతానములు నక్షత్రరూపమున జ్యోతి ర్లోకములో వ్యాపించియున్నవి. చిరకాలమిా నక్షత్రగతులను పరిశీలిం చిన ఖగోళ వేదకుడు వాన్ కాప్టిన్ అను డచ్చిదేశస్థుడు, పాశ్చాత్య జ్యోతిర్విదుడు.

ఈ నక్షత్రముల గతులందు జెర్మని దేశపు గాటింజన్ యూని వర్సిటీలో కేట్టీన్ దొరయు, ఇంగ్లండు గ్రీనిచ్ పరిశోధకశాలలో ఎడ్డిం గన్ దొరయు నీక్రింది సంగతులను ప్రకటించిరి. వారు ఒక గొప్ప విశేషము కనిపెట్టిరి. మనకు కానవచ్చు చుక్కల నన్నిటిని రెండు తెగలుగా విభజింప వచ్చును. ప్రతి చుక్కకును స్వకీయ గమనము (Proper motion) కలదు. ఒక తెగచుక్క లన్నియు జ్యేష్ఠనక్షత్రము వంకకు పోవుచున్నవి. మరొక తెగచుక్కలు (Orion) మృగశిర వంకకు వెడలుచున్నవి. జ్యేష్ఠా నక్షత్రమునకు ఇంద్రు డధిదేవత. మృగ శిరస్సుతో (Orion) యోధుడు వృత్రాసురుడు. ఈ యిరువురు ప్రజల ప్రతిస్పర్థులు (Diametricallv opposites, 180° apart) ఇంద్రుడుదద యముకాగానే వృత్రుడును, వాని రాక్షస బలగమును అస్తంగతు లగుదురు: ఇంద్రవృత్రుల పోరును, దేవదానవ యుద్ధములును, వేద పురాణగాథలమిషమున ఖగోళమున నక్షత్రగమన విశేషములను ఎల్లవారి కెరిగించుచున్నవి.

చంద్రుడు క్రాంతి వృత్తమును సుమారు ఇరువదేడు దినములలో చుట్టి రాగలడు. ఒక దినమునకు చంద్రుడీక్రాంతిచక్రములో నిరువదేడవ అంశమును గడచిపోవును. క్రాంతి వృత్తమును ఇరువదేడు భాగములుగా విభజించి, ఒక్కొక్క భాగమునందలి చుక్కలగుంపులకు అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మొదలగు నామము లిరువదేడును భారతీయులు పెట్టియుండిరి. ఈ యిరువదేడు తారాగణములును చంద్రుని భార్యలని వివరించిరి. ఈవేళ నక్షత్రమేది? చంద్రుడీరాత్రి ఏనక్షత్రము చెంత కనబడునో అదే ఈవేళ నక్షత్రము. చంద్రుడీరాత్రి ఏభార్యతో కూడియుండునో అదే నేటి నక్షత్రము. దుర్గ్రాహ్యములైన జ్యోతిర్విషయములను గ్రామీణులైన పామరులకుగూడ తేటతెల్లము చేసి వారికిగూడ విజ్ఞాన సారమందజేసి, సమస్తజనులకు విజ్ఞానము వెదజల్ల వలెనను సదుద్దేశముతో వేద మంత్రద్రష్టలును, పురాణకర్తలును, వినోదకథలును, గాథలను రచించి ధన్యులైరి. పురాణముల ద్వారా పురాణ కర్తలు భారతీయజన సామాన్యమునకు విజ్ఞానసారము ప్రసరింప జేసినట్లు పాశ్చాత్యవైజ్ఞానికులు పడమటి ప్రజకు విజ్ఞానసారము నేటికిని నందియ్య లేకపోవుచున్నారు. కాలగతివలన పురాణగర్భితమైన రత్నసముచ్చయ మిప్పుడిపుడే బయల్పడుచున్నది.

కద్రూ వినతలను ఉచ్చైశ్శ్రవము కడవిడిచి వచ్చితిమి. ఆశీవిషోరగములకు తల్లియైన కద్రువ కపటి; వినత అమాయకురాలు; సంస్కృతమూలమునందు, ముందు హయవర్ణముంగూర్చి కద్రూవినతల సంవాదము; పన్నిదము; పిమ్మట సముద్రవర్ణనము; ఈక్రమమున గలవు. ఆది. 20 : 2 - 3 ; 4.

"యః నిశమ్యతదా కద్రూర్వినతామిదమబ్రవీత్
ఉచ్చైశ్శ్రవా హి కింవర్ణో భద్రే ప్రబ్రూహి మాచిరమ్॥ 2

వినతోవాచ॥ శ్వేత ఏవాశ్వరాజోయం కింవాత్వం మన్యసే శుభే।
బ్రూహివర్ణం త్వమప్యస్య తతోత్ర విపణావహే ॥ 3

కద్రూఉవాచ॥ కృష్ణవాలమహం మన్యే హయమేనం శుచిస్మితే
ఏహిసార్థం మయాదీవ్యదాసీభావాయభామిని॥

పిమ్మట కద్రువ తన పుత్రసహస్రమును బిల్చి, వినతయెడ కపటము చేయుమనగా, వారందుల కంగీకరింపలేదు. జనమేజయసర్పయాగమున బడి చావుడని కద్రువ తన పుత్రులను శపించినది. ప్రజాహితము కొఱకు బ్రహ్మ ఆశాపము నంగీకరించెను. కశ్యపునికి సర్వవిషహర మైన విద్య నిచ్చెను ఇంతటితో ఇరవదవ అధ్యాయము ముగియు చున్నది. పిమ్మట సముద్రవర్ణనము గలదు; 21 - 22 అధ్యాయము లలో సుమారు ముప్పది శ్లోకములలో సముద్రవర్ణన గలదు. ఇంచు మించుగా (Encyclopaedea). విశ్వకోశములోచేర్చ దగిన సముద్రవర్ణన మిది. ఇందు శబ్దాలంకార అర్థాలంకారవిశేషములుగాని ఖగోళ విశే షములుగాని శ్లేషోపమాది విశిష్టరచనలుగాని లేవు. సంస్కృతభారత మును పదునేడవశతాబ్దమున తెనుగు వచనగ్రంథముగా నొనర్చిన కళువె వీరరాజు రచనము నీపట్టున పరిశీలించిచూచుటవలన ప్రయో జనముగలదు.

"మహాత్తరంబగు జలధారంబ్బును, *మహాఘోషణ భీషణంబ్బును, తిమితిమింగాల ప్రముఖ సలిల జంతుసంతాన సంకీర్ణంబును, అఖిల రత్నంబుల కాకరంబ్బును, వరుణునకు నాలయంబ్బును, అఖిలసర్పంబు లకును నావాసంబ్బున్, బడబానలంబునకు నాశ్రయంబును, అసురవరు లకు కారాగృహంబ్బును, సకలలోక భయంకరంబ్బును, అమృతంబునకు నుద్భవస్థానంబును, అప్రమేయంబ్బును, నచింత్యంబును, అద్భుతజల ప్రపూర్ణంబును, ఆవర్త శతసమాకీర్ణంబ్బునునై మహానిల సంక్షో భంబ్బునంబ్బొడము తరంగహస్తంబుల నృత్తంబుచేయు చందంబునం దనరంగలించుచు, కుముదబాంధవుని వృద్ధిక్షయంబ్బులు కారణంబ్బుగ తాను వృద్ధిక్షయంబులుగనుచు, పాంచజన్యంబ్బునం దివ్య శంఖంబ్బునకు నుద్భవంబగుచు, మహావరాహరూపధరుండగు గోవిందుండు భూదేవి

* దాక్షిణాత్య తెనుగురచనలలో పూర్ణానుస్వారము తరువాతి హల్లుద్విత్వము గావింపబడుట సామాన్యము- గొ. వెం. రా

నుద్ధరించు సమయంబున నతని వివిధవిహారంబుల వలనంగ్గలంగిన జలంబ్బులం గనుపట్టుచు, ననేక కాలంబ్బు నిజాంత్తసి ప్రదేశంబున తపంబ్బుచేయుచున్న అత్రియను మహార్షి కెనియుదురవగా హంబ్బ గునిలుకతందనరుచు, యుగాంత్తకాలంబ్బున యోగనిద్రా పరుండగు నారాయణునకు శయ్యాగృహంబ్బు నంబ్బరగుచు, బడబానలముఖంబున జలంబ్బులను హవ్యంబులు వెల్బుచు, పరస్పరస్పర్ధన్నుంబలె మహాపుణ్యా వాహిను లనేకవిధంబుల నిజప్రవాహంబ్బులంబ్బారింప పెంపుగనుంచు, వజ్రాయుధంబునకు వెరచి తన్ను శరణు జొచ్చిన మైనాకశైలంబునకునం రక్షకంబగుచు నాకాశంబ్బునం బోలె నపారమహత్వంబ్బున్న వెలయుచున్న యంభోనిధానంబు చెరంజ్జని ” .

ఇక రచనను పరిశీలింతము -

ఆది 2-27 “కద్రువయు, వినతయు, వినోదార్థంబు విహరించు నారుకర్రి మకర నికర కరా ఘాత జాత వాతోద్ధూత తుంగ తరంగాగ్ర సముచ్ఛలజ్జల కణాసారచ్ఛటాచ్ఛాదిత గగనతలంబైనదాని, నుద్యానవనంబునుంబోలె బహువిద్రుమ లతాలంకృతంబైనదాని,నాటకప్రయోగంబునుంబోలె ఘనరసపాత్ర శోభితరంగరమ్యంబైనదాని, దివంబునుంబోలె సహిమకర భరితంబైనదాని ..”

నన్నయ తెనుగుభారతమును ‘అక్షర రమ్యత’ శోభిల్ల రచింతునని ప్రతిజ్ఞ చేసియున్నాడు. అక్షరరమ్యత యనగా శబ్దాలంకారములు విశేషముగా నుండునట్లు రచించుట అని యొక అర్థము. పైని ఎత్తివ్రాసిన రచనలో మొదటి పంక్తిలో ‘వి’ అను అక్షరము ఎన్ని సారులు వచ్చినదో గమనింపవలయును. తరువాతి పంక్తులలో కకార, రకార, తకార, లకారము లెన్ని సారులు కూర్పబడినవో కనిపెట్టవలయును. రకార లకారములు ద్రవ సూచకములైన హల్లులు (Liquid Consonants). జలమయమైన సముద్రమువర్ణించు పట్టున నీ సరళాక్షర ప్రయోగము శ్లాఘ్యము. తకారము పరుషము. సముద్రోదకమునందు సమీరణాస్ఫాటము మూలముగా తరంగము లెట్లు

జనించి వ్యాపించుచున్నదో "కరాఘాతజాత వాతోద్ధూతతుంగతరంగములు" విశదము చేయుచున్నవి. పిమ్మట నీ కెరటములు లెట్లు విరిగి కూలుచున్నవో "చ్ఛటాచ్ఛాదితము" ప్రతిధ్వనింప జేయుచున్నది. ఈ రచనములో (Sound echoing sense) అర్థస్ఫురణకు అనుకూలమైన శబ్దములు చక్కగా నేర్చి కూర్చబడినవి. కెరటములు విరిగినప్పుడు తూలిన జలకణములు మనమీదకూడ చిందుచున్నట్లు పై రచనము దివ్యముగా సాగినది.

ఒకే వర్ణము వాక్యములోని వివిధపదములలో మొదట వచ్చునట్లు రచించుట శ్రుతిసామ్యము. ఇంగ్లీషు వారు దీనిని Alliteration అందురు. గ్రే అను నాంగ్లకవి 'Elegy' అను ఖండ కావ్యములో "The Ploughman homeward plods his weary way" అను పద్యపాదములో P వర్ణము రెండుసార్లును, W వర్ణము రెండుసార్లును వచ్చునట్లు Alliteration వేసి రచించినందుకు ఇంగ్లీషు ప్రజలును, విమర్శకులును పొంగిపోవుచున్నారు. మన తెనుగువారు సహజముగా శబ్దాలంకారప్రియులు. ఆబాలగోపాలమును శబ్దాలంకార శోభితములైన పదములనే, సంభాషణలో సహితము, అప్రయత్నముగా వాడుచుందురు. జానపదగేయములలో నీ లక్షణము ఇంకను తఱుచుగా నగపడును. ప్రతిపద్యపాదములో యతినియమము మన వారి శబ్దాలంకార ప్రియత్వమును ఇంకను పోషించుచున్నది. నన్నయ వచనరచనలలోగూడ శబ్దాలంకారప్రియత్వము, నీయక్షర రమ్యత, విశేషముగా గోచరించుచున్నది. ప్రకృతి విశేషములను తన రచనలలో హృద్యముగా ప్రతిబింబింపజేయు కావ్యకళా కుశలత్వమున నన్నయ్య అందెవేసిన చేయి.

ఇక, అర్థవంతములైన రచనలంగూర్చి యోజింతము. నన్నయ "నానారుచిరార్థ సూక్తినిధి" సారమతులైన మహాకవులందరును నన్నయ రచించిన తెనుగుభారత కావ్యమును విమర్శించి అందుగల "ప్రసన్నకథా కలితార్థయుక్తికి" మెచ్చి "మేలనవలెను" అట్లు భారతమును తెలుగున రచించెదనని నన్నపార్యుని ప్రతిజ్ఞ. ప్రసన్న

చిత్తులైన మహాకవీశ్వరులకు ఉద్యానవన విహరణమును, కావ్యోత్తమములైన దృశ్యప్రబంధములను రసవంతముగా ప్రదర్శింపగల నాటకరంగములును, నవరత్నములట్లు మెఱయు మేటి నక్షత్రములతో శోభించు నాకాశ సందర్శనమును మిక్కిలి ప్రీతికరములు. వారి మెప్పుల నభిలషించిన నన్నయ వారిం బ్రీతులంజేయునట్టి రచనల గావించుట కర్తవ్యము. విశేషించి, నన్నయకు పూర్వముండిన సంస్కృత మహాకవులలో బాణునియందు కవిలోకమునకు చాల గౌరవముకలదు. పాండవులలో నకులుడును, కవులలో బాణుడును తురంగ వేగవిశిష్టులని ప్రశంసింపబడుచున్నారు. బాణుని శైలి మిగుల వేగవంతమై యతుల జవసంపన్నమై యలరారుచున్నది. బాణుడు సర్వజ్ఞుడు. 'బాణోచ్ఛిష్టమిదం జగత్;' మహాకవి బాణుడుగ్రహించి అన్యము విశ్వమున లేదని కవిలోకము నేటికిని బాణుని కొనియాడుచున్నది. బాణుని శ్లేషోపమలు విజ్ఞానవంతములై చక్కగా నచ్చినవి.

సముద్రమును ఉద్యానవనముతోను, నాటకరంగముతోను పోల్చిన వాక్యమును విడిచి, "దివంబునుంబోలె నహిమకరభరితంబై" యను వాక్యములను మాత్ర మిట చర్చింతము. సముద్రములో మొసళ్ళున్నవి; సర్పములున్నవి. ఆకాశమువలెనే సముద్రము అపారము; ఆకాశమున ద్వాదశ రాసులలో (మొసలి) మకరాకారము గలిగి మెఱయు నక్షత్రములున్నవి. అదే మకరరాశి. అశ్లేష సర్పాకారము గలిగి మెఱయు రిక్కలున్నవి. ఆశ్లేషచుక్కలు సర్పాకారము కలిగి,సర్పదైవత్యములై మెఱయుట వేదప్రసిద్ధము. కాబట్టి దివి యహిమకర భరితమై వెలయుచున్నదనుట జ్యోతిశ్శాస్త్రదృష్ట్యా సత్యము. జంతుశాస్త్ర దృష్ట్యా సముద్రము అహిమకర భరితము. నభమునకును సముద్రమునకును సామాన్యమైన 'అహిమకరభరణ' ధర్మమును జ్యోతిర్విదుడగుటచే నన్నయ లెస్సగా గ్రహించినాడు. తనకు తెలిసినదంతయు తెనుగుపాఠకులకు "అర్థ్యములు, తథ్యములు, అల్పాక్షరయుక్తములు, యుక్తియుక్తములు నైన" వాక్యములతో బోధించిన గాని నన్నయభట్టారకుని యంతరాత్మ యతని నూరకుండ నీయదు.

భావమును సాభిప్రాయముగా వ్యక్తముచేయుచు, శ్లేషఇగిరి పోకుండ పరిపోషించుచు, సర్థము స్పష్టముచేయగల పదపులనుస్థానము జాగ్రత్తగానేర్చి నేర్పుగాకూర్చి, ఉపమాలంకార రచనముతో జ్యోతిర్విజ్ఞానమును జోడించి ప్రకాశింపజేసి, నన్నపార్యుడు కృతకృత్యుడైనాడు.

ఇట్టి సముద్రతీరమున విహరించుచు కద్రూవినతలు తమ యెదుట కొంతదూరమున గ్రుమ్మరుచున్న ఉచ్చైశ్రవమును జూచిరి. "కని, కద్రువ వినతంజూచి" చూడవెయ్యల్ల యతి ధవళంబైన యశ్వంబు నందు సంపూర్ణచంద్రునందు నల్లయుంబోలె వాలప్రదేశంబు నల్లనై యున్నది" యనవిని, వినతనగి "నీవే కన్నులంజూచితే యక్క? యెక్కడిదినల్ల? యీయశ్వరాజుమూర్తి మహాపురుషుని సత్కీర్తియుంబోలె నతినిర్మలంబై యొప్పుచున్నయది" యనిన విని నవ్వి వినతకు కద్రువ యిట్లనియె" సంస్కృతమూల ములో చంద్రునిలో నల్లమచ్చ సంగతిగాని చంద్రుని సంగతిగాని లేదు. మహాపురుషుని సత్కీర్తి వలె ధవళముని ఉపమానముకూడ లేదు. తెనుగులకు భారతార్థము చక్కగా బోధపడుటకు నన్నయ్య యీ యుపమానములను తెనుగు భారతమున చేర్చి రచించినాడు. ఈరచనలో నన్నపార్యుడు తన సహజ విజ్ఞాన నిరతిని పోషించుకొనుచు, సందర్భానుసారముగా శబ్దాలంకారములను, అర్థాలంకారములను సాభిప్రాయముగా కూర్చుచు తెనుగు భారతమును ఎట్లు శోభాయమానముగా చేయగలిగెనో గాంచితిమి.

నన్నపార్యుని జ్యోతిర్విజ్ఞానమును వేనోళ్ళ ఘోషించుఘట్టములనేకములున్నవి. భృగువంశకీర్తనము, ఉపరిచరవసు చరిత్రము, సత్యవతీవృత్తాంతము, బకవధ, ద్రౌపదీ దేవి జననము, ద్రౌపదీ స్వయంవరము, మత్స్యయంత్ర భేదనము, ద్రౌపదీ వివాహము, జరాసంధవధ, దుశ్శాసనునిచే ద్రౌపది పడిన భంగపాటు, కిమ్మీరవధ, గంగావతరణము శిబిచక్రవర్తికథ, అజగరోపాఖ్యానములోనగు ఘట్టము లన్నియు, నన్నపార్యుని యపారజ్యోతిర్విజ్ఞాన మహిమచే తను ఖగోళమున నవరత్నదీప్తులచేతను జాజ్వల్యముగా మెఱయుచు దర్శనీయములై యొప్పుచున్నవి. వీనికన్నిటికిని సంస్కృతమూలమున

'కా స్తయోకూ స్తయో' ఇంతయో అంతయో ఆధారములున్నవి. ఆ యాధారములకు నన్నయభట్టారకుడు పెక్కువిధములను చాల విశేషములను స్వకీయప్రతిభచే చేర్చి, పదారవ వన్నెబంగారము హేమరాశివంటి సంస్కృతభారతమును, తెనుగున రత్నకీలిత రమణీయ భూషణరాశిగా నొనరించి, కావ్యశోభనతిశయింపజేసి, విద్వత్సంస్తవనీయుడై, విజ్ఞాననిధియై, జ్యోతిష్మతియై, తాను ప్రాముఖ్యమునకు తెచ్చిన తారాగణముతో, శాశ్వతయశోదేహముతో వెలయుచున్నాడు.

సంస్కృతభారతమునుండి లేశమైనను సూచన గైకొనకుండ నన్నపార్యుడు స్వకీయ విజ్ఞాన జ్యోతిర్విజ్ఞాన ప్రతిభావిశేషములు మెఱయ స్వతంత్రముగా నొనరించిన పద్యరత్న మొకటి గలదు. నన్నయభట్టారకుని సంహితాభ్యాసమహిమను, ఉపనిషద్విజ్ఞానమును మహాద్భుత జ్యోతిశ్శాస్త్రవివేక వైదుష్యములను ఆపద్యరాజము బహుదివ్యముగా ప్రకాశింపజేయుచున్నది. అందు వాణీ హిరణ్యగర్భప్రశంసావ్యాజమున పాఠకులకు విశదము చేయబడిన విశ్వరహస్య విశేషములెన్నియో దివ్యముగా ధ్వనించుచున్నవి. ఆపద్యరత్నమును ముందుగానొక ప్రత్యేక ప్రకరణమున సవిమర్శముగా ప్రశంసించి, పిమ్మట ఉపరిచరవసు చరిత్రాదుల వలన విశదములగు జ్యోతిశ్శాస్త్ర వివరముల నారయుదము.

ఆపద్యమురచింపబడిన సందర్భమేదో ముందు తెలిసికొందము. అరణ్యపర్వము చతుర్థాశ్వాసమున నజగరోపాఖ్యాన కథ పూర్తియైనది. ఖరకరుని ప్రచండకిరణ తాపముచేతను, వనాంతరదావాగ్నిజన్యమైన మహాతాపముచేతను శోషించిన తరుతతి కాప్యాయనముగా వర్షాగమమైనది. కాలమేఘముల గర్జనలు, మింటిమెఱుపుల తళతళలు గగనంబున నింద్రధనుశ్చిత్రములు ఆచిత్రవర్ణములను ప్రతిబింబింపజేయుచున్నవోయనునట్లు భూమిపై బొడమిన నవతృణ, శిలీంధ్రసురగోప దృశ్యములతో క్రమముగా వానకారంతరించినది. అటుపిమ్మట శరత్కాలము ప్రారంభమైనది.

## 9. నన్నయభట్టారకుని జ్యోతిశ్శాస్త్రవిజ్ఞానము

(అనువృత్తము).

ఉ॥ భూసతికిం దివంబునకు పొల్పెసగంగ శరత్సమాగమం
బాసకల ప్రమోదకరమై విలసిల్లె మహర్షిమండలో
పాసిత రాజహంసగతి భాతిప్రసన్న సరస్వతీక మ
బ్జాసనశోభితం బగుచు నబ్జజుయానముతో సమానమై.

ఈ పద్యరాజము నన్నయభట్టారకుని సంహితాభ్యాస విశేషములను, బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతియు, నిరుపమానమైన జ్యోతిర్విద్యా ప్రావీణ్యమును అత్యద్భుతముగా ప్రవచనము చేయుచున్నది. కావున గ్రంథవిస్తరణ భీతికి జంకక మనమీపద్యమును సుదీర్ఘముగా విమర్శించి వ్యాఖ్యానముచేయ నుపక్రమింతము. షడ్దర్శనములలో కడపటిది బ్రహ్మసూత్ర గ్రంథము. ఇందు మొదటి సూత్రము 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అనునది. బ్రహ్మసూత్రముల కింగ్లీషు వ్యాఖ్యానము వ్రాసిన రావుబహద్దరు రంగాచార్యపండితులు ఈ ప్రథమ సూత్రమునకు నాలుగువందల పుటల వ్యాఖ్య వ్రాసిరి. నన్నయవిజ్ఞాన నిరతి ఎట్టిదో నిరూపించుటకు ఈ పద్యరాజము ప్రథమ ప్రశంసకు అర్హమైనదగుటచేత, వందలకొలది పుటలు వ్రాయలేకున్నను కొన్ని పదులపుటలు సులభముగా నింపుటకు చక్కని అవకాశములు ఉన్నవి కనుక సంగ్రహముగా వానినిట చర్చింతము.

సంస్కృతభారతము మూలములో నీపద్యము రచింపబడిన ఘట్టములో నీక్రింది పంక్తులుమాత్రమున్నవి :—

ఆరణ్యపర్వము. 182 అధ్యాయము. 10 - 16 శ్లోకములు.

182-10 క్రౌంచహంస సమాకీర్ణా శరత్ ప్రముదితా భవత్ ।
రూఢకక్షవన ప్రస్థా ప్రసన్న జలనిమ్నగా
11. విమలాకాశ నక్షత్రా శరత్తేషాం శివాభవత్
మృగద్విజ సమాకీర్ణా పాండవానాం మహాత్మనామ్.
12. దృశ్యంతే శాంతరజసః క్షపాజలదశీతలాః
గ్రహనక్షత్ర సంఘైశ్చ సోమేన చ విరాజితః

13. కుముదైః పుండరీకైశ్చ శీతవారి ధరాశ్శివాః
నదీపుష్కరిణీశ్చైవదదృశుః సమలంకృతాః
14. ఆకాశేనీకాశ తటాం తీర వానీరసంకులామ్ ।
బభూవచరితాంహర్షః పుణ్యతీర్థాం సరస్వతీమ్.
15. తేవై ముముదిరే వీరాః ప్రసన్న సలిలాంశివాన్
పశ్యంతో దృఢధన్వానః పరిపూర్ణాం సరస్వతీమ్.
16. తేషాంపుణ్యతమారాత్రిః పర్యసంధౌ స్మ శారదీ
తత్రైవవసతా మాసిత్ కార్తికీ జనమేజయః

అంతేకాని వ్యాసవిరచిత మూల భారతములో భూమ్యాకాశ దాంపత్య విషయములేదు. శరత్కాలమున నాద్యావాపృథివీమిథునము యొక్క శోభావిశేషము స్పృశింపబడలేదు. అందుకుపమానము చెప్ప వలసిన అవసరము వ్యాసునికి కలగలేదు. మఱియు వాణీహిరణ్యగర్భ దాంపత్య ప్రశంస లేదు. వారికి వాహనమైన హంస సంగతే లేదు. రాజహంసపై నుపవిష్టులైన బ్రహ్మసరస్వతీ పతిపత్నీ యానమును గూర్చి కించిత్తుధ్వనియైన లేదు. శరచ్చంద్రుని శోభతో రాజహంస నుపమించు వచనములులేవు. ఈపద్య విశేషములును, ఈదివ్యోప మానములును నన్నయభట్టున కెచట లభించినవి ? వాని నిటకూర్చి వర్ణించుట కాతని కేమి యవసరము కలిగినది ?

ఋగ్వేదమున పలుతావులందు భూమ్యాకాశంబులు మిథునము లని వర్ణింపబడినవి. అకుగున భూమండలమును, దానిపై నభోరంగ మును, బరణియు కప్పునుబోలె అమరియున్నవి. భూనభములు ద్యావాపృథివీ దంపతులని ప్రశంసించు వేదమంత్రములు కూడ ఋగ్వేదమున చాలగలవు. ప్రథమ మండలమునూటయెనుబదియైదవ సూక్తమును, చతుర్థమండలము ఏబదియారవ సూక్తమును, ఆఱవ మండలము డెబ్బదియవ సూక్తమును ప్రత్యేకము ద్యావా పృథివీ దేవతా మిథునమును స్తుతించుచున్నవి. ఇవిగాక ఇతర దేవతలతో ఈదేవతా మిథునమును స్తోత్రముచేయు మంత్రము సూక్తములు ప్రథమ మండలము ఇరువదిరెండు, తొంబదినాలుగు, నూటపన్నెండు

సూక్తములందును, నాల్గవ మండలము ముప్పదియెనిమిది, పదవ మండలము నూటముప్పదిరెండు సూక్తములందును గలవు. భూమ్యాకాశములు కలిసినట్లగపడు చోటును ఇటీవలి భారతీయుల క్షితజను, దిక్చ్రక్రమునని తెలుపుచున్నారు. దీనినే ఆంధ్రకవితా పితామహుడు అల్లసానిపెద్దన్న 'మిన్నులుపడ్డ చోటు' అని వర్ణించినాడు. ఈ భూమ్యాకాశసంధి ప్రదేశము వసిష్ఠ అనగా-సప్తమ మండలమున తొంబది యేడవ సూక్తమునందలి మొదటిమంత్రమున నిట్లుప్రశంసింపబడినది : ( VII - 97 - 1 ) "యజ్ఞే దివో నృషదనే పృధివ్యానరో యత్ర దేవయవోమదంతి." ఈమంత్రార్థ ప్రాముఖ్యములనుగూర్చి యీాదిగువ మరికొన్ని విశేషములను తెలిసికొనగలము.

ఇట్లు ఋగ్వేదమునందేగాక ఉపనిషత్తులో గూడ ద్యావాపృథివీ సంబంధము దివ్యముగా వక్కాణింపబడియున్నది. నన్నయ అపస్తంబ సూత్రుండు. కృష్ణయజుర్వేదమునకు చెందిన తైత్తిరీయోపనిషత్తును, అందు శిక్షావల్లి ప్రథమాధ్యాయ తృతీయానువాకములును క్షుణ్ణముగా నన్నపార్యుడెఱుగు ననుటకు సందేహము లేదు. ఈయను వాకమున దివ్యములగు నధికరణములు ఐదున్నవి. 1. అధిలోక 2. అధిజ్యోతిష 3. అధివిద్య 4. అధిప్రజ 5. ( అధి + ఆత్మ ) అధ్యాత్మమునని పేరుగలవు. అందైదవది

"అధరాహనుః పూర్వరూపం, ఉత్తరాహనుః
ఉత్తరరూపం, వాక్సంధిః జిహ్వాసంధానం."

శబ్దోత్పత్తి విధానమిందు నిర్వచింప బడినది. శబ్దోచ్చారణకు పూర్వరూపము, క్రిందిదౌడ; ఉత్తరరూపము మీాదిదౌడ; ఈరెండింటికిని సంధానకర్త - నాలుక. వీని సంధానఫలితము - శబ్దము. ఇక నధివిద్యంగూర్చి తెలిసికొందము విద్యావ్యాప్తికి విద్య నుపదేశించు గురువును, గురూపదేశమును గ్రహించుటకు శిష్యుడును ఉండవలయును. కావున నధివిద్యాక్రమమిట్లు నిర్వచింపబడినది. "ఆచార్యః పూర్వరూపం, అంతేవాస్యుత్తర రూపం, విద్యాసంధిః ప్రవచనం సంధానం." విద్యాప్రాప్తికి పూర్వరూపము ఆచార్యుడు; ఉత్తర

రూపము శిష్యుడు. గురుప్రవచన మూలముగా వీరికి సంధానము కలుగగా ఫలితము విద్యాగ్రహణము, విద్యాప్రాప్తి. గురుశిష్యాది ప్రజాప్రాదుర్భావ క్రమము అధి ప్రజాధికరణమున తెలుపబడినది :-

" మాతాపూర్వరూపం పితోత్తరరూపం
ప్రజాసంధిః ప్రజ నం సంధానం "

బీజగ్రహణానుకూల క్షేత్రము మాతృదేవి. ఆమె పూర్వరూపము. బీజప్రదుడు జనకు డుత్తరరూపము. వీరి సమాగమము ప్రజననము. ఫలితము పుత్రోత్పత్తి, ప్రజావృద్ధి.

ఇక నధిజ్యోతిషమును గూర్చి ప్రస్తావింతము. " భారతీయులకు విజ్ఞానగ్రంథ మేమియులేదు. వారికి Elements మూలకములే తెలియవు. పంచభూతములే వారి మూలపదార్థములు. విజ్ఞానశాస్త్రరీత్యా ఏయే మెలిమెంట్సు చేరిన భూమి ఏర్పడినదో, నీటిలో నేమేమి యున్నవో, అగ్నిస్వభావ మేమో, వాయురచనా క్రమమెట్టిదో వారికి బొత్తిగా తెలియదని దారుణ దోషము భారతీయుల కంట గట్టబడుచున్నది. అసందర్భ విమర్శకుల అజ్ఞాన దోషమేగాని ఇందు భారతీయులదోషము లేదు. మనఋషులకు నీటిరచనాక్రమము నేటివిజ్ఞానదృష్ట్యా చక్కగా తెలిసియుండెననుటకు పై వాక్యము ప్రబలప్రమాణము.

ఈనాటి వైజ్ఞానిక ప్రజకు తెలిసిన Hydrogen, Oxygen వాయువుల భేదము ఏనాడో భారతీయులకు చక్కగా తెలిసియుండెను. వారు హైడ్రోజన్, ఆక్సిజన్ పదములు వాడుకచేయలేదు. నిజమే. అంత మాత్రముచేత వారికేమియు తెలియదని అజ్ఞాన మంటగట్టుట మహా సాహసము; మిక్కిలి దోషము. ఇంగ్లీషుభాషలో నీటిని Water అందురు. వాటర్ పదము భారతీయభాషలోలేదు. కనుక భారతీయు లకు నీరు తెలియదనుట ఎంత అసందర్భమో యోజింపుడు. వాటరు గాకున్న జలమనియో, పానీ అనియో సమానార్థ పదములిట వాడు కలో ఉండియున్నవి. అట్లే హైడ్రోజన్, ఆక్సిజన్ పదములు వాడుకలో లేకున్నను ఆ యర్థమునే ఇచ్చు పదములు ఈయధిజ్యోతిషాధికరణ ములో స్పష్టముగా నున్నవి; చిత్తగింపుడు :

"అగ్నిః పూర్వరూపం, ఆదిత్యఉత్తరరూపం, వైద్యుతస్సంధానం ఆపస్సంధిః" ఈమంత్రార్థము ప్రతిపాదించుటకు ముందు ఉపోద్ఘాతము అవసరము. ఇపుడుమన 'హైస్కూళ్ళ' లోను 'కాలేజీ'లలోను విజ్ఞాన శాస్త్రము నభ్యసించు విద్యార్థులు హైడ్రోజను వాయువును స్వయముగా తయారుచేసి దానికి జ్వాలాస్పర్శచేసి చూచునపుడు లేతనీలిమిగల జ్వాలతో నది మండును. ఆజ్వాలయొక్క వేడిమి మూడువేల డిగ్రీలని నేటి వైజ్ఞానికులు తెలుపుచున్నారు. కుతకుత ఉడుకుచున్న నీటివేడిమి సాధారణముగా నూరు డిగ్రీల సెంటిగ్రేడు మానమున నుండగలదు. దీనికి ముప్పదిరెట్లు ఎక్కువదారుణముగల జ్వాలతో హైడ్రోజన్ మండుచున్నది. ఇంతటి యుగ్రత కలదగుటచేత ఉక్కును వెన్నవలె కరిగించగలదు. ఉక్కు ముక్కలతుకుటకు హైడ్రోజను జ్వాలనే సాధనముగా చేసికొని ఉక్కుపనివాండ్రు నిత్యమును వాడుచున్నారు. ఇంతటి ఉగ్రోష్ణప్రభావముగల హైడ్రోజన్ జ్వాలను భారతీయులు అగ్ని యనిరి. ఈయగ్నియొక్క పూర్వరూపమేమగును? మండకుండ వాయుస్థితిలోనే ఉన్న హైడ్రోజనే అగ్ని పూర్వరూపమనవలెనుగదా? నేడు హైడ్రోజనని చెప్పబడు వాయువునే తొల్లింటి భారతీయులు అగ్ని పూర్వరూపమని వ్యవహరించిరి. నాటి 'అగ్ని' పూర్వరూపమే నేటి 'హైడ్రోజనని' తెలిసికొనుట ముఖ్యము. ఇక ఆదిత్య ఉత్తరరూపమనగానేమి యనుసంగతి మనము తెలిసికోవలెను.

మనమందరమును మినిటునకు పదునారు సారులు ఊపిరితీసి విడుచుచున్నాము. బయటికి విడుచుగాలిలో ఒకవిషవాయు వున్నది. దీనినే పడమటి వైజ్ఞానికులు Carbon-di-oxide అని తెలుపుచున్నారు. ఈవిషవాయువును ఎప్పటికప్పుడే, వెంటనే పరిహరించుటకు ఏదో యేర్పాటు జగద్రక్షకుడు చేయనిపక్షమున విశ్వము ఈవిషవాయుప్రపూర్ణమై ప్రాణికోట్లు నశించిపోవును. అట్టి యుపద్రవముప్రాణులకు సంభవింపకుండ పరమేశ్వరుడొక చక్కని యేర్పాటుచేసి లోకతంత్రము నడిపించుచున్నాడు. మనము విడిచిపెట్టుచున్న "కార్బన్-డై-ఆక్సైడు" నామముగల విషవాయువులో కార్బననబడు బొగ్గు

ధాతువును, ఆక్సిజ ననబడు వాయువును చేరియున్నవి. సూర్యకాంతి ప్రసరించు చున్నంతసేపు ఓషధులులోనగు వృక్షజీవులు ఈవిష వాయును భేదించి, బొగ్గుధాతువును తమశరీర నిర్మాణము కొఱకు సంగ్రహించి ఆక్సిజనును శుభ్రస్థితిలో విసర్జించుచున్నవి. ఆసందర్భ మునందే చెట్లఆకులలోనికి ఆకుపచ్చని రసము (Chlorophye) తయా రగుచున్నది. ఆమూలముగా వృక్షములు పర్ణవంతములు, పుష్పవంత ములు, ఫలవంతములును అగుచున్నవి. దీనినే ఇంగ్లీషు వైజ్ఞానికులు Photo-Synthesis 'ఫోటోసింథసిస్' క్రమమని తెలుపుచుందురు. ఈవిజ్ఞానవిషయము ఋగ్వేదము ఎనిమిదవ మండలము, తొంబదవ సూక్తము, పదునాల్గవ మంత్రమునందు చక్కగా వివరింపబడినది.

"...అర్కమభితో వివిశ్రే బృహద్ధతస్థౌ భువనేష్వంతః పవ మానో హరిత అవివేశ" ఋ. VIII-90-14.

"సూర్యభగవానుడు భువనములమధ్య నున్నత స్థానమున చక్కగా ప్రకాశించుచున్నాడు. పత్రీకరణ దక్షుడైన పవమానుడు ఆకుపచ్చ వర్ణము ధరించి ఓషధీపర్ణముల నావేశించి యున్నాడు."

ఇందువలన నేమి తేలుచున్నదనగా — సూర్యకాంతి సమక్షమందు వృక్షజీవులు వాతావరణమునందలి వాయువుల భేదించి తమ కవసరమైన పదార్థములను తాముగై కొని ఆహారాదుల నిర్మించుకొనుచు, తమ కవ సరములేని పదార్థములను విసర్జించుట మూలముగా గాలిని శుభ్రపఱచు చున్నవి. ఇట్లు వృక్షములచే విడువబడిన శుభ్రవాయువు లను పాశ్చా త్యులు ఆక్సిజ ననుచున్నారు. మనపూర్వులు దానినే 'ఆదిత్యఉత్తర రూప' మనిరి. సూర్యకాంతి ప్రసరించుట మూలముగా 'వాయువు కార్బను - డై - ఆక్సైడునుండి విడివడుటచేత దీనినివారు 'ఆదిత్యఉత్తర రూపమ'ని వ్యవహరింపవలసి వచ్చినది. పేరుభేదమైనను, విశాలవిశ్వ ములో పరిశుభ్రమైన 'ఆక్సిజను' వాయువెట్లు ప్రాప్తమగు చున్నదో ఎఱిగియే వారావాయువు 'ఆదిత్యఉత్తరరూప' ని చక్కగా తెలిపిరి.

ఇక అగ్ని పూర్వరూప, ఆదిత్య ఉత్తరరూప విశిష్టములైన వాయు వుల రెండింటిని గూర్చి అధిజ్యోతిష మేమి తెలుపుచున్నదో చూడ వలసియున్నది.

"అగ్నిః పూర్వరూపం ఆదిత్య ఉత్తరరూపం
వైద్యుత స్సంధానం ఆపస్సంధిః"

అగ్నిపూర్వరూప నామవాయువునకును, ఆదిత్య ఉత్తరరూప నామ వాయువునకును విద్యుత్ సంబంధమైన సంధానము గలిగించిన పక్షమున జలమేర్పడును

మన కాలేజీలలో నీటి రచనను (Composition of Water) గూర్చి పరిశోధనచేయు విద్యార్థులు ఈవాయువుల నొకగొట్టములో జాగ్రతగా సమర్చిపెట్టి వాని కందునట్లు మెఱుపును (Electric Spark) మెఱిపింతురు. ఆమెఱుపునకు ఫలితముగా నీరు ఏర్పడును. ఇట్లేర్పడినది నీరనుటకు నిదర్శనమేమి ?

చక్కని నీలిమచ్ఛాయ (Blue colour) గల మైలతుత్తము (Copper Sulphate) స్ఫటికములను జాగ్రత్తగా వేడిచేసినప్పుడు స్ఫటికీకరణజలము (Water of crystallisation) ఇగిరిపోయి మైలతుత్థము వివర్ణమై తెల్లటి పొడియగును. ఈపొడికి మెఱుపుమెఱిపించినపుడేర్పడిన ద్రవ బిందువులతో సంపర్కముగలిగించినంతలో చక్కని నీలిమచ్ఛాయ ఎప్పటి వలె నేర్పడగలదు.

కాబట్టి అగ్నిపూర్వరూప, ఆదిత్యఉత్తరరూపములని పూర్వ భారతీయ వైజ్ఞానికులును, Hydro-en, Oxygen అని నవీనులును పేళ్ళుపెట్టి ఏవాయువులతో పనిచేయుచున్నారో ఆవాయువులు రెండింటికిని విద్యుత్సంపర్క రూపమైన సంధానము లభించినపుడు జల మేర్పడుచున్నది. ఈసంగతి పూర్వకాలమున భారతీయులకు నాడే తెలిసియున్నదని ఈ యధిజ్యోతివిషయము దివ్యముగా ఋజువు చేయుచున్నది.

ఇట్లు నాలుగధికరణముల ప్రశంస ముగించి అధి లోకాధికరణమునకు వృత్తము. అధిలోకము :

"పృథివీ పూర్వరూపం ద్యౌరుత్తరరూపం
ఆకాశస్సంధిః వాయుస్సంధానం"

ధరణియు కప్పును బోలెనున్న భువిదివి ద్వంద్వమునకు పృథివి పూర్వరూపము, ద్యౌరుత్తరరూపము. వీనికి వాయువు సంధానకర్త

సంధానఫలితము ఆకాశము. కాబట్టి నన్నయభట్టారకుడు తైత్తిరీయోపనిషద్విజ్ఞానముతో ఋగ్వేద విజ్ఞానమును మేళవించి, 'భూసతికిన్ దివంబునకు పొల్పెసగంగ' సమాగమ మయ్యెనని ఎంతో చక్కగా వర్ణించినాడు.

ఆ సమాగమము శరత్ సమాగమము. శర[1] దృతువు వర్ష ఋ[2] తువు వెంటనే వచ్చునది. వర్ష కాలమున నధికవర్ష పాతముచేత వాతావరణమంతయు నీటియావిరితో నిండి యుండును. ఇట్లు నీటియావిరితో విశేషముగా కూడుకొనియున్న వాతావరణముపై చంద్రకాంతి ప్రసరించు నపుడా కాంతికి చక్కని వన్నెతోకూడి విశిష్టమైన తేజస్సుగలిగి బహురమ్యముగా ప్రకాశించును. శరత్కాలపు వెన్నెలను ప్రశంసింపనికవి మన దేశములోలేడు. ఉండబోడు. గేదె పెరుగును కాళిదాసు[3] మహాకవి "మాహిషంచ శరచ్చంద్ర చంద్రికాధవళందధి" అని వర్ణించియున్నాడు. శరత్కాలపు వెన్నెలకుగల వింత తేజస్సు ప్రకృతి సౌందర్య విశేషములలో మిక్కిలి ప్రశంసాపాత్రమైనది. కాబట్టి ఋగ్వేదమునాటినుండి భారతీయ కవివరులచే శరచ్చంద్రికా ధావళ్యము కొనియాడ బడుచున్నది. ఋగ్వేదము రెండవమండలము నాల్గవసూక్తములో నీటియావిరితో కూడుకొని తేజోవంతమైన కాంతి "ద్యౌరివస్మయ మానోనభోభిః" అని వర్ణింపబడియున్నది. కాబట్టి ద్యావాపృథివీ దంపతుల శరత్సమాగమము తేజోవిశిష్టమై సకల ప్రమోదకరమై విలసిల్లెననుట ఎంతయు ఒప్పియున్న ప్రకృతిసత్యము.

ఇంతవఱకు మనము "భూసతికిన్...పద్యములో పూర్వభాగాంశములనుగూర్చి ముచ్చటించుకొంటిమి. ఇక ఉత్తర భాగాంశములను గూర్చి చర్చించి తెలిసికోవలసిన విశేషములు చాలగలవు.

## 10. మహర్షి మండలోపాసిత రాజహంస

మహర్షిమండల మనగా సప్తమహాఋషులు నక్షత్ర రూపములతో నెందు ప్రకాశించుచున్నారో ఆనక్షత్రమండలమని యర్థము. మన భరతఖండములో నీనాటి జ్యోతిశ్శాస్త్రవేత్తలు అశ్విని, భరణి, కృత్తిక,

మొదలగు నక్షత్రములను ఇరువదేడింటిని, సప్తఋషులను, ధ్రువుని అగస్త్యనిమాత్రము గుర్తింప గల్గుచున్నారు. తక్కిన చుక్కలను గూర్చి మన దేశమున నిపుడు ప్రబలియున్న అజ్ఞానము మిక్కిలి దుఃఖమును కల్గించుచున్నది.

మంచిదృష్టిగల మానవులు ఆకాశమునగల చుక్కలను జాగ్రతగా పరిశీలించి లెక్కపెట్టినపక్షమున, ఆనక్షత్రసంఖ్య సుమారు ఎనిమిది వేలుండును. టెలెస్కోపు యంత్రసాయము గాని దూరపు చుక్కలను దగ్గరగాను పెద్దవిగాను చూడగలము. యంత్రసాయ మక్కర లేకుండ ఖగోళవేధచేసి ఎనిమిదివేల చుక్కలను గుర్తింప గలము. ఋగ్వేదకాలమునాడు ఈచుక్కల నన్నిటిని వేదఋషులు చక్కగా గుర్తించిరి; వర్గీకరణము చేసిరి; గుంపులుగా నేర్చిరి; గుంపులు సూచించు నాకారమునుబట్టి వానికి పేరులు పెట్టిరి. మన ఇండ్లలో స్త్రీలు ఉదయముననేలేచి ముగ్గుతో బొట్లుపెట్టి, ఆబొట్లు ననేకవిధములైన ముగ్గుగీతలతో కలిపి, గుమ్మడిపండ్లు, మెలికలుగల పాములు, వింతవింత పువ్వులు మొదలగు దృశ్యములను రచింతురు. అదే విధముగా ముత్యములవలె నభోరంగమున మెఱయు చుక్కలను వేదఋషులు తమభావనాశక్తినిబట్టి బహువిధములనొండొంటిం గలుపుకొనినప్పుడేర్పడు ఆకారములనుబట్టి ఒకొక్కచుక్కలగుంపున కొక్కొక్క నామకరణము చేసిరి.* దేశమును రాష్ట్రముల క్రిందను, రాష్ట్రములు జిల్లాలక్రిందను, జిల్లాలను తాలూకాలు క్రిందనువిభజించి రాజ్యతంత్రము నిర్వహించుచున్నట్లే, పైనిచెప్పిన ఎనిమిది వేల చుక్కలను వేదఋషులు సుమారొక నూటయెనిమిది వర్గముల క్రింద విభజించి చక్కలని పేరులు పెట్టిరి.

వేదములందును పురాణములందును ఈనక్షత్రనామములు శాశ్వతముగా నిల్చియున్నవి. ఈనామములు భరత భూమినుండి నా నా

* ఋ X – 124 – 7 "కవిః కవిత్వాది విరూపమాస." కవి తన బుద్ధిబలము చేత ఆకాశమున గల నక్షత్ర సమూహముల యొక్క రూపము నిర్ణయించుచున్నారు.

దేశములకు వ్యాపించి, పాశ్చాత్యుల నోళ్ళలో బడి నలిగి వింతరూప ముల నొందినవి. సూటు వేసికొని కోటు బూట్లు ధరించి దొరటోపీ పెట్టుకొని నప్పుడు మన మిత్రులనే వింత వేషముతో నాటకపాత్రలను ధరించియున్నను మన మొకప్పుడు గుర్తింపలేక పోవచ్చును. గురుతు పట్టలేరు. కాని ఆ వేషభాషలను విడిచిపెట్టినప్పుడు స్వస్వరూ పముతో మనవారు మనయెదుట నిలిచి విస్మయ మొనరింతురు. అట్లే నక్షత్రవిషయమునకూడ జరుగుచున్నది.

వేద పురాణ ప్రసిద్ధములైన భారతీయ నక్షత్రముల నామములను, వాని యధిదేవతలను పాశ్చాత్య దేశములవారు నేటికిని వ్యవహరించు నామములతో సమన్వయముచేసి పట్టికలు తయారుచేసి, ఈగ్రంథము నకుముందే అనుబంధముగా నిచ్చియున్నాను. ఈపట్టికలను ఎంత జాగ్రత్తగా పఠించి జీర్ణము చేసికొనిన, నంత మేలు మన సంస్కృతికి చేకూరగలదు. వేదపురాణ వాఙ్మయ మంతయు మన కపుడు కరతలా మలకము కాగలదు. మన దేవతలందరును అపుడు వారి వారి వాహన ధ్వజములతో, వారు వారొనరించిన ఘనకార్యములతో, వారి వారికి మనము చేయవలసిన పూజారాధనలతో కూడిన పండుగదినము లతోకూడ మనయెట్టయెదుట ప్రత్యక్షము కాగలరు. మన ప్రాచీన సంస్కృతి యంతయు నవీన వైజ్ఞానిక పరీక్షాగ్ని కాగి నిలిచి వన్నె కెక్కి ప్రకాశింపగలదు. మనల నావేశించిన దయ్యము విడిచిపోగలదు. ఆనక్షత్రముల పట్టిక నీగ్రంథ పఠన సందర్భమున పలుమారు తడవ వలసి యుండును. ప్రస్తుతము రాజహంసవృత్తాంతము నారయుదము.

ఉత్తరాకాశస్థిత నక్షత్రములలో నిది యొక ప్రసిద్ధమైన నక్షత్ర సమూహము. వేదములలో హంస పెక్కుచోట్ల రమ్యముగా వర్ణింప బడినది. పాలవెల్లి మిక్కిలి దట్టముగా దోచు పట్టులందు అనగా జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ ప్రాంతములో ఎగువ శ్రవణ నక్ష త్రముల చెంత దీనింజూడగలము. దీని యాకారము నీదిగువ చిత్రము విశదము చేయగల ఇందు ౧-౨ సంఖ్యలుగల చుక్కలు మధ్య గీత గమనింపవలెను. సరళముగాలేక ఈగీత 3 అంచెలుగల చోట

కొంచెము వంగియున్నది. ఈ రేఖకు 3 వద్ద అడ్డుగా ర-౫ సంఖ్యగల సరళరేఖగలదు. మొత్తముమీద ౧, ౨, ౩, ర, ౫ సంఖ్యలుగల చుక్కలు ఒక శిలువ (Cross) ఆకారము కలిగియుండును. వీని నాకాశమున శ్రవణ ధనిష్ఠ నక్షత్రములమధ్య చూడగలము. హంస మీద భాగమున నుత్తరముగా దేదీప్యమానమైన తేజస్సుతో మెఱయు (Vega) అభిజిన్నక్షత్రముగలదు. కాంతి విషయమున నగ్రగణ్యమైన (First Magnitude Star) నక్షత్రమని ప్రసిద్ధిగల యీ 'వేగా' నక్షత్రమే బ్రహ్మయని కొందరు తెలుపుదురుగాని అది సరిగాదు. చతుర్ముఖుడు వేగా ప్రక్కనే గలదు.

ఆ వివరములకు మరల వత్తము. ముందు రాజహంస చుక్కలను గూర్చి ఋగ్వేదమునగల వివరముల తెలిసికొందము. రాజహంసను వేదము హంసయనియే వర్ణించుచున్నది.

"బీభత్సూనాం సయుజం హంసమాహు రపాందివ్యానాం సఖ్యే చరంతం". X - 124 - 9.

మిక్కిలి కలతచెంది బీభత్సముగానున్న దివ్యాపగాజలములకు నెమ్మది గలిగించుచు చరించుచున్న పక్షిరూపమునకే హంసయని పేరు.

మిక్కిలి కలతచెంది బీభత్సముగా నున్న దివ్యాపగాజలము లేవి ?

జ్యేష్ఠా శ్రవణ ప్రాంతములలో మిక్కిలి సాంద్రమై గోచరించు (Milky Way) పాలవెల్లినే వేదఋషులు క్షీరసాగరమనిరి. విష్ణుభగవానుడు క్షీరసాగరశయనుడు. విష్ణుమూర్తి యాదవకులేశుడై శ్రీకృష్ణుడు, శ్రీహరియునని ప్రశంసింపబడుట పురాణ ప్రసిద్ధము. యాదవకులమునకు హరివంశమని పేరు సుప్రసిద్ధము. ఆకులముయొక్క చరిత్ర వర్ణించు గ్రంథము హరివంశమనుపేర సంస్కృతమునగలదు. దానిని ఎఱ్ఱాప్రెగ్గడ తెనిగించి యున్నాడు. శ్రీకృష్ణుడు ఈహరికులేశుడు. హరికులేశ శబ్దము యూరపుఖండ వాసుల నోళ్ళబడి నలిగిపోయినది. విశాఖపట్టణము వైజాగ్, కాళీఘట్టము కలకటా అయినట్లే, హరికులేశ శబ్దము (Hercules) హెర్క్యులీస్ శబ్దముగా మారినది. ఉత్తరదిశా నక్షత్రములలో

(Hercules) గుంపుకలదు. ఇదే వేదప్రసిద్ధమైన విష్ణుభగవానుని పరమ పదము. విష్ణుదేవుని పాదాంగుష్ఠ నిష్ఠ్యూతదివిజగంగాభవాని. (Milky Way) పాలవెల్లిదృశ్యములో ఒత్తుగానున్న భాగము క్షీరోదము; పలుచపలుచగా సన్నముగా వ్యాపించియున్న దృశ్యమే మిన్నేఱు; ఆకాశగంగ. ఆకాశగంగా ప్రవాహము విష్ణుపాదమునుండి ఉరికిపడునప్పుడా గంగాజలము మిక్కిలి క్షోభచెంది కలగియుండుట సహజము. అట్లు సంక్షోభమునొందిన ఆకాశగంగాజలములకు శాంత స్వభావముగల హంస నెమ్మదినిచ్చి ప్రశాంతత చేకూర్చుచున్నది. సంక్షోభించు వియద్గంగాజలముల దృశ్యము ఈప్రక్కపటములో చూడగలరు.

హంసకు హగ్ంస అను రూపాంతముగలదు. హగ్ంస శ్శుచిషత్ అను సుప్రసిద్ధ వేదమంత్రములో నీ హంస ప్రశంసింపబడును. హగ్ంస శబ్దభవము (Cygnus) సిగ్నస్. ఈహంసచుక్కలను పాశ్చాత్యులు సిగ్నస్ పేరిట వ్యవహరించుచున్నారు.

హంస దివిజగంగకు ప్రశాంతత కూర్చుటేగాక ఖగోళమున నీరక్షీర విభాగముకూడ చేయుచున్నది. విష్ణువు పాలసంద్రమున శయనించి యున్నాడు. ఆ పద్మనాభుని పదాబ్జమున పుట్టినది గంగాభవాని. క్షీరోదహంసమునకును, ఆకాశగంగకును మధ్యనిలిచి, నీరక్షీర విభాగము చేయుటచూడ జూడవింతయగును; భర్తృహరి చెప్పిన పద్య రత్నము మనస్ఫురణకు రాకమానదు. హంస బ్రహ్మదేవునికి వాహనము. బ్రహ్మదేవునికి ఒకప్పుడెప్పుడైన పిచ్చియెత్తి తనవాహనముపై కోపమువచ్చి నపుడు ఆపక్షిని నిర్బంధించి చక్కని పద్మములతో ప్రకాశించుచున్న సరస్సులో విహరింపకుండ ఆజ్ఞపెట్టకలడు.

" చ॥ వనజభవుండు కోపమున వాహనమైన మరాళభర్తకున్
వనజవనీ విహారకలనంబును మాన్పగజాలు" గాని గుం
భనమున దుగ్ధజీవనవిభాగవిధాన నిరూఢనైపుణీ
జనితమహాయశోవిభవసారము హంసకుమాన్పనేర్చునే?

మానుపజాలదు కావుననే హంస ఖగోళభూగోళములలో చక్కగా నీరిచక్షుణతోడ నీరక్షీరవిభాగము చేయగలదని ప్రసిద్ధి నొందినది.

## సరస్వతీ నది

ఋగ్వేదములో సరస్వతీనదికిగల ప్రసిద్ధి మరి యేయితర నదికిని లేదని వక్కాణింపనగును. వేదములో గంగానదిప్రశంస ఒకటి రెండు చోట్ల మాత్రముగలదు. ఇటీవల గంగానదికిగల ప్రశస్తి ప్రాముఖ్యము లానాడు సరస్వతీనదికి ఉండెడివి. ఇప్పటి యమునానదికి సమీపమున దృషద్వతి సరస్వతి యని రెండు నదులుండెడివి. ఈనదుల మధ్యప్రదేశమునకు బ్రహ్మావర్తమని పేరు. బ్రహ్మావర్తమును మనువు ప్రశంసించియున్నాడు. ఇటీవల మేఘసందేశ కావ్యమున కాళిదాసుకూడ బ్రహ్మావర్తమును పేర్కొని యున్నాడు. నేడు సరస్వతీనది కానరాదు. అంతర్వాహినియై సరస్వతీస్రవంతి మానవులకు కానరాకుండ లోలోపల ప్రవహించి గంగా యమునలతో ప్రయాగలో సంగమించుచున్నదని భక్తులవిశ్వాసము. కనుక గంగా యమునా సంగమప్రదేశము, అంతర్వాహిని సరస్వతితోకూడి త్రివేణీ సంగమమను పుణ్యతీర్థమైనది.

ఇపుడీలోకమున నదీరూపమున సరస్వతీస్రవంతి కానరాకున్నను వేదయుగములో నానదీమతల్లి పుణ్యనదిగాను పలుకుల వెలదిగాను మిగుల ప్రఖ్యాతినొంది పూజలగొనుచు స్తుతింపబడుచుండెను. సరస్వతీతీరము మిక్కిలి పవిత్రమైన పుణ్యభూమియని జనులెంచుచుండిరి. ఆపుణ్య ప్రదేశమున జరిగించిన యజ్ఞయాగములు దేవతలకు మిక్కిలి ప్రీతికరములనియు, సరస్వతీదేవి అట్టి పుణ్యయాగపరుల నావేశించి, కవిత్వోద్రేకము కల్గించి మంత్రద్రష్టలను శ్రుతి సూక్త్యాకర్ణనాపరులను గావింప ననుగ్రహించుననియు, నాటిభక్తులు విశ్వసించుచుండిరి. సరస్వతిని నదీదేవతగాను, వాగ్దేవతగాను ఆర్యులు పూజించి స్తుతించినక్రమము సంగ్రహముగా పరిశీలించుట చాల ప్రయోజనకరము.

అంబితమే! నదీతమే! దేవితమే! సరస్వతీ! (ఋ II. 41 - 16.)

తల్లులందరిలో గొప్పతల్లీ! నదులలో మేటినదీమతల్లీ! దేవతలం దరిలో శ్రేష్ఠురాలవైన సరస్వతీ!

ఉతస్యానః సరస్వతీ ఘోరాహిరణ్యా వర్తనః! వృత్రఘ్నీః -
(ఋ VI - 61 - 7).

దేవతామూర్తీ! సరస్వతీ! బంగారు మార్గమున ప్రవహించుచు శత్రువులను ఘోరముగా సంహారించుతల్లీ!

"యస్యా అనంతోఽఅహ్వాతస్త్వేషశ్చరిష్ణురర్ణవః।
అమశ్చరతి రోరువత్॥ ఋ VI -61-8

గుండెతలడ మొదవించు మహానినాదముతో మహార్ణవముం బోలె నద్భుతబల వేగములతో సమసమును తణిమి త్రోసికొనువచ్చు నఖండానంత ప్రవాహరూపవతీ! సరస్వతీ!

"పక్షోదసాధయసాస్రస ఏషాసరస్వతీ।
ధరుణామ్మాయసీపూః। ప్రబావధానారథ్యే
వయాతి విశ్వాఅపోమహినా సింధురన్యా॥" ఋ VII - 95-1

మిక్కిలి వేగముతో ప్రవహించుచున్న యీసరస్వతీనదీ ప్రవాహమే మనకుదిక్కు; మనరక్షకర్త! మన ఇనుపకోట! మనశత్రు సంహారి! ఇంత శక్తి మహిమ మరేనది కున్నవి?

"మహోఅర్ణః సరస్వతీ। ప్రచేతయతి కేతునాధియోవిశ్వారాజతి!"
I. 3-12

దివ్య ప్రవాహమా! నీ దివ్యప్రభ సమస్తమును వెలిగించుచున్నది! ప్రతి పవిత్రభావమునకును నీవు ఉత్తేజము కలిగించుచున్నావు! దేవీ సరస్వతీ!

అనోదివోబృహతః పర్వతాదా సరస్వతీ! యజతాగంతు యజ్ఞం।
హావం దేవీజుజుషాణాఘృతాచీ శగ్మాంనోవాచమశతీశృణోతు॥
V - 43-11

దేవీ! సరస్వతీ! పరిమళమూర్తీ! మావాక్యములను దయతో నాకర్ణింపుము. మాప్రార్థనల మన్నింపుము. నీయాగమనము నాతురతతో ప్రతీక్షించుచున్న మమ్ము కటాక్షించి మహోన్నత స్వర్గలోక

మునుండి అవతరించి, పర్వతావరోహణము గావించి మాయజ్ఞమునకు విచ్చేయుము. నీరాకచే మాయజ్ఞమును పావనముచేసి, సంపూర్ణ యజ్ఞఫలము మాకు దయచేయుము.

చోదయిత్రీ సూనృతానాం చేతంతి సుమతీనాం యజ్ఞందధే సరస్వతీ ! (I. 3. 11).

దేవీ! సరస్వతీ! నీవు సత్యమునే పలికింతువు! నీ ప్రేరణచేతనే మానవులు మనోజ్ఞగేయముల రచింపగల్గుచున్నారు! నీయావేశ బలముచేతనే మానసములందు చక్కని భావములు ఉదయించి చైతన్యము ననుగ్రహించుచు, తల్లీ! మాయజ్ఞము నంగీకరింపుము.

అని యిట్లు ఋగ్వేదకాలమునాడు దేవీమతల్లియు, మాతృమతల్లియు, నదీమతల్లియునని భక్తిపూర్వకముగా ప్రశంసింపబడిన పలుకులవెలంది సరస్వతి, పాండవుల వనవాసమునాటికి కామ్యకవనస్థమైన యొక నదీమాత్రముగా గ్రహింపబడి సామాన్యమైనదిగానే వర్ణింపబడినది. తెల్లతామరలు, కలువలు మొదలగు పువ్వులచే నలంకరింపబడి, ఆపుష్పరజస్సౌరభమును గ్రహించుచు, క్రౌంచహంసాది పక్షులకాశ్రయమిచ్చి, ప్రముదితమై, నిర్మలాకాశమున చక్కగా మెఱయుచున్న గ్రహనక్షత్ర గణములతోకూడి ప్రకాశించు చంద్రుని ప్రతిబింబింపజేయుచు, చల్లని తేటనీటితో, సంపూర్ణముగా, ప్రశాంతముగా ప్రవహించుచున్న పుణ్యస్రవంతి, సరస్వతీ తీర్థప్రశంస మాత్రము ఈఘట్టమున వ్యాసరచిత భారతమున కనబడుచున్నది. బహుకాలము నుండి ఏరికింగానరాక నామమాత్రావశిష్టమైన సరస్వతీ నదీప్రశంస విసర్జించి, సకల విద్యాధిదేవతయైన జగదంబ సరస్వతిని, దేవీసరస్వతిని వర్ణింప బూనుకొనుటలో నన్నయభట్టారకుడు ప్రదర్శించిన ప్రతిభ అద్భుతము. సంహితాభ్యాసుడగు నన్నయభట్టారకుడు, వేదగర్భితమైన విజ్ఞానమును, స్మరించుకొనుచు వేదసంపాదకుడైన వ్యాసుడే ఎత్తుకోకవిడిచిన విజ్ఞానమును, సంస్కృత భారతములో, కృష్ణద్వైపాయనుడై తడవక విడిచిన వేదవిజ్ఞానమును, తెనుగుప్రజలపై గల అత్యంత తాదరాభిమాన చోదితుడై, మూలమున గానరాని మహో

న్నత విజ్ఞాన విషయముల నేర్చి, నన్నపార్యుడు తెనుగు భారతమున గూర్చి, మనకందిచ్చి ధన్యుడై, తెనుగుజాతికి శాశ్వతముగా వంద్యుడగుచున్నాడు.

నేను విజ్ఞాన జిజ్ఞాసువును, పరమసత్యమునే ధ్యానించి, 'సత్యం పరంధీమహి' యని, సత్యమునే ప్రవచింపనెంతును. పై వాక్యముల యథార్థమును నిరూపించుటకు ఋగ్వేదమునందలి మరి రెండు మంత్రరాజముల నిటు వివరించుచున్నాను. అందొకటి బ్రహ్మసరస్వతుల భార్యాభర్తృసంబంధ నిరూపింపగలదు. మూలభారతమునందు సరస్వతి యెవరో, ఆమె బ్రహ్మకు భార్యయెట్లైనదో తెలుపబడలేదు. సృష్టికర్త బ్రహ్మ. బ్రహ్మ ఏస్త్రీని సృష్టించినను వావి ఆమె అతనికి కూతురేయగును. తానుసృజించిన ఒకానొకకూతునే బ్రహ్మభార్యగా గ్రహించెనని నుడువుటకు కారణమైన బీజవాక్యము వేదములో గలదు. ఆ మంత్రార్థమును లెస్సగా గ్రహించి నన్నయ్యభట్టు సంస్కృత మూలమున గల నదీ సరస్వతి ప్రసంగము విడిచిపెట్టి, వాణీహిరణ్యగర్భ దాంపత్యమును ప్రవచించుచు, ద్యావాపృథివి దాంపత్యమునకు ఉపమానముగా బ్రహ్మ సరస్వతీ దాంపత్యవిషయము నేరి చక్కగా నుగ్గడించినాడు. కావున నా వేదమంత్రము నిట ఎత్తి వ్రాయుచున్నాను.

ప్రసూమహేసుశరణాయ మేధాంగిరంభరేస వ్యసీంజాయమానాం
య అహనా దుహితుర్వక్షణాసురూపామినానో అకృణోదిదంనః

V. 42 - 13.

ఇది అత్రిమండలములోని మంత్రము. ఈమంత్రద్రష్ట అత్రి భౌముడు. విశ్వదేవతలను గూర్చిన యీసూక్తములోనిదగు నీమంత్రము బ్రహ్మ సరస్వతీ దాంపత్యగాధకు మూలబీజమైనది.

ఈమంత్రార్థమిది: ఏమహనీయమూర్తి మనకొఱకు అత్యంతమైన వాత్సల్యముతో నీసమస్తమును సృజించి తన దుహితయొక్క వక్షః ప్రదేశమునందు ఈ వివిధ సురూపములను భద్రపఱచి యున్నాడో, ఆసృష్టికర్తకు ఈసూక్తమును సమర్పించుకొనుచున్నాను. ఇప్పుడిప్పుడే నామనస్సునబొడమి క్రొత్తక్రొత్తగా మొలకలెత్తుచున్న భావములను

కూర్చుకొని, సూ_క్తరూపమున రచించి నేనారక్షకునికి సమర్పణము చేయుచున్నాను.

ఋగ్వేదమునకు సంబంధించిన ఐతరేయ బ్రాహ్మణములో ప్రజాపతింగూర్చిన యొకవింతకథగలదు. ప్రజాపతి తనకూతురైన రోహిణి సౌందర్యమునకులోంగి ఆమె నొక మృగమునుచేసి తానుగూడ మృగరూపముదాల్చి ఆమెను బలాత్కరింపబోగా, దేవతలాక్రోశించి, ఈ ఘోరము మాన్పింపుమని మృగవ్యాధరుద్రుని వేడుకొనిరి. ఆరుద్రుడు పశుపతిత్వము వరముగా బడసి, నిశితనారాచము ప్రయోగించి, పాపిష్ఠిమృగమును బడగూల్చెను. ఈకథ నక్షత్రరూపముననాకాశమున నేటికిని కానవచ్చుచున్నది. రోహిణీనక్షత్రమును, అచుక్కకు నైరృతిదిశను మూడుగొల్లకావిడిచుక్కలును, వాటికి నైరృతి దిశగా - మృగవ్యాధనక్షత్రమును ఒక్కవరుసను నేటికిని ఖగోళమున గానవచ్చుచున్నవి. మృగవ్యాధరుద్రుని పాశ్చాత్య జ్యోతిర్విదులు Sirius 'సిరియస్' అందురు. ఆకాశమున మెఱయు నక్షత్రములన్నింటిలో తేజోవిషయమున నగ్రగణ్యము (This is the first of all first - magnitude stars). ఈ మృగవ్యాధుడు ప్రయోగించిన బాణము, "మనవారు గొల్లకావిడచుక్కలు" అని చూపించు మూడు చుక్కల రూపమున నిలిచియున్నది. పాశ్చాత్యులీచుక్కలను (Belt of Orion) 'ఒరయన్ యోధుని పటకా' అని చూపుదురు.

ఇట్లు వేదమంత్రములు, గాధలు, పురాణగాధలు లోనగునవికూడి సరస్వతిని బ్రహ్మకు భార్యగాచేసినవి. వాగ్దేవతగాను, సకలవిద్యాస్వరూపిణిగాను వేదకాలమునాడు సరస్వతీదేవికున్న గౌరవప్రాముఖ్యములు బ్రహ్మకు లేవు.

సరస్వతీదేవి భాషాస్వరూపిణి; విద్యాధిదేవత; సంగీతకళాధిదేవత. కావుననే ఆమె వీణాపాణి. ఆమె ధరించినవీణ నక్షత్రమండలమున నక్షత్రరూపమున మెఱయుచు గానవచ్చుచున్నది. ఆ వీణామండల చిత్ర మిచట చూడనగును. సరస్వతీ స్వరూపమునకంటె ఆమెచేతిలోని వీణయే మిక్కిలి భాసిల్లుచున్నది. కాబట్టి జ్యోతిశ్శాస్త్రదృష్ట్యా,

సరస్వతీదేవి, వీణచుక్కలలో లీనమై యున్నది. ఆకారణముచేత ఆచుక్కల గుంపునకు వీణమండలమను పేరు రూఢమైనది. వీణను (Latin) లాటిన్ భాషలో 'లైరా' (Lyra) అందురు. లైరా అనగా వీణియయేగాని మరొకటికాదు. వీణెగుంపు చుక్కలలో ఒకవింత చుక్కగలదు. ఆచుక్కను గ్రీకుఅక్షరములలో 'ఎప్సిలాన్' అక్షర సంజ్ఞచే సూచించుచున్నారు. ఇంగ్లీషు అక్షరములలో ఇ (E) యను నక్షరమునకు మాతృక గ్రీకుల ఎప్సిలాన్ అక్షరము. ఈచుక్క స్థూలదృష్టికి ఒక్కచుక్కవలె గాన్పించినను, సూక్ష్మముగా పరిశీలించిన పక్షమునందు రెండు చుక్కలు కనబడగలవు. టెలిస్కోపు యంత్రసాయముతో చూచినపుడు ఇందొక్కొక్కటి రెండేసి చుక్కలజంటగా కనబడును. ఒక్కొక్క జంటలోగల ప్రతిచుక్కయు రెండవదాని చుట్టును పరిభ్రమించు చుండును. అంతేకాదు. మొదటిజంట రెండవజంట చుట్టును, రెండవజంట మొదటిజంటచుట్టునుకూడ తిరిగివచ్చుచుండును.

పర్యవసాన మేమనగా — వీణామండలములో గ్రీకు ఎప్సిలాన్ అక్షరసంజ్ఞగలచుక్క, ఒక్కచుక్కకాదు; నాలుగుచుక్కల సంపుటి. అందలి జంటలును చుక్కలుకూడ విచిత్రగమన విశిష్టములు. మన పూర్వులు ఈచుక్కలను వీని చిత్రగతులను ఎట్లుపరికించిరోగాని వీనిని చతుర్ముఖ బ్రహ్మ యని నిరూపించిరి. బ్రహ్మముఖముల సరస్వతి గలదనిరి. సరస్వతి వీణపాణి యనిరి. నవీన జ్యోతిశ్శాస్త్రము ఈవివరములను ధ్రువపఱుచుచున్నది. వేదఋషులకు యంత్రములుండెనా? టెలిస్కోపులుండెనా? వారీ వివరములను, కంటికి స్థూలదృష్టికి కానరాని విశేషములను, ఎట్లు తెలిసికొనిరి? తపోబలమా? యోగదృష్టియా? సహజమైన అంతర్దృష్టి జ్ఞానములా (Intuition)? ఏమైన కానిండు. ఆనాటి మహనీయులీ ప్రకృతి సత్యములను చక్కగా తెలిసికొని జనసామాన్యమునకు చక్కగా తెలియునట్లు చిత్రవిచిత్ర కవనములతో హృద్యముగా వేదపురాణగాథల రచించిరని, 'మొండిశిఖండి బండలైన విమర్శకులు' కూడ సత్యాన్వేషణ పరులైనచో ఒప్పుకోక తప్పదు.

## బ్రహ్మ పద్మాసనాసీనుడు

వీణామండలము (Lyra) దిగువ నొకానొక నీహార ప్రావృతమైన దృశ్యము గలదు. రూపము నొందిన పొగమంచును బోలు నిట్టి దృశ్యములను పాశ్చాత్యులు 'నెబ్యులే' (Nebulae అందురు. వీణా మండలమును పాశ్చాత్యులలో 'మెస్సిర్' (Messir) క్రిందనున్న పొగమంచు దృశ్యము గుండ్రముగా నుండుటచేత పడమటి పరిశోధకులు దానినుంగరముతో పోల్చి 'రింగ్ నెబ్యులా' (Ring Nebula) అనిరి. ఇంగ్లీషులో 'రింగ్' (Ring) అనగా ఉంగరము. నూరు అంగుళముల టెలిస్కోపులో ఈదృశ్యమునకు తీసిన ఛాయాచిత్రమిట చూడనగును. ఇటీవల (Mount Polomer) పాలోమర్ పర్వతసానువున ప్రతిష్ఠితమైన 200 అంగుళములు వ్యాసముగల టెలిస్కోపులో చూడగల దృశ్యముకూడ క్రిందచూడగలరు. ఈదృశ్యమును ఉంగర మనుటకంటె, శ్రీనాథమహాకవి వర్ణించినట్లు 'పొడవుమిగిలిన పొందమ్మి పూవు' అనుట ఎంతో ఒప్పియుండును. ఈతమ్మిపూ దృశ్యమునుండియే మొదట నొక్కచుక్క వెలువడినది; ఒకటిరెండు చుక్కలైనది; రెండు నాలుగైనవి; ఈవిధముగా బ్రహ్మఉత్పత్తిగని చతుర్ముఖుడు కాగల్గెను.

## సరస్వతీమండలమునకు విశ్వమునగల ప్రాముఖ్యత

**( Great Importance of Lyra in the Universe )**

చంద్రుడు భూమిచుట్టు తిరుగుచున్నాడు; భూమి సూర్యునిచుట్టు తిరుగుచున్నది. సూర్యుని మాటయేమి? సుమారు రెండువందల సంవత్సరములనుండి పాశ్చాత్య జ్యోతిశ్శాస్త్రవేత్తలు తీవ్రముగా చేయుచున్న కృషి మూలముగాను, అద్భుత ఖగోళపరిశీలన మూలముగాను ధ్రువపడిన సత్యమేమనగా — సూర్యుడు, బుధ, శుక్ర, భూ, కుజ, గురు, శనేశ్వర ముఖ్యగ్రహములతోను, చంద్రాది ఉపగ్రహములతోను, ధూమకేతు ఉల్కా గణములతోను, సెకెండుకు

పంౘ్రెండు మైళ్ళచొప్పున మినిటుకు పదువందల ఇరవై మైళ్ళచొప్పున గంటకు నలుబదిమూడు వేల రెండువందల మైళ్ళచొప్పున, దినము నకు పదిలక్షలముప్పదియారు వేలఎనిమిదివందల మైళ్ళు - ఈవిధము గ గంభీరవేగముతో దక్షిణమునుండి ఉత్తరదిశాగతుడై, వీణామండల ములోని (Vega) అభిజిన్నక్షత్రమువంక బోవుచున్నాడు. మనము సాధారణముగా చేయుచున్న రైలుప్రయాణములు, పడవప్రయాణ ములు, మోటారు ప్రయాణములు, విమాన ప్రయాణములు ఎంత నిజమో, సూర్యునితో పాటు భూమియు, భూమితో పాటు మనమును సరస్వతీమండలమువంక పోవుట అంతనిజము. ఈప్రకృతి సత్యమును పడమటి వారిటీవల రెండువందల సంవత్సరముల లోపున తెలిసికొన గల్గిరి గాని మనఋషులు వేదకాలమునాడే ఎఱిగియుండిరి. యమునికి దక్షిణాధిపత్యము స్థిరపఱిచిననాడే మనఋషులు ఉత్తరదిక్ప్రాముఖ్య మును, వీణావిష్ణుమండలములే మనకు పరమగతియను సత్యమును తెలిసికొనిరి. వేదములలో, శాస్త్రములలో, పురాణములలో, ఉపని షత్తులలో ఈ పరమ సత్యమును వీలైనచోట్ల వారు నొక్కినొక్కి చెప్పి, గట్టిగా 'ముక్తాయించు' చుండిరి. అద్భుతవేగముతో అన్ని మూలలనుండి నదులు సముద్రమును చేరుకొనునట్లు అష్టదిక్పాలకులు, అష్టవసువులు, సప్తమరుత్తులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు లోనగు దేవతలుకూడ సంభవస్థానమునే తుదకు చేరుకోగల్గుట విశ్వ రూపసందర్శన యోగమున దివ్యదృష్టితో నర్జునుడు చూచినట్లు భగవద్గీత తెలుపుచున్నది. వీణామండలము వేరు, విష్ణుమండలము వేరునని పాఠకులు భ్రమపడరాదు. విష్ణుడు శేషశాయి - బహువనపాద వాబ్ధి. విష్ణునినాభినుండి వెడలిన కమలమే బ్రహ్మదేవుని జన్మస్థానము. అజస్యనాభా చుక్కలను, పెట్టెలలో అరవలె, సదుపాయము కొఱకు గుంపులుగా పేర్కొన్నను, 'వీణావిష్ణుమండలములు నిజమునకు ఒకటె' మండలమున దగియున్నవి. కావున నిందుకొఱకు సందేహము లనవసరము.

గతించిన ఇరువది సంవత్సరములలోపున రేడియో పరిశోధన

ప్రాముఖ్యముగడించి వృద్ధియైనకొలది వీణామండల ప్రాశస్త్యమింకను హెచ్చెను. అగ్నిగోళ్లు సంభవించెనో సూర్యకను.

1933 సంవత్సరములో డాక్టర్ కార్ల్ జాన్స్కీ-దొరగారికి బెల్ - టెలిఫోన్ పరిశోధకశాల (Bell Telephone Laboratories) తో పని చేయుచుండగా ఒక వింత ఘూంకారము వినవచ్చెను ఆశాలలో నాదొరగారు గొప్పయంత్రజ్ఞుడు. అతడప్పుడు బహుశక్తివంతమైన శబ్దగ్రాహి (Sensitive-Radio Receiving Set) లో పనిచేయుచుండెను. మిడతలు, గొల్లభామలు మొదలగు పతంగజీవులకు సుదీర్ఘములైన రోసలు ఉన్నట్లే ఆనాటిశబ్దగ్రాహులకు Antenna సాధనము లమర్చబడి యుండెను. 'ఏంటెన్నా' సాధనము దూరశ్రవణమునకు మిక్కిలి అనుకూలించును. మిక్కిలి పొడుగైన 'ఏంటెన్నా' అమర్చబడిన శబ్దగ్రాహితో నతడు పనిచేయుచుండగా వింతఘూంకారమాతని చెవులబడెను. కాస్తసేపువినపడి ఈరొద ఆగలేదు. ఎడతెరిపిలేకుండ ఈసవ్వడి నిరంతరము వినబడజొచ్చెను. ఆశబ్దపు తీవ్రతైనను మందముగాక ఉన్నతస్థాయీనే విననగుచుండెను. ఏంటెన్నా రోసాలను అన్నిదిక్కులకుత్రిప్పిచూడగా శబ్దము ఒకానొకదిక్కునుండి ఉచ్ఛస్థాయిలో శ్రవణగోచరమయ్యెను. ఆదిక్కునుండియే యీరొద వెడలుచుండనోపు. జాన్స్కీ-దొర విడువక ప్రతిదినమును ఈఘూంకార విశేషములను పరిశోధించుచునేయుండెను. ఉచ్ఛస్థితిలో నీశబ్దము విననగు దిశ ఎప్పటికప్పుడే మారుచుండెను. పట్టువిడువక ఒక సంవత్సరకాలమిట్లు అనుదినమును ఈశబ్దగ్రాహితో పనిచేయుచు రాగా రాగా, మొట్టమొదటినాడు ఏదిక్కునుండి ఉచ్ఛస్థాయిలో నీఘూంకారము వినవచ్చెనో సరిగాపడాదినాటికి ఆదిక్కునుండి అట్లే ఈరొదవినవచ్చెను.

ఈశబ్దమునకు సూర్యగోళము కారణమగునాయని జాన్స్కీ-దొర మొదట అనుమానించెను. కాని సూర్యోదయ, సూర్యాస్తమానములతో నీధ్వనికి సంబంధము కనబడలేదు. మాసములు, ఋతువులు గడచిపోవుచుండ, ఈ రొదకు కారణమైన దిశకూడ మారుచుండెను. తొలినాడు రొదవినవచ్చిన దిశకు ఎదుట దిశనుండి ఆరునెలలనాడు

ఝూంకారము వినబడినది. కాబట్టి ఈశబ్దోత్పత్తికి కారకుడు సూర్యుడెంతమాత్రమునుకాడని స్థిరపడినది. సూర్యకుటుంబమునకు ఆవల, నక్షత్రమండలములో నేదోయొక్క స్థానమునుండి ఈరొద వెడలుచున్నదనుట నిక్కువము. ఆస్థానమేది ?

అమెరికాఖండములోని హార్వార్డు Harvard విశ్వవిద్యాలయములో University సుప్రసిద్ధముగా ఖగోళవేధసల్పుచున్న డాక్టరు షాప్లీ (Shapley) మహనీయుని పరిశోధనలమూలముగా వీణామండలములలోని అభిజిన్నక్షత్ర ప్రాంతమునుండి ఈశబ్దమువెలువడుచున్నట్లు స్పష్టమైనది. భూగోళముమీద చెన్నపట్టణము, బెజవాడ, బొంబాయి, కలకత్తా మొదలగు పట్టణములలో రేడియోమూలముగా వార్తలు, పాటలు, ఉపన్యాసములు మొదలగునవి (Broadcast) వెదజల్లబడుచున్నది. ఇట్లే తక్కిన ఖండములలోను దేశములలోను వందలకొలది శబ్దవ్యాప్తి స్థానములున్నవి.

అయితే విశ్వమునకంతకును రేడియో విద్యుత్తరంగాళి వ్యాపింపజేయగల నాభిస్థాన మున్నదా ? ఎక్కడ ?

క్షీరోదమధ్యమున వీణామండలమే విశ్వమంతకును శబ్దవ్యాప్తి చేయగల విద్యుత్తరంగోత్పత్తిస్థానము. (Celestial Broadcasting Station) అని తేలినది.

ఓహో ! సరస్వతీదేవి చేతి వీణామండలమా ! విశ్వములో నీకెంత ప్రాశస్త్యప్రాముఖ్యములు లభ్యమైనవి ? అంతకంటెను వింత, వేలకొలది సంవత్సరముల క్రిందటనే ఈవిజ్ఞానసత్య రహస్యమును వేదమంత్రద్రష్టలుగ్రహించి, దేవతలలో సరస్వతీదేవి మేటియని నిరూపించుకొని స్తుతింపగల్గుట !

నాలుగువందల ఏండ్లక్రిందట కృష్ణదేవరాయల ఆస్థానమున మనుచరిత్రరచించి ఆంధ్రకవితాపితామహుడన ప్రసిద్ధిగడించిన అల్లసాని పెద్దన్న, వాణీహిరణ్యగర్భులను స్తుతించుచు వ్రాసిన పద్యమును ఇట నొకసారి స్మరింతము:

ఉ॥ "నాలుగుమోములన్ నిగమనాదము లుప్పతిలన్ ప్రచండవా
తూలహతిం జనించు రొదతోడ గుహావళినొప్పు మేరువుం
బోలె పయోజపీఠముని ముఖ్యులు గొల్వగ వాణిగూడి పే
రోలగమున్న ధాతవిభవోజ్జ్వలు చేయుత కృష్ణరాయునిన్"

బ్రహ్మదేవునికి నాలుగు ముఖములున్నవి. ఆనాలుగు ముఖములలో నాలుగు వేదములు కలవని మన దేశమున కవిసమయము ఉన్నది. ఆసమయమును పాటించుచు అల్లసాని పెద్దన్న మహాద్భుత భావనా శక్తిసహితమైన కవితా ప్రాగల్భ్యము గలవాడగుటచేత పై పద్యము రచించి వంద్యుడగుచున్నాడు. బ్రహ్మదేవుని నాల్గుముఖములనుండి వెలువడు నాలుగు వేదముల ఘోషయెట్లున్నదో పెద్దన్న ఇట్లు వివరించినాడు: ప్రచండవాతూలహతిచే జనించురొద గుహలనుండిల మేరు పర్వతంబు నురుడించుచున్నది. బ్రహ్మ ఇట్టి ఝూంకారనాదములో కూడుకొని, పద్మాసనముపై మునిముఖ్యులు సేవింప సరస్వతీ సహితుడై నిండుకొలువుండి, శ్రీకృష్ణదేవరాయలవారిని విభవోజ్జ్వలుని చేయుగాక యని కవిఆశీర్వచించినాడు. ఇక్కడి ముఖ్యవిశేషము 'రొద'. దేవతలకాశ్రయమగు మేరుపర్వత గుహలలో వాయుహతిచే జనించిన 'రొద' కానిండు; బ్రహ్మదేవుని నాలుగుముఖములనుండి వెలువడు వేదనినాద ఝూంకారముగానిండు; ఆప్రాంతమునుండి వెలువడు నొకానొక శబ్దవ్యాప్తి, పెద్దన్న కవితాభావాంబర వీధిని శ్రుతిగోచరమైనది.
ఈ ఝూంకారమును విజ్ఞానసత్యమని జాన్స్కి, షాప్లీదొరల పరిశోధనలు రుజువుచేసినవి.

ఇంతకంటెనొప్పు వింత వేదములోనే కలదు. అస్పష్టమైన ఒకానొక రొద — ఒకనొక ంకారము- జాన్స్కి, దొరకు వినబడినట్లే వేద ఋషికికూడ వినబడినది. ఆయంశమునుదెలుపు వేదమంత్రము నింతకు ముందొకసారి స్మరించితిమి. మరల నిటువ్రాయుచున్నాను :—

యద్వాంగ్వదంత్య విచేతనాని రాష్ట్రీ దేవానాం నిషసాదమంద్రా।
చతస్రఊర్జం దుదుహేపయాంసి క్వస్విదశ్యాః పరమంజగామ ॥

VIII - 89 - 10

ఈమంత్రద్రష్ట నేము డను ఋషి; ఈమంత్రాధిదేవత వా[illegible] మంత్రార్థమిది — మనకు సంతోషవికారిణియు, దేవతల రాణియునైన వాగ్దేవి సుఖాధిష్ఠితయై ఎవ్వరికిని ఎఱుకపడని అస్పష్టనాదము గావించినది; బోధపడనిపలుకులు పలికినది; అర్థముగాని శబ్దము లుచ్చరించినది; స్వర్గము నలుదిశలవారికి పయోలాభముతో అమిత జవసత్త్వలాభము కలిగినది. మహామహిమగల ఆదేవి ఇపుడేదీ? ఎటు పోయినదో? ఎట్లంతర్హితురాలైనదో?

ఈమంత్రము సరిగా అర్థముచేసికొనుటకు, ఆంధ్రకవితాపితామహుని శ్రుతి గోచరమైన 'రొద' యు, జాస్సికిదొరకు వినవచ్చిన ఝూంకారమును తోడ్పడగలవు. ప్రకృతిలో కొన్నివస్తువులకుగల పరస్పర సంబంధమునుగూర్చి జిజ్ఞాసచేయుకొలది మన విస్మయము మధికమగుచుండును. వెండిఅరకుతో పూతపెట్టబడిన గాజుపలక మీద వెలుగు ఏమాత్రము ప్రసరించినను ఆయరకు చివికి శిథిలమగును. దానిరచనలో భేదములేర్పడి ఎంతోవింతగా మారిపోవును. ఆమార్పుల నాధారముచేసికొని నేడు ఫొటోగ్రాఫులు తీయుచున్నారు. ఈ యుక్తిచే అసలునకు సరియైన ప్రతిబింబము లేర్పడుచున్నవి. భూమిమీది వాతావరణములో నాలుగైదుమైళ్ళ యెత్తుగల దూరములో నీలమేఘము లావరించు నపుడాదృశ్యము నెమిళ్ళానందముతో నృత్యముచేయుచున్నవి. రెండులక్షల నలుబదివేల మైళ్ళదూరముననున్న చంద్రుని కిరణములు తగులగానే కలవపూలు వికసించుచున్నవి. మనకు తొమ్మిదికోట్ల ఇరువదిలక్షల మైళ్ళదూరమునందున్న సూర్యునికిరణములు సోకినంతనే పద్మములు వికసించుచున్నవి. వెలుగుకిరణములును, విద్యుత్తరంగములును దూరమును లక్ష్యము చేయవు. ఒక సెకెండుకాలములో నవి లక్షయెనుబదియారువేల మున్నూటఇరువదియైదుమైళ్ళు గడిచిపోగలవు. మనభూగోళపుచుట్టుకొలత సుమారు ఇరువదియైదువేల మైళ్ళు. కాబట్టి ఒక సెకెండుకాలములో వెలుగు కిరణములును, విద్యుత్తరంగములును, భూగోళమును ఏడుసార్లకుపైగా ప్రదక్షిణము చేసిరాగలవు. అనుకూలపరిస్థితు లమరినపుడు అవి మన

వశము కాగలవు. వీణామండలమునుండి వెడలి, అస్పష్ట నినాదముతో ఝూంకారరూపమున జాన్స్కీద్వార చెవులబడిన విద్యుత్తరంగాళి, వాగ్దేవతాధ్యానపరుడై, వాగ్దేవతా పూజాతత్పరుడైన నేమఋషి యజ్ఞశాలలో పలుకులవెలది సరస్వతి అర్థముగాని శబ్దోచ్చారణతో, బోధపడని పలుకులు పలికి అస్పష్టమంజులనాదము గావించుటలో నాశ్చర్యమేమి ?

అట్లే, వాగ్దేవీ "కృపాపాత్రుడై, 'విద్వత్సంస్తవనీయ భవ్య కవితావేశుడై', 'పయోజపీఠి మునిముఖ్యులు గొల్వగ వాణిగూడి పేరోలగమున్న సరసిజగర్భ ధ్యానపరాయణుడైన ఆంధ్ర కవితా పితామహుడు, భావాంబరవీధి న్విహారించునపుడు, ఉడువీధిని మెఱయు వీణామండలమునుండి వెడలిన విద్యుత్తరంగాళి గూఢ ఘోషమును, నా మహనీయుని కర్ణగోచర మయ్యె ననుటకు మన మేమాత్రమును సంశయింప పనిలేదు.

ఈనిర్ణయమును బలపఱచు మఱొక విశేషవిషయము భారతము నందే కలదు. ధర్మరాజు తీర్థయాత్రలు సేవించుచు కళింగ దేశమున వైతరిణీనదిలో స్నానముచేసిన ఘట్టము చూతము.

“కృష్ణాసహితంబుగా ధర్మతనయుండనుజ సహితుండై వైతరణీ స్నానంబుజేసి రోమశుంజూచి మునీంద్రా నాకు భవత్ప్రసాదంబున నఖిలలోకంబులుం గనంబడియె వైభావనుల వేదాధ్యయనశబ్దంబులు వినంబడియె ననిన విస్మితుండై రోమశుండు వైభావనుల నివాసం బిందులకు ముప్పదివేల యోజనంబులు గలదు. వారల యధ్యయన శబ్దంబులు వింటివి నీవు” దివ్యపురుషుండ వంచు నరిగి.........

కాబట్టి ఈచర్చవలన తేలినముఖ్య సారాంశ మేమనగా — వేదములందును, పురాణములందును ప్రశంసింపబడిన బ్రహ్మ, సరస్వతి, విష్ణు భగవానుడు మొదలగు దేవతలు పూర్వకాలపు మునీశ్వరులవలన కేవలము కల్పింపబడినవారు కారు. స్వర్గలోకమున, నక్షత్రరూపమున మెఱయుచు, వారుమనకు దర్శనమిచ్చుచున్నారు. విశ్వమునకు ఒక రాజధాని (Capital) కలదు. వీణా, విష్ణుమండలములుగల పరమపద మే

విశ్వమునకు రాజధాని. సృష్టివ్యవహారమును, విశ్వతంత్రమును ఆపరమ పదమునుండియే నడుపబడుచున్నవి. విశ్వమునకంతకును విద్యుత్తరంగ సంజ్ఞామూలకమైన శబ్దవ్యాపన స్థానము (Celestial Broadcasting Station) ఆపరమపదమునందే ప్రతిష్ఠింప బడియున్నది. మనము నివసించుచున్న భూలోకమునకును, మనకు సమస్తమును ప్రసాదించి యేలుచున్న సూర్యదేవునకును, సూర్యగోళమును పరివేష్టించి చుట్టు తిరుగుచున్న బుధ, గురు, కుజ, శుక్ర, శనైశ్చరాది గ్రహములకును, గమ్యస్థానము, విశ్వగోళములు తుదకు చేరుకోవలసిన ప్రాప్తిస్థానము - వీణా-విష్ణుమండల పరమపదమే. కాబట్టి వేదములందును, పురాణ ములందును, సంహితాభ్యాసుడును, నానాపురాణ విజ్ఞాననిరతుడునైన నన్నయభట్టారకుడు రచించిన తెనుగుభారతమునందును వాణీహిరణ్య గర్భులను, విష్ణుభగవానుని, ప్రశంసించుచు వ్రాసిన స్తుతివాక్యము లును,పద్యములును, వైజ్ఞానికముగా నేడు ధ్రువపడుచున్నవి. విశేషార్థ సహితములై యున్నవి. అవియన్నియు శుద్ధసత్యములు; కావున ఆరచనలకు ఐహికముగాను ఆముష్మికముగాను, విశేషప్రయోజన మున్నదని చక్కగా తెలిసికొని, దృఢముగా మనస్సున నాటించుకొని అందు కనుగుణ్యముగా జీవితవిధానము మనము నిత్యము నడుపుకో వలసిన యవసరమెంతైన గలదు.

మనము ప్రారంభించినపద్యము - "భూసతికిన్ దివంబునకు" నను పద్యార్థవివరణము ఇంకను మిగిలియున్నది. దానింబూర్తి చేయుదము.

ద్యావాపృథివీ దంపతులకు శరత్ సమాగమమైనది - ఈసమా గమము సకలప్రమోదకరముగా విలసిల్లినది. ఎట్లు?

నక్షత్రమండలమున, ప్రసన్నరాలైన సరస్వతీదేవితోకూడి, మిక్కిలి శోభించుచు, నా వాణీహిరణ్యగర్భదంపతులకు వాహనమైన రాజహంసపై పత్నీసహితుడై యధిష్ఠించి వెడలునపుడు, ఆహంస గతివలెనే అతిరమణీయమై, బ్రహ్మయానమువలెనే సకలప్రమోద కరమై విలసిల్లుచున్నది.

ఇక్కడి దంపతులశోభ ఏవిధముగా అతిశయించి కాంతిమంతమగు

చున్నదో ఆ తేజో విశేషములను లెస్సగా గ్రహించుటకు మనమీ దిగువవ్రాసిన వివరములను గమనింపవలసి యున్నది.

బ్రహ్మ తెలుపు, సరస్వతి 'సర్వశుక్ల ! సర్వశుక్లా సరస్వతీ' అని దంతిమహాకవి చక్కగా తెలిపియున్నాడు. ప్రాచీన సంప్రదాయాను సారముగా, భారతీయులైన కవులందరును సరసర్వతీ స్తవము చేసి పిమ్మట కావ్యరచన కుపక్రమింతురు. నన్నయభట్టారకుడు, ఆదిపర్వా రంభమున (ఆది 1 - 21) తరలపద్యములో "హారిహారాజగజాన నార్కమడాస్య మాతృ సరస్వతీ" అని సరస్వతిని స్మరించి కావ్య రచన కుపక్రమించెను. తెనుగుకవులలో భక్తాగ్రగణ్యుడు, బమ్మెర పోతరాజు. నిర్మలధావళ్య శోభితయగు భారతీదేవిని, ఈక్రింది పద్య ములో తనివిదీర వర్ణించి ధన్యుడైనాడు. ఒకానొక ప్రయోజన మాశించి నే నాపద్యము నిటవ్రాసి, అర్థముకూడ వ్రాయుచున్నాను.

"ఉ॥ శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హారతుషార ఫేనరజతాచల కాశఫణీశ కుందమం
దార సితాపయోధి సితతామరసామర వాహినీశుభా
కారతనొప్పు నిన్నుమదిగాననగ నెన్నడుగల్గు భారతీ?"

ఈ పద్యమునందు పోతరాజుగారు ఖగోళభూగోళ, అంతరిక్షము ములందు, నిర్మలధావళ్య శోభితములని ప్రశంసింపబడు నీక్రింది వస్తు జాలములతో శారదాదేవి సర్వశుక్లత్వమును ఉపమించి యున్నాడు.

ఖగోళమున — శుభ్రజ్యోత్స్నా విరాజితుడు చంద్రుడు, ధవళ కాంతితో శోభించు పాలవెల్లి.

అంతరిక్షమున — శరత్కాలమేఘము (నన్నయభట్టు నలోపాఖ్యా నమునందు హంసలగుంపును శారదాభ్ర శకలచయముతో నుపమించియున్నాడు)

పుష్పములు — మల్లె, కుందము, తెల్లతామర, తెల్లమందారము.

ఇతరవస్తువులు — శుద్ధస్ఫటికము, ఘనసారమను శుద్ధిచేసిన కర్పూరము, చందనము, తెల్లపట్టునుబోలు తెల్లు, వెండికొండ, హంసము, హిమము, నురుగు, తెల్లత్రాచు, తెల్లసంద్రము.

పై విధముగా నొక పట్టికను వ్రాసి, తెల్లనివస్తుజాలమును స్మరించు కొనుటలో చక్కని ప్రయోజనమున్నది. కేవలమధోదృష్టితో కాలము గడుపనెంచువారికి భారతాది గ్రంథములు సరిగా అర్థముకావు. ఆయర్థగ్రహణమునకు ఊర్ధ్వదృష్టి కొంత అవసరము. వీనినెల్ల దలంచు కొని ఖగోళ వీణామండల ప్రాంతములను బాగుగా పరికించి చూచి నపుడే ఆమండలముయొక్క విశిష్టతను, నన్నయ్యభట్టారకుని జ్యోతి ర్విద్యా విశేషములను, కవితాసారస్యమును మనము చక్కగా అవ గాహనము చేసికొనగలము. శరదృతు ప్రారంభదినములలో సూర్యు డస్త మించినపిదప తూర్పుటాకాశమున మనదృష్టిని ముందుగా నాకర్షించు నది సాంద్రధవళ రుచులతో వెలయు పాలసముద్రము. ఆక్షీరోద మధ్యమున వెండికొండవలె మెఱయు హంసము. జ్యోతిశ్శాస్త్రదృష్టితో నా హంసను చక్కగా పరిశీలనచేసిన ఆంగ్ల కవిసత్తముఁ డొకడు ఆ రాయంచ నిట్లువర్ణించినాడు – "రజితమూర్తీ! రాజహంసమా! రమ్యక్షీర వాహినీమధ్యమున విభ్రాజమానములగు నష్టోత్తరశతనక్షత్ర సమూహముతో కూడుకొని, శృంగారదేవతవలె శోభిల్లు నిన్ను ప్రశం సింపక ఎవరు మానగలరు?" ఇట్లు తేజోమూర్తియై స్తుతిపాత్ర మయిన యీ హంసకు ఉత్తరభాగమున వెన్నముద్దవంటి తెలుపుతో కూడి మేటివజ్రమువలె దేదీప్యమానముగా తేజరిల్లు అభిజిన్న (Vega) క్షత్రరాజముగలదు.

ఈపరిసరములమధ్య వీణవాణి, సరస్వతి అక్షరములా సర్వశుక్లయై మెఱయుచుండును. శరదృతువులో నాశ్వయుజ కార్తిక మాసములలో నక్షత్రలోకమున నీశారదామూర్తి దర్శనము చేసినవారు ధన్యులు. అప్పటికించుమించుగా వర్షాకాలము సమాప్తియగును. వాతావరణ మున నీటియావిరి మెండుకొని యుండును. ఆహేతువుచేత నాదినము లలో చంద్రకాంతి అతిశయించి అపూర్వశోభతో మెఱయుచుండును.

బ్రహ్మ తెలుపు; బ్రహ్మరాణి, సరస్వతి అంతకంటె తెలుపు; వారికి వాహనమైన హంసకూడ వెండికొండవలె తెలుపు. వాహనమైన తెలిపిట్ట ధావళ్యము మూలముగా, బ్రహ్మసరస్వతీదంపతుల దాంపత్యశోభ

మిక్కిలి అతిశయించినది. అదే ప్రకారముగా భూమి, ఆకాశదంపతులు కలియుచోట, తేజోధికుడైన శరచ్చంద్రుడు దివ్యజ్యోత్స్న బఱపుచు, హంసము వాణీహిరణ్యగర్భుల దాంపత్యశోభ నతిశయింపచేసినట్లే, ద్యావాపృథివీ దాంపత్యశోభను విశేషముగా నతిశయింప జేయుచున్నాడు.

నక్షత్రోదయ కాలవిదుఁడును, జ్యోతిర్విజ్ఞానవిలసితుడైన నన్నయభట్టు మూలభారతమున లేకున్నను వేదములను, పురాణములను, ఉపనిషత్తులనుదోర్చి దివ్యాంశముల సంగ్రహించి, స్వీయజ్యోతిర్విజ్ఞానముతో మేళవించి స్వతంత్రముగా నీపద్యరత్నమున రచించి, తెనుగుప్రజలకిచ్చి, శాశ్వత యశోదేహముతో మెఱయుచున్నాడు. కోహినూర్, కులినాన్ వజ్రములకంటె ఈపద్యరత్నమే ప్రశస్తమైనది. అంతకంటె ఎక్కువ విలువగలదని నాయభిప్రాయము.

ఈపద్యగర్భితములైన మహత్తరభావములను స్వతంత్రముగా విమర్శించుచు గేటి (Goethe) యను జర్మన్ విమర్శకాగ్రేసరుఁడును, విశ్వకవి రవీంద్రనాధుఁడును ప్రకటించిన విషయము లీ పద్యరత్న ప్రాశస్త్యమును ఇంకను అతిశయింపచేసినవని ఆనందించగలము.

హంసవాహనారూఢులైన బ్రహ్మ సరస్వతీ దంపతుల చిత్రమిట చూడనగును. ఈచిత్రమువలన మనమీక్రింది యంశములను గ్రహింపగలము :—

1. హంస – తేజోమయమైనది. శాంతమునకు, నిదానమునకు, అహింసకు ఆకరమైనది. నీరక్షీర విభాగముతో యుక్తాయుక్త విచక్షణ జ్ఞానమును ప్రదర్శించుచున్నది. ఈగ్రంథము తొలిచిత్రములో, నక్షత్రరూపి హంసదేహములో శిలువ (cross) ఆకారముగల చుక్కలను చూచితిమి. త్యాగియు, పరమదయాపరుడును నగు యేసుక్రీస్తు (Jesus Christ) మహాశయుడు ఇటీవల శిలువ ధరించి మోసినట్లే శాంతమూర్తి, ఖగోళహంసముకూడ శిలువ మోయుచున్నదా ?

ఖగోళహంస శరత్కాలారంభమున అక్టోబరునెల తొలిరోజులలో సూర్యాస్తమైనవెనుక తూర్పుటాకాశమున నుదయ మగుచున్నది. జనవరి మాసాంతమున పడమట నస్తమించుచున్నది.

శాంతదూతయగు మహాత్మాగాంధి అక్టోబరునెల రెండవతేదీని జన్మించినాడు; జనవరి 30 వ తేదీని అస్తమించి, శాంతిస్థానము నలంకరిగినాడు. శాంతిదూత మహాత్మాగాంధికిని; ఖగోళమున మెఱయు హంసకును ఏమైనసంబంధము కలదా? అనునది నాదగు నొక భావము. విమర్శనార్హము.

2. సరస్వతి. భావాంబరవీథి విశ్రుతవిహారిణి. సంగీతసాహిత్యాది సకలశాస్త్రరూపిణి. సమస్తవిద్యాధిదేవత. ఈమె యనుగ్రహభాగ్యము బడసినవారే కావ్యసృష్టి చేయగలరు.

3. బ్రహ్మ - పద్మాసనుడు - జగములు నిర్మించునేర్పరి. సృష్టికర్త. బ్రహ్మకాసనమైన పద్మమునందు వైజ్ఞానిక విశిష్టతకలదు. గ్రహసహితమైనసూర్యకుటుంబముల నిర్మితికిది నమూనా కిది మేలుబంతి. (Model for Planetary Nebulae) కాబట్టి ఇతడు సృష్టికర్త యనుటకు వైజ్ఞానికమైన (Scientific Basis) ఉపపత్తి కలదు. బ్రహ్మ సృష్టికర్త; అతనిపత్ని కావ్యసృష్టికర్త. అతనివాహనము యుక్తాయుక్తవివేచన శీలముగల్గి, శాంతిదూతయైన హంస. ఇట్టి విశిష్టశక్తులు గల మువ్వురు నీరంగమున నిట్లు సమావేశముచేయుచు కూర్చిన పద్యములో నెంత విశిష్టత కలదో? ఇట్లు హంసవాహనారూఢులైన బ్రహ్మ సరస్వతీ దంపతుల కుపమేయమైన ద్యావాపృథివీదంపతుల సమాగము నందు విశ్వస్తుత్యులైన మహాపురుషులు కనిపెట్టిన గొప్పవిశేషములను తెలిసికొనుట మనకవశ్య కర్తవ్యము, కావున వానినిట వ్రాయుచున్నాను.

గేటి (Goethe). ఇతడు జెర్మనీదేశపు కవిరాజు. గొప్పవిమర్శకుడు; మహావిద్వాంసుడు. కాళిదాసు రచించిన అభిజ్ఞాన శాకుంతల నాటకము చదివి, మిక్కిలి సంతోషించి, ఆ సంతోషము పట్టజాలక అతడు ఉబ్బి, గంతులువైచుచు నాట్యము చేసెనట! ద్యావాపృథివీ దంపతుల దాంపత్యముతో శకుంతల కథ నుపమించుచు, నతి డిట్లు ప్రశంసించినాడు:—

"నూతనవత్సర వసంతయౌవన వికాసములతో, శరద్వార్ధక్య ఫలములంజేర్చి, తుష్టినిచ్చి, పుష్టిపెంచి, ఆత్మనత్యంతమును రంజిలపజేయగల యావద్విశేషములను ఒక్కమాటలో చెప్పుమందురా? ద్యావాపృథివీ దాంపత్యమును ఒక్కమాటలో నిమిడ్చి చెప్పనా?

"శకుంతల". నేను చెప్పతగినది, చెప్పవలసినది యావత్తును ఆపవిత్ర నామములో నిమిడిపోయినది."

ద్యావాపృథివీ దాంపత్యమునుగూర్చియు, శకుంతలంగూర్చియు, గేటీ చేసిన విమర్శనకింకను వన్నె బెట్టుచు, విశ్వకవిచంద్రుడు ఇట్లు వ్యాఖ్యానము చేసెను. శాకుంతలములో వికాసవిజృంభణముల వింత చరిత్ర ద్యోతకము లగుచున్నవి. పుష్ప మెట్లు ఫలభరితమగునో వ్యక్తిత్వము నదిలో విలీన మగుచున్నదో, భూమి యెట్లు స్వర్గముగా పరిణమించునో, స్థూలద్రవ్యము ఆధ్యాత్మిక శక్తులంబడసి, దేవతాప్రభావ సంపన్నమై అదృశ్యముకాగలదో, ఆ క్రమమంతయు శకుంతలచరిత్రము చక్కగా విశదముచేయుచున్నది. ఇదిభూమి, ఇక్కడనుండి స్వర్గమని సరిహద్దు నిర్ణయింపరాకుండ, స్వతస్సిద్ధముగా భూమి స్వర్గమగుచున్నది. భౌతికము, భౌమికము నైన సౌందర్యము మహోన్నతమై, స్వర్లోకమున, నిత్యము నాశరహితమునైన నైతికసౌందర్యముగా పరిణము ప్రకాశించుచున్నది. స్వేచ్ఛానుసారమైన నిర్బంధమందు పొందు పొసగియున్నది. పూజ్యమగు నీనైతిక సౌందర్యములోని సాటిలేని శృంగారమున్నది; మహోన్నతమైన వినయమున్నది; ప్రశంసాపాత్రమైన సద్భావ మున్నది; ఈసౌందర్యమునకు విశ్వవ్యాప్తిగల ఎన్నడును పసచెడక, నిరంతరము నుత్తేజముగలిగి శాశ్వతవికాసముతో భాసిలగలది.

ద్యావాపృథివీ దంపతీ సమావేశమును ప్రశంసించు వేదమంత్రము (VII - 97 - 1) ను ఈసరికే ఉటంకించితిని. ఆ మంత్రస్మరణము పఠనముతో నీ చర్చ ముగింతము. మీాద వివరింపబడిన భావములకీ మంత్రము వన్నె తేగలదు.

"యజ్ఞేదివోనృషదనే పృథివ్యా
నరోయత్ర దేవయవో మదంతి" (ఋ VII - 97 - 1)

ఈమంత్రద్రష్ట వశిష్ఠమహాముని; మంత్రాధిదేవతలు, ఇంద్ర, బృహస్పతి, బ్రాహ్మణస్పతులు : ఈమంత్రార్థ మిది :—

భూమ్యాకాశములెచ్చట నేకమగుచున్నవో, మానవులెచట సమావేశమయి సంతోషముతో ప్రేమాభిమానములు గలిగి దేవతల నెచ్చట పూజింతురో, అచ్చటికే దేవతాముఖ్యులేతెంచి ( అభీష్టవరము లొసగి మేలుచేయుదురు ).

'మానవులు విధాయకముగా చేయవలసినపనులను ఎక్కడ త్రికరణ శుద్ధిగా నిర్వర్తింతురో, స్వర్గమక్కడనేకలదు. దేవతలన్వేషించుచు మానవులు పోనక్కరలేదు; మానవులకడకు దేవతలేవచ్చి భూతలమునే స్వర్గము చేయగలరు' అని పై మంత్రభావము. ద్యావాపృథివీ దాంపత్యోపమాన ప్రశంసతో ప్రారంభించి, ఈ పద్యరచన మూలముగా, గుప్తముగానున్న పెక్కు వేదవిజ్ఞానవిశేషములను ప్రకాశింప జేసి నన్నయ్యభట్టారకుడు మనల ధన్యులజేసి తాను ధన్యుడైనాడు.

## నక్షత్ర విజ్ఞాన విషయమున పాశ్చాత్య సంప్రదాయము

ఆకాశమున కనబడు చుక్కలన్నియు కొన్ని గుంపులుగా విభజింప బడినవి. ఒకొక్కగుంపులోని చుక్కలను వేరువేరుగా గుఱుతించుటకు, అందలిచుక్కల కాంతి సంపదననుసరించి, గ్రీకుభాషలోగల వర్ణసమామ్నాయక్రమమున నక్షత్రసంజ్ఞవిడి వ్యవహరించు చుండిరి. గ్రీకు భాషలోని వర్ణసమామ్నాయమునందలి అక్షరక్రమ మీక్రింద వ్రాయబడినది.

గ్రీకుభాషలోని అక్షరములసంఖ్య ఇరువదినాలుగు. వానివరుస క్రమమిది :—

1. ఆల్ఫా 2. బీటా 3. గామ్మా 4. డెల్టా 5. ఎప్సిలాన్ 6. జీటా Z ఈటా ) 7. ఈటా 8. తీటా 9. అయోటా 10 కప్పా 11 లాంబ్డా. 12 మ్యూ 13 న్యూ 14 క్సై 15 ఒమిక్రాన్ 16 పై 17 రో 18 సిగ్మా 19 టా 20 ఉప్సిలాన్ 21 ఫై ( F ఐ ) 22 చై 23 ప్సై 24 ఒమీగా. ఒకొక్క గుంపుచుక్కలలో, కాంతిసంపదనుబట్టి మొదటిదనదగిన చుక్కను ఆల్ఫా అక్షరసంజ్ఞచేతను, రెండవచుక్కను బీటా అక్షరసంజ్ఞ చేతను, మూడవచుక్కను గామ్మాఅక్షర సంజ్ఞచేతను తెలియచేయు చుండిరి. ఇట్లేకాంతిసంపద ననుసరించి వరుసగా నాలుగు, ఐదు, ఆరు ...... ఇరువదినాలుగు వఱకు చుక్కలను డెల్టా, ఎప్సిలాన్, జీటా ... ఒమీగావఱకు గుర్తించుచువచ్చిరి. ఆ గుంపులో తేజోవిషయమున నిరువదినాలుగవచుక్కను ఒమీగా అనిరి. అక్షరములు సరిపడినపిమ్మట అంకెలనుచేర్చి చుక్కలను చూచుచుండిరి. Famsteed, Struve, మొదలగు పాశ్చాత్యజ్యోతిర్విదులు తయారుచేసిన చుక్కలపట్టీలలో సంఖ్యగూడ తెలియజేయుచుందురు.

గ్రహమార్గమైన క్రాంతివృత్తమునందుగల

## 27 నక్షత్రముల వివరము

| భారతీయ నామములు సంస్కృతము | తెనుగు పేర్లు | అధిదేవత | లాటిన్ ఇంగ్లీషు పేర్లు — గుఱుతులు |
|---|---|---|---|
| అశ్వని | అశ్వని | అశ్వినులు | ఆల్ఫా, బీటా, గామా Aries. |
| భరణి | భరణి | యముడు | 28, 29 · 41 Taurus |
| కృత్తిక — 1 } కృత్తిక — 3 } | పిల్లలకోడి | అగ్ని | Pleiades; ఈటా Taurus17, 17, 20, 23–27–28 |
| రోహిణి | రోహిణి | ప్రజాపతి | Aldebaran ఆల్ఫాటారస్ |
| మృగశిర— 2 మృగశిర— 2 | మృగశిర లేడిబుజ్జ | సోముడు } చంద్రుడు. } | లాంబ్డా ఫై.1 ఫై. 2 Taurus, |
| ఆర్ద్ర | అరుద్ర | రుద్రుడు | Betelgeaux. = ఆల్ఫా Orion |
| పునర్వసు— 3 పునర్వసు 1 | పునర్వసు | అదితి | Castory Pollux + Procyon; |
| పుష్యమి (తిష్య) } | పుష్యమి | బృహస్పతి | గామా, డెల్టా, తీటా of cancer |
| ఆశ్లేష | ఆశ్లేష | సర్పదేవత | Hydra లో డెల్టా, ఎప్సిలాన్, ఈటా, రో, జీటాలు |
| మఘ | మఘ | పితరులు | Regulus = ఆల్ఫా Leo |

| | | | |
|---|---|---|---|
| పూర్వఫల్గుణి<br>ఉత్తరఫల్గుణి—1<br>ఉత్తర ఫల్గుణి 3 | పుబ్బ<br>ఉత్తర | అర్యముడు<br>భగుడు | డెల్టా, థీటా Lio.<br>Denebcla = థీటా Leo + 93 Leo |
| హస్త | హస్త | సవిత | డెల్టా, గామా, ఈటా Virgo |
| చిత్ర — 2 | చిత్త, ముత్తెపు | త్వష్ట | Spica, = ఆల్ఫా Virgo |
| చిత్ర — 2 | సవతుచుక్క | | |
| స్వాతి — | స్వాతి | వాయు. | Areturus = ఆల్ఫా Bootes (భూతేశ) |
| విశాఖ — 3<br>విశాఖ — 1 | విశాఖ | ఇంద్రాగ్ని | Libra లో ఆల్ఫా. బీటా, క్సై, గామా, కప్పాలు, |
| అనూరాధ | అనూరాధ | మిత్రుడు | బీటా, డెల్టా ,పై Scorpio. |
| జ్యేష్ఠ | జ్యేష్ఠ | | |
| | ఇంద్రుడు | ఇంద్రుడు | Antares = ఆల్ఫా, Scorpio. |
| మూల | మూల | నిరృతి — పితృలు | వృశ్చికపుతోకచుక్కలు. |
| పూర్వాషాఢ | పూర్వాషాఢ | అప | డెల్టా, ఎప్సిలాన్ |
| ఉత్తరాషాఢ — 1 | ఉత్తరాషాఢ | విశ్వదేవతలు | Sagittarius జీటా, ఒమిక్రాన్ Sagittarius |
| ఉత్తరాషాఢ — 3 | | | |
| శ్రవణము | శ్రవణము | విష్ణు | Altair, ఆల్ఫా, Aquila |
| ధనిష్ఠ — 2 | ధనిష్ఠ | వసువులు. | Delphinus |
| (శ్రవిష్ఠ) | | | |
| ధనిష్ఠ —2 | | | |
| శతభిషమ్ | శతభిషమ్ | వరుణుడు | లాంబ్డా Aquarius |
| పూర్వాభాద్ర — 3 | పూర్వాభాద్ర | అజైకపాద్ | ఆల్ఫా, బీటా * Pegasus |

| | | | | |
|---|---|---|---|---|
| మీనము | పూర్వాభాద్ర | I | | |
| | ఉత్తరాభాద్ర | ఉత్తరాభాద్ర | అహిర్బుధ్న్య | గామా Pegasus అల్ఫా Andromeda |
| | (ప్రోషపదా నక్షత్రములు) | ఇవే పేద్వఘూశ్వ నక్షత్రములు Pegasus | | |
| | రేవతి | రేవతి | పూషుడు | జీటా Piscum |

* అశ్వనీ నక్షత్రములకు అధిదేవతలైన అశ్వనిదేవతలు ఉపుభక్తుడు, అశ్రితుడునైన 'పేదు' అను రాజర్షికి ఒక అఘూశ్వమునిచ్చిరి. అగుఱ్ఱమునకు డేగరెక్కలవంటి రెక్కలు, లేడికాళ్ళవంటికాళ్ళు గలవు. అగుఱ్ఱము కుంభరాశిజలమును తనివిదీరత్రాగి పెమ్మట దుష్టసర్పసంహారము గావించెను. ఈకథ గ్రీకులు వేదమునుండి గైకొనిరి. పేద్వఘూశ్వము 'పెగసస్' గుఱ్ఱమైనది. 'బెల్లరిఫోన్' అనుపేరుగలయోధునికి వాహనమై దేవతాకొలనిలో దివ్యజలములద్రావి, దుష్టసర్పముల జంపినది. జ్యోతిశ్శాస్త్రరీత్యా, సర్పదైవత్యమైన అశ్లేషానక్షత్రములకు పేద్వఘూశ్వము ప్రతిస్పర్థి. బాద్రపదచుక్కలు ఉదయించు వేళకు అశ్లేష చుక్కలస్తమించును. కాపున నాయశ్వమునకును, అశ్లేషసర్పమునకును శత్రుత్వమారోపింపబడెను. గ్రీకులు ఈకథను యథాతథముగా ఋగ్వేదమునుండి గైకొనిరి.

క్రాంతివృత్త సంబంధముగల ద్వాదశరాసులను, ఇరువదేడు నక్షత్రములనేగాక వేదకాలపుఋషులు పెక్కు-లితరనక్షత్రములను చక్కగా నెఱిగియుండిరి. అనక్షత్రములు వేదములందును భారతమునందును చమత్కారముగా వివరింపబడినవి. మనమానక్షత్రముల పరిచయము కలిగించుకొనుట మిక్కిలి యవసరము. మనము వానిని చక్కగా గుర్తింపగలిగినపుడే ఖగోళభూగోళ వ్యాప్తమైన భారతకథ మనకు ప్రత్యక్షముగాను, సులభముగాను బోధపడును. నన్నయభట్టారకుని జ్యోతిశ్శాస్త్ర వివేకము అద్భుతమైనది. సంస్కృతమూలమున లోపించిన వివరములను పెక్కింటిని తడవి, తెచ్చి తెనుగున గూర్చిపెట్టి తెనుగువారికందిచ్చి, అతడు కృతకృత్యుడైనాడు. ఈ వివరణములను మనము బాగుగా నవగాహనము చేసికొనుటకు ప్రాక్ప్రతీచీ సమన్వయసహితమైన నక్షత్రనిరూపణా విజ్ఞానమవసరము. అందుకొఱకే ఈదిగువపట్టిక తయారుచేసి పాఠకులకందిచ్చుచున్నాను. కొంచెము ఓపికచేసి వీనినిచదివి, ఇహలోకమునందేగాక జ్యోతిర్లోకమున నక్షత్రాక్షరములతో లిఖింపబడిన భారతకథను సినీమాలోవలెనేచూచి, పాఠకులు తప్పక ఆనందము నొందగలరు. తేజోరూపములైన నక్షత్రములతో పంచమవేదశబ్ద శ్రుతిని మేళవించినపుడు ఖగోళమున చూడనగు 'టాకీ' మిక్కిలి యద్భుతముగా నుండునని విన్నవించుచున్నాను.

# ఉత్తరదిశానక్షత్ర వివరము

| | భారతీయ నామము | పాశ్చాత్య నామము | గమనించవలసిన విశేష విషయములు |
|---|---|---|---|
| 1 | అప్సరస మండలము (కాశ్యపీయము.) | Cassiopea's Chair | కాశ్యపీయ—కశ్యప = ప్రాధాకశ్యపునకు ప్రాధాదేవివలన రంభా, మేనక, తిలోత్తమాదులు జన్మించిరని, అది 65 – 50–51 శ్లోకములలో గలదు. * |
| 2. | అశ్వత్థామ. | Equules. (Horse) | |
| 3. | ఇంద్రమద<br>ఇంద్రప్రమద<br>ఇంద్రమృద | Andromeda | మదుడను రాక్షసుని పుట్టించి, ఇంద్రుని మదమణచి, అశ్వినుల సోమపీథుల చేసిన భార్గవ చ్యవనుని తల్లి; ఇంద్రమద హర్తమాత. |
| | | | సంస్కృతఋక్షశబ్ద విక్రృతి Ursa. |
| 4. | చ్యవన | Triangulum | తల్లిగర్భచ్యుతుడై చ్యవనుడైనాడు. |
| 5. | ఋక్షము (బృహత్) | Ursa Major | ఋక్షమనగా ఎలుగుబంటి; ప్రకాశించునది. |
| 6. | ఋక్షము (లఘు) | ,, Ursa Minor | |
| 7. | కల్పవృక్షము | Camelopardalis | ఈచుక్కలను 1624 సంవత్సరములో Bartschius అనువాడు గుర్తించి పేరు పెట్టు వరకు పాశ్చాత్యు లెఱుగరు. |
| 8. | గరుడి | Aquila | |

* కశ్యపునకు మేనక యిత్యాది అప్సరసలు సురభియను దానివలన పుట్టినట్లు ఆదిపర్వము 3 – 64 లో కలదు. ఎట్లయినను అప్సరసలు కశ్యపుని పుత్రికలే; కాబట్టి కాశ్యపీయులు.

| | | | |
|---|---|---|---|
| 9. | వజ్రాయుధము | Sagilta | |
| 10. | పారిజాత వృక్షము | Lacerta. (Lizard) | 1690 సంవత్సరములో హెల్వీలియస్ Helvilius అనువాడు గుర్తించువఱకు పాశ్చాత్యు లెఱుగరు. Lacerta అను లాటిన్‌మాటకు Lizard బల్లియని యర్థము. దేవపారిజాతము వీనికిబల్లివలె కనబడినది.<br>వేదములో దీనికి దధిక్రయని పేరుగలదు. ఇది యెట్లుపెగసెస్ అయ్యెనో పైని చూచితిమి. |
| 11. | శ్వేతఘోటము ఉచ్చైశ్శ్రవము | Pegasus | |
| 12. | భూతేశ | Bootes | |
| 13. | వసువులు (ఎనమండ్రు | Delphinus. | |
| 14. | విష్ణు — హరికులేశ | Hercules. | గ్రీకుల కీనక్షత్ర సమూహముపేరు తెలియదు, పిమ్మట రోమనులు ఈదేవునిపేర పట్టణము (Hercularoum) కటి పూజించిరి. అగ్నిపర్వతముపెట్టి లావాప్రవాహముచేత ఈపురి నశించెను. |
| 15. | విష్ణు దేవుని కిరీటము. | Corona Borealis | హిరణ్యాక్షుని గదదెబ్బకు విష్ణునిచెంపపగిలి కిరీటము కదిలినది. నక్షత్రవీధి నిశ్శేకసబడును. |
| | కచ్ఛప | | అరబ్బీలు తాంబేలందురు. |
| 16. | వీణామండలము. | Lyra | |
| 17. | వేణీమండలము | Coma Berinice. | ఇది మొదట పాశ్చాత్యులకు తెలియదు. క్రీ. శ. 300 లో ఇరటాస్థినీస్ అనువాడు ఈచుక్కలను గుర్తించి ఈపేరుపెట్టెను. ఇందునుగూర్చి పడమటిగాథ గలదు. ఈ క్రింద చూడనగును. * |

* టాలెమీయనురాజు శత్రువులపై దండువెడలెను. అతనిరాణి తనయిష్టదైవమునకు తనకేశజాలము నర్పింతుననియు, భర్తకు జయమనుగ్రహింపుమని వేడుకొనెను. భర్తకు జయముకలిగెను. వెంటనేమ్రొక్కుచెల్లించెను. రాణిసద్భావమునుగ్రహించినను అమె శిరోముండనము ప్రీతుడుగాక, రాజు, పురోహితునిబిలిపించి భార్యకేశములేవి యని ప్రశ్నించెను. సమయపూర్తిగల పురోహితుడు "ప్రభూ! దేవదేవుడు రాణిగారి కేశములను స్వర్గమునకు గొనిపోయె" నని నక్షత్రమండలమున నీచుక్కలను చూపెనందురు.

12

| | | | |
|---|---|---|---|
| | [ కన్య – ద్రౌపది చికుర జాలము. దుశ్శాసనకరా కృష్టవేణీభారము వేణీ సంహార నాటకమునకు మూలకారణము. ] | The Hair of Queen Berenice. | |
| 18. | శేషమండలము. [ బహువనపాదబాబ్ధి.... – జలధిశాయికి పాయక శయ్యయైన యహిపతి. అనంతుడు. ] | Serpeus + Oppiuchus | పడమటివా రీచుక్కలను అనవసరముగా రెండుగణములక్రింద విడదీసినారు ఇవన్నియు నొక్క శేషమండలములోనివే. రివరెండ్ జేమ్సుగాల్ దొరగారు తాము రచించిన "నక్షత్ర సూచి" యనుగ్రంథము 20 వ పుటలో ఈరెండును ఒక మండలములోనివే అనియు నంగీకరించిరి. మాండరుదొరగారి నక్షత్రగ్రంథముకూడ (8 వ పుటలో) పై రెండుగుంపులను కలగా పులగము చేసిరని విమర్శించిరి. |
| 19. | సారథి మండలము. | Auriga. | ఋగ్వేదములో నీమండలము "బ్రహ్మభవతి సారధిః" అని ప్రశంసింప బడినది. |
| 20. | హంస, రాజహంస, హంగ్స. | Cygnus | విష్ణుపాదమునుండి ఉరికిన గంగాప్రవాహముయొక్క సంక్షోభ ముడిపి ప్రశాంతము కలిగించుచున్నది; విష్ణుశయనస్థానమైన క్షీరసాగరపుపాలు, గంగాజలముతో కలియకుండ మధ్యనిలిచి ఖగోళమున నీరక్షీర విభాగము చేయుచున్నది. "హగ్ంస శ్శుచిషత్ వసురంతరిక్షసత్ ..." అను ప్రసిద్ధవేదమంత్రమునకు ఈహంసపరమైన అర్థముకూడ కలదని నావిన్నపము. |
| 21. | సరమ. * | Canes Venatici | 1690 సంవత్సరములో హెల్వీలియస్ ఈచుక్కలగుర్తించి కుక్కపేరుపెట్టెను. |

* పరమవేద ప్రసిద్ధమైన దేవశుని, Canes Venatici అనగా Grey hound. వేటకుక్క, జాగిలము అని అర్థము.

ఉత్తరదిశానక్షత్రములచర్చ ఇంతటితో చాలించి ఇంక దక్షిణదిశా నక్షత్రప్రశంస ప్రారంభింతము.

## దక్షిణనక్షత్ర ప్రశంస

ఉత్తరధ్రువ ప్రాంతములవారికిని, ఆసమీపమున దిగువగ నున్న యూరపుఖండ వాసులకును దక్షిణదిశను వెలుగు నక్షత్రములు చాలవఱకు కనపడవు. అగస్త్యనక్షత్రము కనబడుటే వారికరుదు. దక్షిణాపథ వాసులైన విద్వాంసులకు ఈచుక్కలు చాల బాగుగా కనబడును. కావునవారు వాని ననాదినుండి యెఱుగుదురు. నన్నయ భట్టారకుని కీ నక్షత్రనామములు కొట్టినపిండి. సంస్కృత భారతమున కానరాని చుక్కలగుంపుల వివరములను నన్నయభట్టు భారతకథతో చక్కగా పొందుపఱచి ప్రకాశింప జేసియున్నాడు. భారతీయ శ్రీ సౌభాగ్యములకు కన్నుకుట్టి యూరపియను వర్తక సంఘములచే ప్రేరేపింపబడి పాశ్చాత్యనక్షత్ర పరిశోధకులుకొందరు దక్షిణసముద్ర ముల మీద రెండుమూడు వందల సంవత్సరముల లోపు కాలములో నౌకాయానములు చేయుచు, దక్షిణ నక్షత్రముల గుంపులను వాని ఆకారములను చక్కగాగుర్తించి క్రొత్తగా నామకరణములు చేసిరి. వారిట్లు నవీనముగాపెట్టిన లాటిన్ పేర్లను, వాని ఇంగ్లీషు అర్థములును తైపారువేయగా, నూటికి తొంబదిపాళ్లు ఆపేరులు మన పూర్వులు ఏనాడో పెట్టిన పాత పేరులకు సరిపోయియుండుట అద్భుతావహము. 1604 సంవత్సరములో బేయరు (Bayer) అనువాడు ఈదిగువ వ్రాసిన పంన్రెండుగుంపులకు నామకరణము చేసెను. బార్ట్షియస్ (Bartsohius) అనువాడు 1624 లో రెండుగుంపులకు పేర్లుపెట్టెను. లాకెయల్ (La Caille) అనువాడు 1752 సంవత్సరములో పదునెనిమిది గుంపులకు పేళ్ళు పెట్టెను. నవీనముగా వీరుపెట్టిననామములు మనపూర్వుల నామ ములను గాథలను "తు - చ" తప్పకుండ ధ్రువపఱచుచుట మిక్కిలి యాశ్చర్యకరము.

| సంస్కృత నామము | లాటిన్ పేరు | ఇంగ్లీషుఅర్థము | విశేష విషయములు |
|---|---|---|---|
| 1. శ్వానము | Canis Major | Great Dog. | ఇదియు దీనివెనుకవచ్చు పూర్వశ్వానమును యముని కుక్కలు "శ్వానౌ" అని ఋగ్వేదము. |
| 2. పూర్వశ్వానము | Canis Minor | Lesser Dog | పూర్వశ్వాన శబ్దభవమైన ప్రోశ్యాను (Procyon) ఈచిన్నకుక్కకు పాశ్చాత్య నామము. |
| 3. అగ్నివేదిక : | Ara | Altar | ఇదే వేదోక్తమైన దక్షిణాగ్ని మండలము. |
| 4. అశ్వతరము. *1 | Centaurus | — — | అశ్వినీదేవత (త్రిపదనులు) ల మూడవస్థానము. కంచరగాడిద, గాడిద వీరి వాహనములు. వీరిఅంశను మాద్రికి నకుల సహదేవులు జనించిరి. కన్య ద్రౌపదికి వీరు 4–5 భర్తలు. |
| 5. వృకము | Lupus | Wolf. | తోడేలు. వార్తికమనుపక్షిని మ్రింగబోగా అశ్వినులు దీనినిపొడిచి వార్తికమును రక్షించిన విషయము పెక్కుసూక్తములలో ఋగ్వేదమున వర్ణింపబడియున్నది. |
| 6. వార్తికము *2. | Corvus | Crow. | వేదకాలమునాటి వార్తికము ఇటీవల పాశ్చాత్యులకు కాకిరూపమున కనబడినది. |
| 7. శింశుమారము * | Cetus | Whale | ఇది మొసలింబోలిన గొప్ప జలజంతువు. ఇంత పెద్ద చుక్కలగుంపు మరొకటి ఆకాశమునలేదు. భారతార్థములో నీఘోరజంతువు దుర్యోధనాది కౌరవబృందము. ఇది పాండవులకెప్పుడును ప్రతిస్పర్థి. |

*1 అశ్వినులకు గాడిద, లేక, కంచరగాడిద వాహనము. చూ : ఋగ్వేదము : I. 34–9 కదాయోగోవాజినో రాసభస్య ....

*2 I. 116–14 అస్నో వృకస్య వార్తికామభీకేయువంనరానా సత్యాముముక్తం.

* అశ్విని చుక్కలకు అశ్వినులు అధిదేవతలు. అశ్వినులకు, ఒకతట్టుకు రాశివృషభమును, రెండవ తట్టున శింశుమారచుక్కలును కనబడుచున్నవి. ఋగ్వేదము I-116–18 మంత్రద్రష్ట అశ్వినుల రథమునకు వృషభశింశుమారములను పూన్చినట్లు వర్ణించెను. "యువాంరథం వృషభశ్చ శింశుమారశ్చ యుక్తా ॥

| | | | | |
|---|---|---|---|---|
| 8 | శుకము (చిలుక, మన్మథుని వాహనము) | Corona Australis + Telescopium | Crown (Southern) + Telescope | ఇందు 'టెలిస్కోపు' పేరిటి చుక్కలను 'లాకెయిల్' 1752 లో గుర్తించెను. |
| 9. | ప్రహ్లాద | Apus | Bird of Paradise | స్వర్గవిహారి పుణ్యమూర్తియైన పక్షి అని లాటిన్, ఇంగ్లీషుమాటల కర్థము. |
| 10. | బలిచక్రవర్తి | Triangulium Australis | Southern Triangle | దక్షిణ త్రిభుజము : త్రిభువన సామ్రాజ్యపదవీచ్యుతుడై, త్రిభుజ రూపమున బలి మెఱయుచున్నాడు. |
| 11. | బాణాసురుడు | Indus + Micro-scopium | | ఇందలి 'మైక్రోస్కోపియమ్' చుక్కలు 'లాకెయిల్' 1752 లో గుర్తించి పట్టికలో జేర్చెను. |
| 12. | మయూర మండలము | Pavo | Peacock | నెమిలి, బాణాసురుని ధ్వజము. |
| 13. | త్రిశంకుడు | Crux | Cross | వశిష్ఠుల శాపముచే చండాలుడై, విశ్వామిత్ర తపోబలముచే స్వర్గమునకు విసర బడెను. భ్రష్టుడై అంతరాళమున నున్నాడు. ఈ చుక్కలను రోయర్ (Royer) 1679 లో పట్టీలో జేర్చెను. |
| 14. | ఇంద్రద్యుమ్న మహారాజు*1 | Pisces Australis-Fomalhaut | దక్షిణ మత్స్యము | ఇతనిపుణ్యము క్షీణించెనని దేవతలు స్వర్గమునుండి త్రోసివేయగా, తనపేరిట కొలనుగలదని సాక్ష్యమిప్పించి స్వర్గమున నిలిచెను. |

* అగస్త్య శాపముచేత ఏనుగై పుట్టి, (వరుణుని వాహనమైన) మొసలితో వేయిసంవత్సరములు పోరాడి విష్ణుని ప్రార్థించి మోక్షమును బడసెను. ఇదే సుప్రసిద్ధమైన గజేంద్రమోక్షకథ.

| | | | | |
|---|---|---|---|---|
| 15. | బకము, కొక్కెర*2 | Grus | Crane | బకమును గూర్చిన గాథలు చాలగలవు. (1) తనపేరిటి కొలను విషయమై ఇంద్రద్యుమ్నుని సాక్షి: (2) వశిష్ఠ విశ్వామిత్రులు పరస్పర శాపములచే నొకరు బకమైరి. 3. భారతార్థములో బకము వాయుదేవతాంశగల భీముని ప్రతిస్పర్థి బకాసురుడు. |
| 16. | ప్రావారకర్ణమను ఘూకము | Phoenix (ఫేనిక్సు) | Owl | ఈగుడ్లగూబకూడ ఇంద్రద్యుమ్నుని సాక్షియే. ఈబక ఘూకములను నక్షత్ర పట్టికలో 1604 లో 'బేయరు' (Bayer) చేర్చెను. |
| 17. | యుగంధర కమఠము | Apparatus Sculptoris | Sculptors work shop | " సోబిస్కి అనువాని డాలు " అనుపేరుపెట్టి 'లాకెయిల్' అనువాడు ఈచుక్కలను 1752 లో పట్టీలో చేర్చెను. ఈచుక్కలు డాలువలెను, తాంబేలువలెను కూడ కనబడును. ఈతాంబేలు, ఇంద్రద్యుమ్నుడు దానమిచ్చిన ఆవులగొరిజల రాపిడిచే నేర్పడిన పల్లము కొలనై ఇంద్రద్యుమ్న సరస్సయ్యెను. అందులోనే నేను చిరకాలమునుండి ఉన్నాననెను. |
| 18 | అష్టక (ప్రొష్టాష్టక మండలము.) * | Octans | అష్టాస్త్రము. | (హేడ్లీ) (Hadly) దొరచేతిలో అష్టాస్త్రమును పోలియుండుటచేత 1752 లో లాకెయల్ ఈచుక్కలకీపేరుపెట్టెను. ఇందులో సిగ్మాగుర్తుగలచుక్క నేటి దక్షిణ ధ్రువము. |
| 19 | నృగమహారాజు. | Chameleon | ఊసరవెల్లి. | అజ్ఞానదోషమున నొక గోవునే ఇద్దరు బ్రాహ్మణులకు దానమిచ్చి శప్తుడై నృగుడు ఊసరవెల్లి అయ్యెను. ఈగుంపు 1604లో 'బేయర్' చేర్చెను. |
| 20. | సక్తుప్రస్థులు | Norma or Quadra Euclidis | రేఖాగణితవేత్త యూక్లిడ్‌చేతి చతురస్రము. | వారమురోజు లుపవసించి సేకరించిన ధాన్యపుగింజలతో ఒక కుంచెడు పేలపిండి తయారుచేసికొని, అతిథియైవచ్చిన యమునికి సంతోషముతో నిచ్చివేసినందుకు ప్రీతుడై యముడు వారికి ఉత్తమగతి యిచ్చెను. 1752లో లాకెయిల్ పట్టీలో చేర్చెను. |

*2 వాయుదైవత్యమై స్వాతిఉదయించువేళకు, కొక్కెర కవసానము ; " చూలుకొనె స్వాతి, కొక్కెరజూటి బొదవె " విష్ణుకంచిమహాత్మ్యము.

* యయాతి దౌహిత్రులు అష్టకాదులు. యయాతివారలకనేక విజ్ఞానవిషయములుపదేశించెను. [చూ తెనుగుభారతము. అదిపర్వము – మూడవ ఆశ్వాసాంతము. యయాతి మదగర్వితుడై, ఉత్తముల నవమానించి " అధోభువన ప్రపాతసంభ్రమ విపశాత్ముడ " య్యెను. అది. 3–216 ]

| | | | | |
|---|---|---|---|---|
| 21 | సంయమని. | Mensa | Table Mountain | యమధర్మరాజు రాజధాని — సంయమనీపురము. ఈయంశము బహుకాలము నుండి, పురాణ ప్రసిద్ధము. మఱియు — అదిమీనుస్సై (అరణ్య 4 – 234) రక్షింప వైవస్వతనౌక ఈగిరిశిఖరమునకు బంధింపబడి నౌబంధన' మయ్యెను. (4 – 231). ఈచుక్కలను 1752 లో, లాకెయిల్, గుర్తించి పర్వతసానువని పేరు పెట్టెను. |
| 22. | ఉపరి చరవసు. | Coelum | Heavens* | 1752లో లాకెయిల్ ఈగుంపుచుక్కలకు స్వర్గమని అర్థమువచ్చునట్లు ఈపేరు పెట్టెను. చేదిరాజైన వసువునకు ఇంద్రుడిచ్చిన విమానమునెక్కి సంచరించి అతడు పరిచర వసువయ్యెను. |
| 23. | శ్యేనము, | Columba | Dove. | ఈచుక్కల యాకారమునుబట్టి 1624 లో 'బార్టియస్' అనువాడు పావురమని పేరుపెట్టెను. మనవారు డేగచుక్కలని ఏనాడో పేరుపెట్టిరి. |
| 24, | ఖగము. | Lepus. | Hare | పడమటివారిదృష్టికివి చెవులపిల్లి చుక్కలు. మనవారు వీనినొక పక్షి – ఖగమనిరి. |
| 25. | యమునానది. | Eridanus. | Ancient River. | ప్రాక్ప్రతీచీజ్యోతిర్వేత్తలు దీనిని పురాతన నదియనిరి. మనవారు యమున అనిరి. ఉపరిచరవసు 'వీర్యము' దొప్పలోపెట్టి, పెంపుడుడేగమెడకట్టి భార్యకందచేయు మనెను అదేదోతిండివస్తువనుకొనిఖగమీ డేగ నెదిరించెను. వానిపోట్లాటలో దొప్పలోని వీర్యము యమునలోబడెను. అవీర్యబిందువులు అద్రిక యనుచేపమ్రింగి గర్భము దాల్చెను. |
| 26. | అద్రిక. | Dorado | Sword Fish | కొమ్ము సొట్ట అను చేప (బొంతచేప). ఈచుక్కలగుంపును 1604 లో బేయరు గుర్తించెను. |

* లాటిన్‌భాషలో Coelum అనగా Heavens – ఉపరిలోకము. "Fiat justitia ruat Coelum" "స్వర్గము నేల గూలినా, న్యాయమే జరుగవలెను" (Anandale) నిఘంటు, అన్యభాషాపదములు – అర్థములు 840 పుట; మఱియు 842 లో Toto Coelae = దివి యంతయు; కాబట్టి 'కోలమ్' ఉపరిలోకము అనిమాత్రము అర్థముకలదు. ఇతరనిఘంటువులలోకూడ నిట్లేకలదు.

| | | | |
|---|---|---|---|
| 27 జాలమండలము. | Reticulus Rhomboid-alis. | The Rhomboidal Net విషమ చతుర్భుజాకారము గల వల. | 22 మొదలు 26 వఱకు సంస్కృతమూలమునగలవు. కాని ఈవల మండలమునుగూర్చి సంస్కృతమూలమునలేదు. నక్షత్ర విద్యా విశారదుడైన నన్నయ్యభట్టు ఈపట్టున* నీదిగువ పద్యము దివ్యముగాగూర్చి, ఉపరిచరవసు చరిత్ర నక్షత్రలోకమున చక్కగా ప్రదర్శించి ధన్యుడైనాడు. ఈచుక్కల గుంపును పాశ్చాత్యులలో 'లాకెయిల్' 1752 లో మొదట గుర్తుపట్టి పేరిడెను. |
| 28. మత్స్యరాజు. | Hydrus | Water Snake. | మత్స్యదరంబునబుట్టిన యకొక్కడుకు మత్స్యరాజునాబఱగి మత్స్యదేశంబున కధిపతి యయ్యె. 1604 లో బేయరు Bayer ఈపేరపెట్టి పట్టికలో చేర్చెను. |
| 29. సత్యవతి ; మత్స్యగంధి; యోజనగంధి. | Horologium. | The clock గడియారము | అకూ్కతును దాశరాజు తనకూతుంగాజేకొని పెంచినం బెరుగుచు, 'తండ్రినియోగంబున నయ్యమున నోడగడుపుచు నుండెన్' (ఆది-3,-34) ఈచుక్కలను 'లాకెయిల్' 1752 లో గుర్తించి, పేరుపెట్టి పట్టికలోచేర్చెను. |
| 30. దాశరాజు. | Pictor Equuleus Pictoris | Painters Easel. చిత్రకారుని వాలు బల్ల. | ఈగుంపును 1752 లో లాకెయిల్ గుర్తించి పేరుపెట్టి, చుక్కలపట్టీలోచేర్చెను. ఈజ్యోతిర్విదుని భావనలో దాశరాజొక వాలుబల్ల అయినాడు. |
| 31. శంతనుడు. | Alppa Eri-danus | | యమునామండలములో తేజోగ్రణ్యమైన మేటి చుక్క, |
| 32. ఆదిమీను. (మత్స్యమూర్తి.) | Volans Flying fish. | తెక్కలచేప | ప్రళయవేళ వైవస్వతుని నౌక రక్షించిన మత్స్యావతారమూర్తి. దీనిని 1604 లో బేయరు గుర్తించి పేరిడెను. |
| 33. వైవస్వతనౌక | Argo Navis | Noah's ship | ఏడవ మన్వారంభమున సృష్టికవసరమైన సమస్తబీజములతో నీనౌకను ఆదిమీను రక్షించెను. |

* తెనుగుభారతము. ఆది. 3—31 .... "నద్రికయను నప్సరస యమునయందు మీనయి క్రుమ్మరుచున్నయది యవ్వసువీరబిందుద్వయంబు త్రావి గర్భంబుదాల్చిన దశమమాసంబునందు 32. గీ॥ తెరలవలవైచి జాలరిదిగిచి దాని యుదరదళనంబు సేయ నందొక్కకొడుకు నొక్కకూతునుగని వారినొసగదెచ్చి, దాశరాజున కిచ్చెను దత్క్షణంబ॥

| | | | | |
|---|---|---|---|---|
| 34. | నౌబంధనము. | Mount Mensa | ఈగిరిశృంగము నకు వైవస్వత నౌక కట్టబడి నందున నీపేరు వచ్చెను. | అరణ్య 4–231, అమ్మహాద్రిశృంగమనఘ నౌబంధనంబన, నవని బరగె. దీనిని లాకెయిల్ 1752 లో గుర్తించి పేరుపెట్టెను. |
| 35. | శరారి. (అడేలు) | Toucan | American Goose | వసిష్ఠవిశ్వామిత్రులు ఒండొరుల శపించుకొనిరి. ఒకరు కొంగయు, నొకరు అడేలునై బహుకాలము పోరాడుకొనిరి. ఈకధ పురాణప్రసిద్ధము. ఈచుక్కలను 1604లో బేయరు గుర్తించి ఈ పేరు పెట్టెను |
| 36. | సరఘామండలము | Musca | Bee తేనెటీగ | అశ్వినీదేవతలు తమభక్తులు, ఆశ్రితులు, సంతోషము కొఱకు మధుప్రధానము చేయుచుండిరి. అశ్వతర మండలసమీపమున నీమధుమక్షిక ముందుట గమనింప తగును.*1 దీనిని 1604 లో బేయరు గుర్తించి పేరు పెట్టెను. |
| 37. | ఏకశృంగి, శుష్ణ మండలము | Monoceros | ఒక్కటే కొమ్ము గల దానవుడు | ఈరాక్షసుడు వృత్యాసురని మూకలోని వాడు. "భూతానాం శోషణహేతుః" కావున వీడు శుష్ణుడనబఱగెను. ఇంద్రుడు వీనింగూడ సంహరించి వర్షము గురియింప తాప ముపశమింప జేసి వంద్యుడయ్యెను.*2 దీనిని కూడ బేయరే 1604 లో గుర్తించి పేరు పెట్టెను. |
| 38. | ధుంధు మండలము | Fornax | Chemical Furnace | ఇది ఘోరమైన యగ్నిగుండము. రక్కసులచే ద్రోయబడిన అత్రిని అశ్వినీదేవత లుద్ధరించిన కథ వేదప్రసిద్ధము *3. పిమ్మట జగద్ధితముగోరి కువలాశ్వుడు వీనిపై దండెత్తెను. ధుంధుడు "ఉగ్రనిశ్వసన నిర్ధూతాగ్ని కీలాకృష్టుడు" (అరణ్య 4-411) "దారుణవహ్ని శిఖాకలాపములు" వాని నేత్ర నాసికా ద్వారములనుండి వెల్వడెను. కువలయశ్వుడు వీనిని సంహరించి ధుంధుమారుడయ్యెను. ఈచుక్కలను 1752 లో 'లాకేయిల్' గుర్తించి పేరిడెను. |

* 1. ఋ X. 106-10 " అరంగరేవ మధ్వేర యేధే సారఘ........
* 2. ఋ I. 33-12 " విశ్వంగణ మఖనచ్ఛుష్ణమింద్రః
* 3. ఋ I, 112-7 " తప్తం గర్భమోభ్యావంత మత్రయే.

| | | | | |
|---|---|---|---|---|
| 39. | భుజ్యు కాలచక్రము | Circinus | Compass వృత్తకారిణి | భుజ్యుడు అశ్వినీదేవతల భక్తుడు ; అశ్రితుడు. ఒకప్పుడీ భుజ్యుడు నడిసముద్రములో చావనైయుండగా, నూరుతెడ్లుగల పడవలో వీని నెక్కించి, రక్షించి, క్షేమముగా దరిజేర్చిరి. ఈ విషయము అనేక సూక్తములలో వర్ణింపబడినది.*1 ఈ చుక్కలను 1752 లో లాకెయిల్ గుర్తించి పేరు పెట్టెను. |
| 40. | నహుష, అజగర, మహాహి మండలము | Hydra | మహాసర్పము | ఈమహాహి ఆశ్లేష మొదలు స్వాతి వఱకు వ్యాపించినది వృత్రవధ మూలముగా ఇంద్రునికి బ్రహ్మహత్యతో స్థానభ్రష్టము ప్రాప్తించినది. నహుషు డింద్ర పదవికి రాగా శచినికూడ నభిలషించెను. సప్తఋషులలోనగు ఋషులచే పల్లకిమోయించుకొని రమ్మని శచి కోరెను. ఋషులు మోయుచున్న పల్లకినెక్కి 2* తొందర ఎక్కువై వారి నవమానించగా, అగస్త్యుడు నహుషుని అజగరముగమ్మని శపించెను. (వాయుదైవత్య) స్వాతీనక్షత్రాంశగల భీమునిపట్టుకొని నహుషుడు శాప విముక్తి నందెను. |
| 41 | అమృత కలశ | Crater | Cup | మహాహిప్రక్కనే, దానిమధ్య భాగమున నీ కలశము చూడనగును. |

* 1. ఋ I 116-5 యదశ్వినా ఊహథుర్భుజ్యుమస్తం శతారిత్రాం నావమాతస్థివాంసం.

* 2. నక్షత్రమండలములో సప్తఋషులును పల్లకి ఆకారముగల మఘతో నుదయింతురు. నహుషునికథ ఖగోళమున నక్షత్రాక్షరములతో స్పష్టముగా చూడనగును.

ఇంకను మఱికొన్ని చుక్కల గుంపులు కలవు కాని వాని చర్చ యీగ్రంథమున కనవసరమని విడిచితిని.

# 11. లా క్షా గృ హ ద హ న ము

పాండవుల మేలు దుర్యోధనుని కసూయ హేతువు. ఏవిధమున నైన వారిని నిహతులంజేసి ముదమొందుట వానిముఖ్య కామ్యము. పాండవులకు విషప్రయోగము చేయించెనుగాని అందువలన లాభము లేకపోయెను. పిమ్మట నాసోదరులను అగ్నిదగ్ధులంజేసి తుదముట్టింప వలెనని దుర్యోధనుని పాపనిశ్చయము. ఆయుపాయము కొనసాగుటకు పంచపాండవులను హస్తినాపురినుండి దూరముగా పంపుట చాల అవసరము. ధృతరాష్ట్రుని మెడలుముష్టి, దుర్యోధనుడు పాండవులను వారణావతమున కనిచెను. అందు వారు నివసించు గృహసమీపమున శస్త్రాగారము ప్రక్క- నొక్క-లాక్షాగృహమును తయారు చేయించెను. పాండవు లేమరి యున్నపుడు దుర్యోధనవంశవధులు ఆలక్క-యింటికి నిప్పంటించి వారింగాల్చి చంపుట ఒకసంకల్పము; ఒకరంటించకుండ లక్క-యిల్లు తనకుతానే అంటుకొని మండిపోవు నేర్పాటులు చేయించుట మరొక సంకల్పము. ఈనాడు విజ్ఞానశాస్త్రము (Science) నభ్యసించుయువకులీ లక్క-యింటిని నిర్మాణక్రమము భౌతికశాస్త్ర దృష్ట్యా పరిశీలించుటవలన విజ్ఞానాభివృద్ధి కాగలదు. కావున నావివరములను ఓపికగా పరిశీలింతము.

పాండవులు వారణావత పురప్రవేశము చేసిన దినము - ఫాల్గునశుక్ల అష్టమి-రోహిణి నక్షత్రము. ఆది 145 - 34:

"అష్టమేహాని రోహిణ్యాంప్రయాతాః ఫాల్గునస్య తే వారణావతమాసాద్య దదృశుర్నగరం జనమ్". నన్నయ ఆది. 3-148:

"పాండుకుమారులు ననేక భూసురాశీర్వాద నాదాభినందితులై - ఫాల్గున మాసంబున శుక్లపక్షాష్టమీ రోహిణినాడు వారణావతంబు సొచ్చి."

పిమ్మట యుధిష్ఠిరుడు లాక్షాగృహమును జాగ్రత్తగా పరిశీలించి, భీమునితో నిట్లనియె: ఆది 146-14, 15:-

14 జిఘ్రాణోऽస్యవసాగంధం సర్పిర్జతు విమిశ్రితమ్, కృతంహి వ్యక్తమాగ్నేయమిదం వేశ్మపరంతప॥

15–శణసర్జర సంవ్యక్తమాపేయగృహకర్మణి । ముంజబల్బజవంశాది ద్రవ్యం సర్వంఘృతోషితం”

సంగ్రహరచనాశీలుడైన నన్నయ పై శ్లోకముల నిట్లు తెనిగించెను.

ఆది 3-149 క॥ ఈగృహకుడ్యంబులు లాక్షాగర్భము లాజ్యతైల గంధులు మఱి శస్త్రాగార సమీపము మాయాగృహమగునిది యనశ్య మాగ్నేయంబై”.

సంస్కృత మూలమునలాక్షాగృహరచన పెక్కువివరములతో వర్ణింపబడినది. నెయ్యి, లక్క, సర్జరసము, వెదురు మొదలగు పదార్థములు, తాటియాకులవలెనే బహుత్వరగా నిప్పంటుకొని భగ్గున మండు స్వభావము గలవి. వానికితోడు నేతిందడిపిన ముంజగడ్డి. మొదవుగడ్డిగో నగునవి ప్రక్కనే నిలువచేయబడినవి. ఇవన్నియు ‘స్వయంప్రభాగ్ని’ ప్రేరకములు* (induce spon-taneous combuistion) ఇట్లు తనకుతానై ప్రభవించిన అగ్ని రాజుకొని కొంపకు అంటించి భగ్గుమనిపించగలదు. ఇట్లు స్వయముగా ప్రభవించిన అగ్నివలన కాని ఏమరియున్నప్పుడు దుర్యోధన పక్షపాతు లంటించిన మంటలవలనకాని, ఎట్లైనను పాండవులా లక్కయింటపడి కాలి చచ్చుటే దుర్యోధనుని ప్రధానాశయము. లాక్షాగృహ నిర్మాణక్రమములో, దుర్యోధనుని ప్రేరితుడైన శిల్పి వ్యక్తము చేసిన విజ్ఞాన సూక్ష్మవిశేషములు, ఆశాస్త్రజిజ్ఞాసగల తెనుగు

*See. Von Buskirk. Everyday Science. P. 52 Spontaneous means self-acting. So if a fire starts itself it results from spontaneous combustion. Under certain conditions there is danger from it in the home. Paint contains an oil, which when exposed to the air, slowly oxidises. If a pile of oily rags or waste is left confined in a space where there is little circulation of air, the heat from slow oxidation of the oil cannot escape easily. Therefore the temperature of the rags rises. This rise in temperature hastens the oxidation, which causes a still higher rise in temperature. Atlast, the kindling point may be reached, and the rags burst into flame. If grass cuttings are filed against the house spontaneous oxidation may set fire to the building.

యువకులు ఆదృష్ట్యా పరిశీలించి తెలిసికొనుట ముఖ్యము గనుక పైవివరములు వ్రాయవలసివచ్చినది.

## లా క్షా గృ హ ద హ న మె ప్పు డు?

లక్కయిల్లు ఏమాసమున దహింప బడెనో మూలమునందు కానరాలేదు. కాని "కృష్ణపక్షే చతుర్దశ్యాం రాత్రావస్యాం పురోచనః భవనస్య త్వద్వారి ప్రదాస్యతి హుతాశనమ్॥ మాత్రా సహ ప్రదగ్ధా వై పాండవాః పురుషర్షభాః। ఇతి వ్యవసితాం తస్య ధార్తరాష్ట్రస్య దుర్మతేః॥" అని కృష్ణపక్షచతుర్దశినాడు దుర్యోధన పక్షపాతులాయింటికి నిప్పంటించ నిశ్చయించినట్లు ఆది 147-4, 5 శ్లోకములు వివరించుచున్నవి. నన్నయకూడ ఆది 6-156 లో "ఈకృష్ణచతుర్దశినాడు రాత్రి పురోచనుండు లక్కయింట దహనంబు పురిగొల్పుం గావున నిందుండి వెలువడిపోవునట్టి యుపాయంబు..." అని లాక్షాగృహదహన దినము స్పష్టము చేసెను!

కాని ఏ మాసపుకృష్ణచతుర్దశియో - మూలమునలేదు. పాండవులు ఫాల్గునశుక్ల అష్టమీ రోహిణినాడు వారణావతపురప్రవేశము చేసినట్లు మూలమునగలదు; నన్నయ ఆయంశము తెనుగున వ్రాసియున్నాడు. ఏమాసపు కృష్ణచతుర్దశియో తెలుపక వ్యాసుడు విడిచినాడు. ఆలోపమును నన్నయ భర్తీచేసినాడు. చూ. ఆది. 6-157

క॥ ధనదానములను బ్రియభోజనదానములను విశిష్టసద్ద్విజతతులం
దనుపుచునుండఁగఁ దత్పురమున షణ్మాసములు భరతముఖ్యుల కరిగెన్॥

ఆకృష్ణచతుర్దశినాడని వక్కాణించుటచేత మాసము నిర్ణయింపనగుచున్నది. ఫాల్గునమునకు భాద్రపదము ఆఱవమాసము. భాద్రపదశుక్ల అష్టమినాటికిపాండవులు వారణావతమునకువచ్చి ఆఱునెలలైనది. ఆకృష్ణపక్షచతుర్దశియనుటచే లాక్షాగృహదహనము భాద్రపదకృష్ణచతుర్దశినాడని స్పష్టమగుచున్నది. ఏమాసమైననేమి? ఏదోయొక మాసము! మాసనిర్ణయమునకింత చర్చఎందుకు? అని పాఠకులు పృచ్ఛచేయవచ్చును. భారతకథను ఖగోళ దృష్ట్యా అన్వయించుకొనుటకు ఈమాస

నిర్ణయము మిక్కిలి అవసరము. భాద్రపదమునకొంత సింహమాసము. సూర్యుడు సింహరాశితో నుదయించి సింహరాశితో నస్తమించు చుండుట వేళ, రాత్రివేళ సింహరాశినక్షత్రములు మఖ ఆమాసములో కనబడవు. మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని యొకపాదము ఇవిచేరి సింహరాశి; ఉత్తరఫల్గుని మూడుపాదములు, హస్త, చిత్తార్ధము కన్యారాశి; చిత్త రెండుపాదములు, స్వాతి, విశాఖ మూడుపాదములు ఇవి తులారాశి. ధర్మరాజు యముని యంశ మున జన్మించినాడు. యముడు పితరుల కధిపతి: మఘానక్షత్రము పితృదేవతాకము. భారతార్థములో మఘనక్షత్రము ధర్మరాజు; ఉత్తరఫల్గుని నక్షత్రము అర్జునుడు; స్వాతి వాయు దైవత్యము; భీముడు వాయుపుత్రుడు; ఖగోళదృష్ట్యా భీముడనగా స్వాతీనక్షత్రము. నకులు అశ్వినుల యంశమున జన్మించిన వారు. చిత్తానక్షత్రము ప్రక్క దిగువగా దక్షిణమున శ్వేతర మండలములో మిక్కిలి మెఱయు చుక్కలజత — ఆల్ఫా, బీటా, రెక్కజంట అశ్వినుల యూడవస్థానము. నకులసహదేవులు ఖగోళదృష్ట్యా ఈచుక్కలజత భాద్రపదము మొదలుకొని కొంతకాలమువఱకు మఘ, ఉత్తరఫల్గుని, స్వాతి, అశ్వతర నక్షత్రములు మింటకానరావు. అవి పాండవసోదరులకు దుర్దినములు. భాద్రపదము మొదలు మఘాది నక్షత్రములు వ్రాలి, సోలి, తేజోహీనములై, యజ్ఞాతముగా నుండక తీరని దినములు. కావున భాద్రపదకృష్ణచతుర్దశినాడు పాండవులు లక్కయింటికి చిచ్చుపెట్టి తాము బిలప్రవిష్టులై వనవాసాదిక్లేశము లను పొందుచు కొంతకాలము గడుపవలసిన వారైరి. (As above, so below). మఘాదినక్షత్రములతో పాండవులును లోకులకు కనబడక, అదృశ్యులై, అజ్ఞాతముగ నడవులలో నుండవలసిన వారైరి. ఈయంశము ఖగోళదృష్ట్యా స్పష్టముగా నిరూపించుటకే వారణావతమున, పాండవు లకుహాయిగా ఆఱుమాసములు గడచినవి అని వక్కాణింపవలసి వచ్చినది. అటుపిమ్మట వారికి దుర్దినములు సంప్రాప్త మయ్యెనని ధ్వని. నన్నయకు జ్యోతిర్విజ్ఞానము లేనియెడల మూలమునలేని యాఱు మాసముల గొడవ నిక్కడ నెత్తుకోవలసిన యవసరము ఉండదు.

# బకవధ

బకుడను రాక్షసు డొకడు భరతఖండమున యమునానదీ తీరమున నున్న యేకచక్రపురనివాసుల నమూయిక ప్రజల నిష్టమువచ్చినట్లు హింసించి, చంపుకొని తినుచుండెను. వాని బాధ పడలేకను, కన్నతల్లి వంటి స్వగ్రామమును విడిచి పోలేకను, ఏకచక్రపుర వాసులు, ఇలు వరుసను దినమొక బండెడన్నమును, రెండు ఎనుబోతులను, ఒక మను ష్యుని, తినుటకు వానికడకు పంపుదుమని ఏర్పాటుచేసికొని, ఆప్రకా రము జరిపించుచువచ్చిరి. వారికి గ్రామమునందుగల యభిమానమును ప్రశంసించుచు నీక్రింది చాటువు రచింపబడెను :

'క॥ బకు డేకచక్రపురమున
ప్రకటితముగ దినమునొకరి భక్షింపంగా
నొకరైన విడువజాలరు
సుకుమారక జన్మభూమి సుఖమెట్టిదియో'.

ఇట్లాయూరివారిం బీడించుచున్న రక్కసునిపట్టి భీముడు తెగటా ర్చెను. బకవధ వృత్తాంతము నక్షత్రవీధినిగూడ సొగసుగా లిఖింప బడినది. భీముడు వాయుదేవునంశమున జన్మించినవాడు. భారతార్థ ములో భీముడనగా స్వాతినక్షత్రము. ఉడులోకమున స్వాతికి 'ప్రతి స్పర్థి' బకుడున్నాడు. దక్షిణాకాశమున మెఱయు నక్షత్రములలో కొంగరూపుగల చుక్కల గుంపొకటి కలదని పడమటి దేశముల నక్షత్ర పరిశోధకులలో 'బేయరు' (Bayer) అనువాడు 1604 లో కనిపెట్టి, Grus అని లాటిన్ భాషలో నాగుంపునకు నామకరణము చేసి చుక్కల పట్టికలో చేర్పించియుండెను. అంతకు ముందు పడమటి నక్షత్రవేత్తలకు ఈ చుక్కలనుగూర్చి బొత్తిగా తెలియదు. మన పూర్వులీచుక్కలను పెక్కువేల సంవత్సరములనుండి యెఱుగుదురు. ఇంద్రద్యుమ్నమహా రాజు కీర్తిమాసెననుకారణముచేత దేవతలు అతనిని స్వర్గభ్రష్టునిచేయ జూచిరి. "నా కీర్తి మాయలేదు. సాక్షులను విచారింపుడ"ని యా మహారాజు దేవతల నర్థించెను. ఇంద్రద్యుమ్నుని పక్షమున విచా రింపబడిన సాక్షులలో నాళీకజంఘు బక మొకటి. (అరణ్య 4-367).

అంతకు పూర్వము వసిష్ఠవిశ్వామిత్రులు హరిశ్చంద్రు విషయమున కొండొకపుడు శపించుకొనిరి. వసిష్ఠుడు విశ్వామిత్రుని గృధ్రము కమ్మని శపించెను. విశ్వామిత్రుడు వసిష్ఠుని కొంగవు కమ్మని ప్రతిశాప మిచ్చెను. ఇట్లా యిరువురును పక్షిరూపములతో ఘోరముగా పోరిరి. ఈ పోరాటము ఆడిబకయుద్ధ మని పురాణ ప్రసిద్ధము. (భాగ. 9-193).

భారతకథ జరుగునాటికికూడ దక్షిణాకాశ నక్షత్రములలో బక ముండెను. కొక్కెరచుక్కలను నన్నయభట్టారకుడే కాక, కవి సార్వ భౌముడు, శ్రీనాథుని బావమఱది దగ్గుబిల్లి దుగ్గయ్యకవి, తాను రచించిన విష్ణుకంచి మాహాత్మ్యమునందు శరత్కాలవర్ణన సందర్భ మున నిట్లు పేర్కొన్నాడు:

సీ॥ సింధూరక మెఱమించె, బరువయ్యె కేదంగి
కడిమిపుష్పితమయ్యె గ్రంధిపూచె
నర్జునం బలరారె నరవిందములు గ్రుస్సె
భూస్థలి నేఱులు పుక్కిలించె
గండూపదములుబ్బె గలగె హంసచయంబు
నటియించె గప్పలు నమిలి చెలగె
చాతకంబులు మించె సాగరం బెడయించె
హరిగోపములతోడ నాటె వేళ్ళు
మత్తభృంగంబులకు దేనె రిత్తయయ్యె
గండుగోయిలగూతలు కట్టువడియె
మూలుకొనె స్వాతి, కొక్కెరజోటుబోదవె
విష్ణునకు నిద్రలేచెడి వేళయయ్యె.

విష్ణుభగవానుడు చాతుర్మాస్య నిద్రనుండి కార్తికశుక్ల ఏకాదశినాడు మేల్కొనును. అందుచేత నాయేకాదశి ఉత్థానైకాదశి యనబడు చున్నది. విష్ణునిముందు ప్రక్క వాయుదేవు డుండవలసిన దే. "మారుతస్య వేధసః" అని శ్రుతి. స్వాతివాయు దైవత్యము. విష్ణునికి ముందు స్వాతినక్షత్రము తూర్పున నుదయమగుచుండును. తూర్పు దిక్కునేడిస్త్రీ, స్వాతినక్షత్రమును, గర్భమున నిడుకొని, నిండు

చూలాలై యున్నది; త్వరలో ప్రసవించి, స్వాతియను పుత్రుని కనును. స్వాతి కనఁబడకుండ నున్నంతవఱకే బకాసురుని మిడిసిపాటు. స్వాతి యావిర్భావముతో బకుని దుమ్ములు విరిగి చచ్చుట సిద్ధము. భీముని రాక ఏకచక్రపురమున బకాసురునకును, స్వాతి ఉదయము ఖగోళ బక నక్షత్రములకును, అవసాన సూచకములు. కొట్టి దుగ్గయ కవి తూర్పుదిక్పతి చూలుకొని స్వాతిని గర్భమున నిడుకొనుట కొక్కెరచుక్కలకు మోసము; వాని యంత్యదశ సమీపించెనని సొగసుగా వర్ణించినాఁడు. మన పంచాంగ కర్తలు భాద్రపద కృష్ణ పక్షమును మహాలయ పక్షమందురు. అప్పుడు పితరుల నారాధించుట ముఖ్యము. ఆశ్వయుజబహుళము స్వాతికార్తె దినములు. ఆశ్వయుజ బహుళ చతుర్దశినాఁడు స్వాత్యంభగనమని సిద్ధాంతులు తెలుపుదురు. కార్తికశుక్ల ప్రారంభమునుండి స్వాతి సూర్యోదయాత్పూర్వము తూర్పున నుదయమగును. ఆ దినములలోనే బకవధ జరిగినది. బకుఁడేకాదు; భీమవిరోధి జరాసంధుఁడును కార్తీకశుక్లమందే వధింపఁబడెను. చూ. సభా 1-206 : "ఇట్లు కార్తికమాసంబునం బ్రథమదివసంబునందొడంగి భీమజరాసంధు లెడయుడుంగక యొండొరులంబట్టియుఁ గిట్టియు నడిచియుం బొడిచియుం... మహాయుద్ధంబు సేయుచుం ద్రయోదశినా డిద్దరుం గిట్టి మల్లయుద్ధకౌశలం బేర్పడం బెనంగునెడ జతుర్దశి నాఁటి రాత్రియందు జరాసంధు నతిశ్రాంత భావం బుపలక్షించి యధోక్షజుండు భీమున కిట్లనియె :

207\. చ॥ విరహితసత్త్వుఁడయ్యె, బ్రతివీరుఁడు వీనిన శేషధారుణీ
శ్వర నికరాపకారు నతి సాహసికున్ వధియించి నీభుజ
స్థిరత వెలుంగ నయ్యనిల దేవుబలంబును నీబలంబు భా
సురముగ మాకుఁజూపుము విశుద్ధయశోనిధి మారుతాత్మజా॥

208 అని ప్రబోధించి పలికిన ననిలతనయుం డనిల దేవునిందలంచి తత్ప్రసాదంబున నధిక సత్త్వసమేతుండై.

210 ... వధియించి యార్చెను వఱలఁగ భీముండు భువనవలయం బద్రువఁగ॥

భీమజరాసంధుల మల్లయుద్ధమున నెవరుగెల్తురు? భీముడా? జరా సంధుడా? జయము తులలో సటునిటు మ్రొగ్గుచు సంధిగ్ధావస్థలో నున్నపుడు శ్రీకృష్ణపరమాత్మ తనభక్తుడు నాశ్రితుడునైన భీమునికి తరుణముకనిపెట్టి (Psychological moment), తోడుపడి, ప్రోత్సాహ మొసగెను. దైవసాయము భీమునిడగుటచే జయము భీమునికి లభించెను. జరాసంధవధ కార్తికశుక్ల పౌర్ణమినాడని స్పష్టము. అప్పటికి స్వాతీ నక్షత్రము సూర్యోదయాత్పూర్వము బాగుగా నుదయించి ప్రవాళము వలె నరుణకాంతులతో తూర్పున తేజరిల్లుచుండగలదు. కార్తికశుక్ల పాడ్యమి మొదలు పున్నమివఱకు భీమజరాసంధులయుద్ధము ప్రవర్తిల్లి నట్లును, చతుర్దశినాటిరాత్రి శ్రీకృష్ణప్రబోధితుడై భీముడు ఉత్సాహ మతిశయింప మాతరిశ్వుం దలంచుకొని యనంత బలసంపన్నుడై మరు నాడు జరాసంధుంజంపెనని సంస్కృతమూలమున గలదు. (చూ. సభా. 23 - 29 మొదలు 24 - 8 వఱకును). స్వాతి - భీమునకు కార్తికము ఉచ్చమాసము. కిమ్మీర, దుర్యోధనులుకూడ కార్తిక, మార్గశిర మాస ములలో వధింపబడుట చిత్ర మనిపించును. కిమ్మీరవధకాల మీదిగువ నిర్ణయింతుము. మనపంచాంగకర్తలు ఈనాడుకూడ ఆశ్వయుజ శుక్ల పున్నమినాడు అక్షక్రీడజరుగవలెనని వ్రాయుచున్నారు. ఇపుడుగూడ కొన్నివైశ్యకుటుంబములలో స్త్రీలు ఆశ్వయుజ పున్నమనాడు జూదము గాకున్న గవ్వలాటలైన నాడుట యాచారమై యున్నది. ఈపూర్వా చారముననుసరించి దుర్యోధనుడు ఆశ్వయుజపున్నమనాడు ధర్మరాజును జూదమునకు బిలిపించి ఆమిషచే పాండవుల సర్వస్వము నపహరించెను. ధృతరాష్ట్రుడు ద్రౌపది భంగపాటువిని, ధర్మరాజు రాజ్య మతనికిచ్చి బుజ్జగించి పంపెను. మరల నొకపక్షములోపుగా రెండవమారు జూద మాడి ధర్మరాజోటువడి, ద్రౌపదీసోదర సహితుడై వనవాసమున కరిగెను. ఆశ్వయుజబహుళ అమావాస్యముందు 1 - 2 రోజులలో పాండవులకు పరాజయముతో వనవాసము ప్రాప్తమైనది. వారి వన వాసక్లేశారంభము ఆశ్వయుజబహుళ అమావాస్య పిమ్మటనని మఱువరాదు.

కిమ్మీరవధ. ఆర్యణ 1 - 107

విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె :

ఇందుండి చని పాండవులు మూఁడహోరాత్రంబులు నిరంతర ప్రయాణంబులు సేసి కామ్యకవనంబు సొచ్చి వారొక్కనాటి యర్థరాత్రంబున రాక్షస ప్రచారవేళయందు పరిభ్రమించుచు, రాక్షసమాయ గావించుచున్నవాని, నతినిశితదంష్ట్రాకరాళంబైన తన వదనగహ్వరంబు దెఱచి గుడ్లుమెఱవ, బభ్రుకేశంబులుదూల, బాలార్కరశ్మియుతంబైన బలాహకంబునుంబోలె సకలప్రాణి భయజనకంబుగా గర్జిల్లుచున్నవాని నిజపాదఘట్టిత మహీతల ప్రచలనవేగ వేల్లిత వల్లీపల్లవ బాహుపరిరంభణ సుఖంబుఁబాదపంబుల కాపాదించుచున్న వాని, నెదుర నొక్కరక్కసుంగని రంత వాఁడును బ్రాహ్మణ సంఘంబుముందటఁ గృష్ణాజినావృతులై వచ్చు పాండవులం గని మార్గనిరోధియైన మహాపర్వతంబుసంబోలెనుఁడ నదృష్టపూర్వప్రమాణంబైన వానికాయంబుఁజూచి నిమీలితనయన యయి, దుశ్శాసన కరాకృష్ట వికీర్ణ వేణీభరంబు వెనువెంట నొలయం బాంచాలి పంచపర్వతంబులనడుమ నదియుంబోలెఁ బతులనడుమ భయవ్యాకులితచిత్తయైన నింద్రియంబులు విషయతతిం బరిగ్రహించునట్లు య్యేవురు నక్కోమలింబట్టుకొని భయపడకుండ నాశ్వాసించుచున్నంత ”

ధర్మరాజు శకునితో రెండవసారి హాస్తినాపురమున జూదమాడినది, ఆశ్వయుజబహుళ అమావాస్య దినములలోనని పైన నిర్ణయించుకొంటిమి. అందొకటవది పాండవులు వనవాసగతులై హాస్తినాపురము నుండి మూడహోరాత్రములు నిరంతర ప్రయాణములుసాగించి, కామ్యకవనమున ప్రవేశించినపిమ్మట నొకయర్ధరాత్రమున కిమ్మీరరాక్షసుడు వారికెదురుపడెనని విదురుడు ధృతరాష్ట్రునితో పలికెను. కార్తీకశుక్లపక్షమున నొకనాటిరాత్రి కిమ్మీరుడు పాండవుల నెదిరించెను. పిమ్మట భీమకిమ్మీరులు ఘోరముగా ద్వంద్వయుద్ధముచేసిరి. బక సోదరుడగు కిమ్మీరునిగూడ, బకుని చంపినట్లే, దేహయష్టి విరచి, భీముడు వధించెను. కిమ్మీరవధకూడ, సూర్యోదయాత్పూర్వము తూర్పున స్వాతి

ఉదయమైన దినములలో, కార్తీక శుక్లపక్షపు దినములలో జరుగుట విస్మయహేతువు.

## భారత యుద్ధము - దుర్యోధనవధ

మార్గశిరశుక్ల ఏకాదశి, భగవద్గీత ఏకాదశియని భారతదేశ మంతటను ప్రసిద్ధికలదు. కురుక్షేత్ర సంగ్రామము జరిగిన యీ మార్గశిర శుక్లపక్షమునకు తిథులు పదమూడేవచ్చినవి*. భరణి- యమనక్షత్రమైన భరణితో కురుక్షేత్రయుద్ధ మారంభమైనది. పదునెనిమిది రోజులు గడిచినవి - కడపటి దినమున, భీమ దుర్యోధనుల గదాయుద్ధము జరిగినది; భీమగదాదండఘాతమున పెందొడలు విఱిగి, "రారాజు ధూళిఁబ్రుంగె" మార్గశిరమాసము కార్తికము తరువాతనే వచ్చును. అపుడు స్వాతి సూర్యోదయమునకు ముందే ఉదయించి ఉజ్జ్వలముగా మెఱయు దినములలో దుర్యోధనుడు వధింపబడెను.

స్వాతీనక్షత్రము సూర్యోదయమునకు ముందు ఉదయమగు దినములను గమనించి, మన పూర్వసిద్ధాంతులు మార్గశిరశుక్లత్రయోదశినాడు హనుమద్వ్రతము విధించిరి. రెండవపక్షమందు – "నోతనసాయమస్తిదేవాయా అజుష్టన్" అను శ్రుతివాక్యము ననుసరించి సూర్యాస్తమయముకాగానే స్వాతి తూర్పున నుదయించిన దినము – వైశాఖబహుళనవమి – హనుమజ్జయంతి – యని పంచాంగకర్తలు వ్రాయుచున్నారు. కన్య - ద్రౌపది నవమానించిన కీచకుడీదినముల లోనే చిత్రవధ చేయబడెను.

## కీచకవధ ఎపుడు?

ఈప్రశ్న నన్నయ విరచిత భారతములో చర్చింపవలసిన యవసరము లేదు. భారతకథకును, నక్షత్రగతులకునుగల సంబంధము విమర్శ

---

* చూ. కీ॥ శే॥ స్వామికన్ను పిళ్ళెగారి జ్యోతిష గ్రంథములు: మహాభారతయుద్ధము జరిగిన మార్గశిరమాసమునందే కాక, 1914 సంవత్సరము ఆగష్టునెలలో మొదటి ప్రపంచయుద్ధము ప్రారంభమైనపుడుకూడ ఇట్లే వచ్చినవని పిళ్ళెగారు నిరూపించినారు.

నాంశము. భీమ, బకాసుర, జరాసంధ, కిమ్మీర, కీచక, దుర్యోధనులు సమబలులనియు, భీముడు తొలుత బకునింజంపెగావున తక్కినవారిం గూడ భీముడే చంపగలిగెననియు ఐతిహ్యము. జ్యోతిశ్శాస్త్రదృష్ట్యా బకాసురప్రభృతులు స్వాతికి ప్రతిస్పర్థులు. భీముడు (స్వాతి) బక, కిమ్మీర, జరాసంధ, దుర్యోధనుల కెట్లు ప్రతిస్పర్థియయ్యెనో విమర్శించుకొంటిమి. కీచకవధ కూడ విమర్శించుట యీసందర్భమున నవసరమనితోచి, దాని నిట సంగ్రహముగా చర్చింపగోరెదను.

పాండవులు ఆశ్వయుజ బహుళ అమావాస్య దినములలో వనవాసము ప్రారంభించిరి. పండ్రెండేండ్లు వనవాసము ముగించి, పదుమూడవయేట విరాటుని పురమున నజ్ఞాతవాసము చేయుచుండ, తుది దినములలో, విరటరాజు బావమఱది, కీచకుడు, సైరంధ్రీవేషమున నున్నద్రౌపది సౌందర్యమును మెచ్చి యామెను అనమానించి పీడింపజొచ్చెను. ద్రౌపది యంగీకారము నటించి, నర్తనశాల సంకేతము తెలిపెను. కీచకు డారాత్రి సంకేతస్థలమునకురాగా, గంధర్వవేషమున భీముడు కీచకుని జంపెను.

దుర్యోధనుడు చారులవలన కీచకవధ వృత్తాంతము వినినంతనే విరాటపురమున పాండవుల యునికి శంకించెను. దక్షిణగోగ్రహణము చేయుమని సుశర్మ నంపించి, భీష్మ, ద్రోణ, కృప, కర్ణ, అశ్వత్థామాది మహాయోధులతో దుర్యోధనుడు స్వయముగా ప్రచండసేనం గొని ఉత్తరగోగ్రహణము గావించెను. రారాజు పన్నిన యీ గోగ్రహణతంత్రము కౌరవులకు రెండువిధముల లాభింపగలదు. పాండవులు విరటుప్రోలినున్నచో బయల్పడకమానరు. లేనిచో విరటుని గోసంపద నపహరించవచ్చును. అజ్ఞాతవాసకాలము ముగియకుండ అర్జునుడు బయల్పడిన పక్షమున పాండవులు మరల పదమూడేడులు అడవులకు పోవుదురు. దుర్యోధనుడు నిర్భయముగా నా కాలమున, కాలుమీద కాలువైచుకొని రాజ్యసుఖము లనుభవింపగలడు. ఇంత కపటసంకల్పముతో సుయోధనుడు విరటుపురము చేరి యుత్తర గోగ్రహణము చేసెను. విరటుని గోవులను మరల్ప నర్జునుడు బయల్పడినంతనే

"సమయభంగమైనది. అజ్ఞాతవాసకాలము పూర్తికాకుండ పార్థుడిట వచ్చినాడు. పాండవులు మరిపండ్రెండేడులు వనవాసము, నొకయే డజ్ఞాతవాసము చేయవలదా?" అని దుర్యోధనుడు భీష్ముని పృచ్ఛ చేసెను.

"పాండవులు చాంద్రమాన పరిపాలకులు. వారు అధికమాస ములను పాటింపరు".

విరాట. 52-3. "తేషాం కాలాతిరేకేణ జ్యోతిషాంచ వ్యతిక్రమాత్
పంచమే పంచమే వర్షే ద్వౌమాసావుపజాయతః

4. ఏషామప్యధికామాసాః పంచచ ద్వాదశక్షపాః
త్రయోదశానాం వర్షాణామితిమే వర్తతేమతిః

5. సర్వంయథావచ్చరితం యద్యదేభిః ప్రతిశ్రుతమ్
ఏవమేతద్ధ్రువంజ్ఞాత్వా తతో బీభత్సురాగతః

వనవాసము పండ్రెండేండ్లలో, 5 ఏండ్లకు రెండధికమాసములచొప్పున నైదుమాసములు అధికమాసములు. ఇది పదమూడవ వత్సరము. సౌర చాంద్రమాసములకు తేడా సంవత్సరమునకు సుమారు పదు నొకండు దినము లుండును. సౌరమాసరీత్యా ఉత్తరగోగ్రహణము నాటికి వైశాఖమాసము. ఆశ్వయుజ అమావాస్యనుండి ఐదు మాస ముల పదునొకండురోజులు తీసివేయగా, "వైశాఖ బహుళ చవితి నాటికి - నిన్నటికి - అజ్ఞాతవాస దినములు నిండినవి - ఇవాళ పంచమి ఈనాడు అర్జునుడు బయల్పడుటచే సమయభంగములేద" ని భీష్ముడు నిర్ణయించెను.

కీచకుడు సంహరింపబడిన మఱునాడు సైరంధ్రిం జూచి విరటుని భార్య సుధేష్ణ ఇట్లనెను. "అమ్మా! తల్లీ! ఇక్కడితో మమ్ములను విడిచిపెట్టి నీ ఇష్టమువచ్చినచోటికి వెళ్ళు; ఇక్కడ ఉండనక్కర లేదు. రాజుగారు నిన్ను వెంటనే పొమ్మని చెప్పినారు".

ఆమెమాటలకు సైరంధ్రి ఇట్లు మారుపలికెను :—

"తల్లీ! ఇంక పదమూడు రోజులు మాత్రము భరించు. ఆతరువాత నేనే పోయెదను".* 1.

అజ్ఞాతవాస దీక్ష వైశాఖ బహుళ చవితితో పూర్తియైనదని పైని లెక్కించుకొంటిమి. అటనుండి పదమూడు రోజులు వెనుకకు లెక్కించుకొనగా, వైశాఖశుక్ల సప్తమినాడు సుధేష్ణాద్రౌపదులు పైవిధమున సంభాషించుకొనిరని స్పష్టమగుచున్నది. ఆ తొలిరోజురాత్రి – వైశాఖశుక్ల షష్ఠినాడు రాత్రి – కీచకవధ జరిగినది. చిత్రతో కూడి చంద్రుడున్న పున్నమి గలమాసము చైత్రమాసము. అటుపిమ్మట పదునైదు రోజులు తరువాతస్వాతి సూర్యాస్తమానము కాగానే తూర్పున నుదయమగును. పిమ్మట వైశాఖశుక్ల షష్ఠినాడు కీచకుడు సంహరింపబడుట జ్యోతిశ్శాస్త్రదృష్ట్యా కూడ యదార్థము. ఈవిధముగా సూర్యోదయాత్పూర్వమో, సూర్యు డస్తమించిన పిమ్మటనో తూర్పుటాకాశమున స్వాతి ఉదయించి ప్రతిస్పర్థులైన బక, కిమ్మీర, జరాసంధ, కీచక, దుర్యోధనాదులైన పాపశీలుర పరిహరింపనయ్యెను.

## 12. ద్రౌపది జననము

ద్రోణ ద్రుపదులు చిన్నప్పు డొక్కగురువువద్ద విద్య నేర్చుకొనిన సబ్రహ్మచారులు. పిమ్మట ద్రుపదుడు పాంచాలదేశమునకు రాజయ్యెను. ద్రోణుడు కృపిని పెండ్లాడి అశ్వత్థామయను కొడుకుం గని, దరిద్రుడై, వానికి ఆవుపాలు పోయుటకైన శక్తిలేక, ద్రుపదరాజు దర్శనముచేసెను. ద్రుపదుడు "అడ్డమైన మాటలాడి" ద్రోణు నవమానించెను. పిమ్మట కౌరవరాజకుమారులకు ధనుర్విద్యనేర్పి, గురుడై గురుదక్షిణార్థము ద్రుపదుంబట్టి, గట్టితెమ్మని ద్రోణుడు శిష్యులను కోరెను. అర్జునుడు ద్రుపదునిపట్టి కట్టితెచ్చి ద్రోణునికి సమర్పించెను.

---

* 1. సం. భా॥ విరాట 24-28, 30

28. "సైరంధ్రిగమ్యతాం శీఘ్రం యత్ర కామయసే గతిమ్
రాజాబిభేతి భద్రే ... ... సైరంధ్ర్యువాచ :—

30. త్రయోదశాహ మాత్రం మే రాజా క్షామ్యతు భామినీ
కృతకృత్యా భవిష్యంతి.

ఆది - 6 - 89 :— "ద్రోణుండు నర్జునుచేసిన పరాక్రమంబునకుఁ బరమప్రీత హృదయుండై, ద్రుపదుంజూచి నగుచు నిట్లనియె.

88. వీ రెవ్వరయ్య ? ద్రుపదమహారాజులె యిట్లుకృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె ? యిప్పుడు మహారాజ్యమదాంధకార మదివాసెనొకో !

89. గీ॥ ఇంక నైన నమ్ము నెఱుగంగ నగునొక్కొ,
యనుచు నుల్లసంబులాడి ద్రుపదు,
విడిచిపుచ్చె గురుడు, విప్రులయలుకయుఁ
దృణహుతాశనంబు దీర్ఘమగునె ?

90. ఇట్లు ద్రుపదుండు ద్రోణుచేత విముక్తుండయ్యుఁ గోపపాశబద్ధుండయి యప్పరిభవంబునకుం బ్రతీకారంబు సేయందలంచి బ్రాహ్మణోపాస్తి సేయుచుండె॥

కురుపాంచాలురు ప్రబలప్రతిస్పర్థులు. దుర్యోధన ప్రేరితులైన కౌరవులు పాండవవిద్వేషులు. పాండవమధ్యముడైన యర్జునుం బెండ్లాడు కూఁతును, ద్రోణుంజంపు కొడుకును తనకనుగ్రహింపుమని ద్రుపదుడు కోరుకొనుచుండెను. అర్జునుడు ద్రుపదుకూతుం బెండ్లాడుటచే పాండవ పాంచాలు రేకమగుదురు. ఆసంబంధము మూలముగా పాంచాలురు కౌరవులను సులభముగా జయింపవచ్చునని ద్రుపదుని యాశయము.

"నీకోర్కికిందగినయట్టి కొడుకునుం గూఁతురుం బుట్టుదురోడకుండు ము॥ని యాజుండు యజ్ఞోపకరణద్రవ్యంబులు సమకట్టికొని, యథావిధి, నుపయాజుండుసహాయుండుగా సౌత్రామణియైన కోకిలాదేవి పత్నిగా ద్రుపదునకుం బుత్రకామేష్టి సేయించిన నందు మంత్రాహుతులం దృప్తుండయిన యగ్నిదేవువలన...

ఆది 7 - 18. "వహ్నియపోలె రథారూఢుఁ డొక్కపుత్త్రుఁడు పుట్టెన్.
19. మఱియు

20. తరల. "కులపవిత్ర సితేతరోత్పల కోమలామల వర్ణ యు
త్పల సుగంధి లసన్మహోత్పల పత్రనేత్రి మదాలికుం
తలవిభాసిని దివ్యతేజముదాల్చి యొక్కకుమారి ద
జ్జ్వలనకుండమునందుఁ బుట్టెఁ బ్రసన్నమూర్తి ముదంబుతోన్.

21. అకన్య యిపుడు వివాహప్రాప్త యయిన ”

కాబట్టి ద్రౌపదీకన్య తల్లికడుపునబడి పదిమాసములు పెరిగి జన్మించిన కన్య కాదు. ఆమె అయోనిజ; అగ్నికుండ సముద్భవ. జ్యోతిశ్శాస్త్రదృష్ట్యా — అశ్విన్యాది నక్షత్రములలో విశాఖ కుమ్మరిసారె వలె గుండ్రనైన యాకారము గలది; ఇంద్రాగ్నిదైవత్య మైనది. అట్లగుటచే 'జోడువేల్పులరిక్క' యనబడుచున్నది. అగ్నిదైవత్యమై, గుండ్రని రూపముగలది కావున విశాఖ అగ్నిగుండమని వర్ణింపబడుట సహజము.

ద్వాదశరాసులలో సింహము తరువాత రాశి కన్య. ఈకన్య ఋగ్వేదములో పలుతావులయందు మనయెదుట కనులకుకట్టినట్లే తోచులాగున రమ్యముగా వర్ణింపబడినది. అరమతి, రోదసి యను నామములతో, కన్య, వేదమున నుటంకింపబడియున్నది. మరుత్తులేడ్వురకును ఈపడుచు సామాన్యభార్య.

“పరా, శుభ్రాయాసో, యవ్యా, సాధారణ్యేవ మరుతో మిమిక్షుః”
(ఋ. I- 167 - 4).

“దేవి, రోదసి మరుత్తులను సన్నిహితముగా నంటిపెట్టుకొని యున్నది” (VI-50-5)

పరా వీరా స ఏతన మర్యాసో భద్రజానయః
అగ్నితపో యథాసథ॥ ఋ V. 61 - 4.

వీరవరులారా! మరుత్తులారా! చక్కని పెండ్లికూతుం బరిగ్రహించిన పెండ్లికొడుకులార! దూరముగా నరిగి యగ్నిసమీపమున చలి కాచుకొండు!

భూతేశమండలమునందున్న రుద్రపుత్రులు, సప్తమరుత్తులకును కన్య సామాన్యభార్యయనియు, వారికి కొంతదూరములో అగ్నిగుండము (విశాఖ) కలదనియు నీవేదమంత్రములు స్పష్టము చేయుచున్నవి.

మఘ + పూర్వఫల్గుని + ఉత్తరఫల్గుని ¼ – కూడి సింహరాశి.
ఉత్తరఫల్గుని ¾ + హస్త + చిత్ర ½ – కన్యారాశి.

చిత్ర ½ + స్వాతి + విశాఖ ¾ – తులారాశి.

ఈనక్షత్రముల ఉదయక్రమము పరిశీలించినవారి కెవరికైన పైని వ్రాసినవరుస తప్పకుండ నీరిక్కలు తూర్పున పొడుచుచుండునని స్పష్టముకాగలదు. విశాఖ ఉదయమైనపిమ్మట నీచుక్కలను గమనించినచో, కన్యయదుగున విశాఖరూపమైన యగ్నిగుండమును, ఆపైన కన్యారాశి నక్షత్రములును కనబడగలవు. చిచ్చుబుడ్డినుండి తేజోవంతములై వెడలు మిణుగురులవలెనే మెఱయుచు, కన్యారాశిచుక్కలు విశాఖాగ్నిగుండమునుండి ప్రభవించినట్లు చూపరులకు తోచుట సహజము. జ్యోతిర్విదులైన కవిశేఖరులు, నక్షత్రరూపి కన్యారాశిని అగ్నికుండ సముద్భవ, అయోనిజ, అని సాభిప్రాయముగా వర్ణించి శ్లాఘ్యులైరి.

## మత్స్యయంత్రయుక్తి; దానినర్జునుడు భేదించుట

భారతకథను ఖగోళదృష్ట్యా సమన్వయించుకొనునప్పుడు మనదృష్టి యొకప్పుడు కథవంకను మరొకప్పుడు ఖగోళమువంకను, అవసరమును బట్టి ప్రసరింపచేయవలసి యుండును. ఇపుడు కథవంకకు మరలుదము. ద్రుపదకన్య, ద్రౌపదికి, వివాహయోగ్య వయస్సు వచ్చియున్నది. ద్రుపదుడామె నెవనికిచ్చి వివాహము చేయనెంచెనో, ఆ పాండవ మధ్యముడు, అర్జునుడు, మాతాసోదర సహితముగా లక్కయింట దగ్ధుడైమడిసెనని జనప్రతీతి. దైవజ్ఞులుమాత్రము, పాండవులు చనిపోలేదనియు, ఎందేని ప్రచ్ఛన్నులై యున్నారనియు నమ్మబలికి, ధైర్యముచెప్పి, ద్రుపదపురికి వారినాకర్షించుటకు మత్స్యయంత్రయుక్తి పన్నించిరి. ఈ యంత్రయుక్తి గర్భితమైన జ్యోతిశ్శాస్త్రమర్మము బహుప్రశంసార్హమైనది.

మత్స్యమనగా మీనము. మేషాది ద్వాదశరాసులలో కట్టకడపటి రాశి మీనము. మీనరాశిపటమిదుగో! ఇక్కడ చూడగలరు. ఇందు "మత్స్యద్వయంచేతి" రెండు చేపరూపములున్నవి. ఈచేపల తోకల మధ్య నేడువంకలుగల వింతపాశ మున్నది. పాశమునగల వంకర

లేదైనను, మధ్యగల బందులు (Joints) మాత్రము - అయిదే. ఈ యైదుబందులను భేదించుటకు బాణములు - అయిదు - అవసరము.

విశేషించి మీనరాశికి ప్రతిస్పర్థి (Diametrically opposite) - ఉత్తరఫల్గునీ నక్షత్రము. ఋగ్వేదములో ఫల్గుని నక్షత్రముల కర్జునీ నక్షత్రము లనియేపేరు. తూర్పున నుత్తరఫల్గుని ఉదయముకాగానే, పడమట మీనరాశి అస్తమించితీరవలెను. మత్స్యయంత్రమును భేదింప గలవీరుడు, ఉత్తరఫల్గునీ నక్షత్రరూపి - అర్జునుడొక్కడే. ఎక్కడనో ప్రచ్ఛన్నముగానున్న అర్జునుని ద్రుపదపురికా కర్షించుటకే, సాభిప్రాయముగా మత్స్యయంత్రయుక్తి పన్నబడినది. సామాన్యులు మోపెట్ట లేనివిల్లు ; దానికింతగిన బాణములైదు. (ఆది 7 - 170) పద్యము చదువుదము.

తరువోజ: ఈవిల్లుమోపెట్టి యేనుబాణముల
సీమత్స్యయంత్రంబు నేసినవాఁడ
భావజప్రతిముఁడీ బాలకుఁదగిన
పతి; యిదిమునిశక్తిఁ బడసినవిద్య,
గావున మీరిపుడు గావింపుడిదియ
ఘనతర కార్ముక కౌశలోన్నతియు
లావునుగలవారలకు నవసరము
లలితయశంబు గల్యాణంబుఁబడయ.

అనిధృష్టద్యుమ్నుండు ( ద్రౌపదిసోదరుడు ) అట సమావేశమైన రాజ పుత్రులకెల్ల నెఱుగంజెప్పె. (ఆది - 7 - 17)

ఇక పాండవుల వృత్తాంతము నారయుదము. ఆశ్వయుజ బహుళ అమావాస్యతో స్వాతికార్తెయంతమైనది. అటుపిమ్మట సూర్యోదయా త్పూర్వము స్వాతి ఉదయించి మెఱయు దినములు వచ్చినవి. ఏకచక్ర పురమున.వారు నివసించు గృహయజమాని బకునికి బండెడన్నము, రెండెనుపోతులు, ఒకమనుష్యుని పంపవలసిన ఇలువరస వచ్చినది. ఆయింట నున్నవారు మొత్తము నలుగురు. బ్రాహ్మణుడు, అతనిభార్య, అవివాహిత కూతురు, బాలకుడు కొడుకు. ఇందు ఎవరిని బకుని కాహార

ముగా పంపఁతగును? గోలయైనది. కుంతి యాసంగతి తెలిసికొని, బ్రాహ్మణుని దురవస్థ బాపుటకు భీముని నియోగించినది. భీముఁడు బకుని సంహారించెను. ఆ వృత్తాంత మిూవఱకే చర్చించితిమి.

బకవధయైన కతిపయదినములకు విదేశాగతుఁడైన బ్రాహ్మణుఁ డొకఁడు, ప్రచ్ఛన్నులైయున్న పాండవులకు, పైని వివరించిన ధృష్టద్యుమ్న ద్రౌపదుల యుత్పత్తి కథ నెఱింగించి, పాండవపరోక్షమున ద్రుపదుఁడు తనకూతునకు స్వయంవరము చాటించెననికూడ తెలిపెను. ఆ స్వయంవర మెప్పుడు జరుగునో, ఆవివరములేమో సంస్కృతమూలమున తెలుపబడలేదు. (చూ. చైత్రరథపర్వణి)

ఆది 167 - 54. ధృష్టద్యుమ్నః కుమారోఽయం ద్రుపదస్యభవత్పితి। కృష్ణేత్యేవాబ్రువన్ కృష్ణాం కృష్ణా భూత్సాహివర్ణతః

55. తథాతస్మిన్మహోత్సవే మనం జజ్ఞేద్రుపదస్య మహామఖే। ధృష్టద్యుమ్నం తు పాంచాల్య మానీయ స్వం నివేశనమ్......

అంతేకాని ఫలానానాఁడు స్వయంవరమనిగాని, నేటికిన్ని దినముల నాఁడు స్వయంవరమగుననికాని మూలగ్రంథమునలేదు. అయినను, జ్యోతిర్విద్యావిశారదుఁడు, నన్నయ వ్యాసుని లోపములను చక్కఁగా గమనించి శాస్త్రదృష్టాంతఖగోళదృశ్యములకును, కథకును అవిచ్ఛిన్నతం జేకూర్చి స్వీయవిజ్ఞాననిరతిని ధ్రువపఱచుకొనినాఁడు.

ఆది. 7 - 25 ... "పాండవులు పరలోకగతులుగారు పరమానందంబున నున్న వారు వార లెందుండియేనియు నిందులకు వత్తురు నీవును సుచిత్తుండవయి స్వయంవరం బిప్పురంబున ఘోషింపంబంపుమిది కన్యాదానంబునందు రాజులకు శాస్త్రచోదితంబనినం బురోహితువచనంబునం జేసియూ అదిల్లిద్రుపదుండు నేటికి నెబ్బదియేనవ దినసంబునం బౌషమాసంబునం బంచమియు రోహిణినాఁడు స్వయంవరంబని ఘోషింపంబంచి -"

కొన్నిముద్రితప్రతులలో, స్వయంవరము పదియేనవదివసంబునననని కలదు; కాని అదిశుద్ధతప్పు; పౌషమాసంబునందు అష్టమియు రోహిణి నాఁడని కొన్నిప్రతులలో గలదు. అదియు శుద్ధతప్పే. ఏమన్నఁగా అష్టమి

తిథినాడు రోహిణినక్షత్రము ఫాల్గునమాసమున తప్ప మరొకనాడు రాదు. శ్రావణమాసమున కృష్ణపక్షమున - కృష్ణాష్టమినాడు - అష్టమియు రోహిణియు రాగలవు. అది కృష్ణపక్షమున కాని శుక్ల పక్షమున కాదు. పాండవులు వారణావతపురము ఫాల్గునమాసమున శుక్లపక్షాష్టమిరోహిణినాడు ప్రవేశించిరని పైన చూచియున్నాము. పౌష మాసమున అష్టమియు రోహిణియు సంధానము కాజాలవు. కావున, పౌషమాసమున నష్టమియు రోహిణినాడు స్వయంవరమని పాదముతో ముద్రించిన భారతప్రతులు శుద్ధతప్పుపాఠ మిచ్చుచున్నవని సిద్ధాంతము చేయుచున్నాను.

పౌషమాస మనగా పుష్యమాస మని కొందరు తలంచుచున్నారు. అదికూడ చాలతప్పు. పుష్యమాసము వివాహమునకు యోగ్యముకాని శూన్యమాసము. అట్టిశూన్యమాసమున ద్రుపదుడు తనకూతు పెండ్లి తలపెట్టిననుట యసందర్భము. నన్నయభట్టు శూన్యమాసమున ద్రౌపదిపెండ్లియని వ్రాసెననుట ఆమహానుభావునియందు గొప్ప అపచారము గావించుటయని తెనుగువారు తెలిసికొనగలరు.

అట్లయినఁ బౌషమాసమున ద్రౌపదీస్వయంవరమని పైనివ్రాయుటకు అర్థమేమియని పాఠకులు ప్రశ్నింపగలరు. అది చాల మంచిప్రశ్న.

మన దేశమున మాసనామములు చాంద్రమానమునుబట్టియు సౌర మానమునుబట్టియుకూడ నిర్ణయింపబడుచున్నవి. చాంద్రమానపద్ధతిని పున్నమనాడు చంద్రుడు ఏనక్షత్రముతో కూడియుండిన నానక్షత్రము పేరిట నామాసనామ మేర్పడుచున్నది. చిత్రతో చంద్రుడు పున్నమ నాడు కూడియుండిన మాసము చైత్రమాసము. విశాఖ+పున్నమ - వైశాఖము ; శ్రవణము+పున్నమ- శ్రావణము ; కృత్తిక+పున్నమ - కార్తికము.

రెండవది - సూర్యుడేరాశిలోనున్న నారాసిపేరా నెలకుపెట్టుటయు గలదు - మేషమాసము వృషభమాసము మిథునమాసము మొదలగు నవి - రాశిమాసములు దేవతలలో పూషుడనువాడు రేవతీనక్షత్రమున కధిదేవతయని వేదము తెలుపుచున్నది. రేవత్యంతం మీనము. పూష

దైవత్యమైన రేవతితో సూర్యుడున్న మాసము పౌషమాసము. పైనపౌష మాసమని వ్రాసినదానికి మీనమాసమను నర్థము స్పష్టమగుచున్నది. చైత్ర ప్రారంభమున కొన్ని దినములు మీనమాసపు దినము లగును. పౌషమాసంబున పంచమియు రోహిణినా డనగా చైత్రశుక్ల పంచమి రోహిణినాడని యర్థము. ఆనాటి సూర్యాస్తమాన వేళకు తూర్పుటాకాశమున నుత్తరఫల్గునీ నక్షత్రము చక్కగా ఉదయమగును. పడమట మీనము స్తమించుచుండును.

కొదువరాసులతో పాటు మీనమాకాశమార్గమున గిరగిర తిరుగుచు చరించుచుండును. "వైహాయసంబైన వర మత్స్యయంత్రంబును" "ఏను శరంబుల నుత్తరీఫల్గునీ రూపుండైన అర్జునుండు అశ్రమంబున భేదించెను."

ఇట్లు భేదింపబడి మీనరాశి యదృశ్యమైనంతలోనే తూర్పున కన్యారాశి ఉదయించును. స్వయంవర రంగమున ద్రౌపది యావిర్భవించును. ఖగోళభూగోళములయందు ఏకకాలమున ద్రౌపది యర్జునునివరించును. ఆది 7 - 189:

సీ॥ ధరణీశనందనుల్ దన్నతిప్రీతితో, జూచుచునుండంగ సుందరాంగి ।
తోయజదళనేత్ర ద్రుపదరాజాత్మజ కమనీయగజరాజ గమనలీల ।
జనుదెంచి సురరాజుసన్నిభు నభినవ యౌవనోద్భాసితు న సితరత్న ।
రుచిరాంగు నంగజరూపుధనంజయు దనచేతి సితపుష్పదామకమున ।
బొలతి ముదముతోడఁ బూజించె.

ప్రాచీనఖగోళ చిత్రములలో సితపుష్ప దామాభిశోభితమైన కన్య రూపము కలదు.

సంస్కృతమూలమున లేకున్నను నన్నయభట్టారకుడు రెండువిధములుగా ద్రౌపదీస్వయంవర దినమును నిర్ణయించి పలికినాడు. అందు మొదటిది తిథినిర్ణయము - పౌషమాసంబున పంచమియు రోహిణి నాడని ఖండించి తెలుపుట; రెండవది నేటికిడెబ్బదిమైదవ దినమని వక్కాణించుట మొదటిది; తిథినిర్ణయమునుగూర్చి పైనిచర్చించి తెలిసికొంటిమి. రెండవది - డెబ్బదిమైదవ దినమనుటయెట్లు పొసగినది

ఎప్పటినుండి డెబ్బదియైదవదినమో మనముస్పష్టముగా తెలిసికోవలసి యున్నది.

| | | |
|---|---|---|
| చైత్రశుక్లపంచమినాడు ద్రౌపదీ స్వయంవరోత్సవము - | | |
| చైత్రశుక్లపాడ్యమి మొదలు పంచమివఱకు | = 5 | దినములు |
| ఫాల్గునమాసము పూర్తిగా | = 30 | ,, |
| మాఘమాసము పూర్తిగా | = 30 | ,, |
| పుష్యమాసము, అమావాస్యముందు | = 10 | ,, |
| | 75 | దినములు. |

పుష్యబహుళ పంచమినాడు విదేశాగతుడైన బ్రాహ్మణుడు పాండవులతో నేటికి డెబ్బదియైదవ దివసమున ద్రౌపదీస్వయంవరమని తెలియపలికెను. ఆ పంచమినాటికి పాండవులు ఏకచక్రపురమున నజ్ఞాతముగా నుండిరి. అప్పటికి బకవధయైనది. బకాసురుడు కార్తికశుక్లపక్షము దినములలోనే వధింపబడినాడు. అప్పటికి స్వాతినక్షత్రము సూర్యోదయాత్పూర్వమే తూర్పుటాకాశమున నుదయించి పగడమువలె నెఱ్ఱనికాంతులతో చక్కగా మెఱయుచు దర్శనీయమై యుండును. బకవధానంతరము - కతిపయదినములలో - విదేశాగత బ్రాహ్మణుడు స్వయంవర వృత్తాంతము పాండవుల కెఱింగించెను. బకవధ, ద్రౌపదీ స్వయంవర వృత్తాంతములను, కథావృష్టితోనేగాక ఖగోళసమన్వయ దృష్టితోకూడ జాగ్రతగా పరిశీలించి, ద్రౌపదీ స్వయంవరోత్సవము నేటికిడెబ్బది యైదవదినమున నగునని దినసంఖ్యానిర్ణయమును, పౌష మాసంబున పంచమీరోహిణినాఁడని తిథినిర్ణయముగావించి, ఈ యుత్సవకాలనిర్ణయము నిరూపించి నన్నయస్పష్టముగా ప్రవచించి నాడు. అట్లువక్కాణించుటలో, వ్యాసముని ప్రణీతపరమార్థమును - మహాభారతబద్ధ నిరూపితార్థము నేర్పఱచుచు, నన్నయభట్టారకుడు, స్వకీయ విజ్ఞాన నిరతిని, జ్యోతిర్విద్యావివేకమును, శేముషీధౌరంధర్యమును తెనుగుభారతమున చక్కగా వెల్లడిచేసి, మూలమునగల లోపములను పూరించి, తీర్చిదిద్దినాడు.

# ద్రౌపదీ వివాహము

మత్స్యయంత్రమును తెగనేసి, ద్రౌపదిచేతి పుష్పదామపూజితుడైనయర్జునుంజూచి యసూయాగ్రస్తులై కర్ణశల్యాదులు భీమార్జునులందలపడి, పరాజితులై వెడలిపోయిరి. భీమార్జునులు ద్రౌపదిం దమతో దోడ్కొనివచ్చి మేమొక్క భిక్ష తెచ్చితిమని తల్లి కుంతి కెఱింగించిరి. అట్లేని మీరేవురు నుపయోగింపుడని మామూలుగా కుంతినోటితోనని పైకివచ్చిచూడగా, భువనత్రయ రాజ్యలక్ష్మివలె నున్న ద్రౌపదిం జూచి లజ్జపడి పరితపింపజొచ్చెను. పాండవు లందరికి నామెయందు పత్నీ భావము కలిగినది - వేదయుగమున మరుత్తులేడ్వురకు భార్యయైన కన్యయందు భారతకాలమునాడు పాండవుల కైదురకును పత్ని భావము కలుగుట యేమివింత ? ఆది 7. 211, 212 విధిప్రేరణంబునంజేసి

ఉ॥ ఆ లలితాంగియందు హృదయంబులు దృష్టులు నిల్పి పాండు భూ
పాల తనూజపంచకము పంచశరాహతిఁ బొందె నొక్కతన్
బాలికఁ దొల్లి యేవురకు భామినిగా సృజియించియున్నయ
య్యాలరి బ్రహ్మచెయ్వుపరమార్థము గాకదియేల యొండగున్ ॥

ప్రచ్ఛన్నులై పాండవులు బసచేసిన కుంభకారమందిరమున ద్రౌపదియందు వారందరు బద్ధానురాగులైయుండగా, భీమార్జునులపిరుందనే ధృష్టద్యుమ్నుడు పితృనియుక్తుడై వచ్చి పాండుకుమారులకు తెలియరాకుండ వారిసంగతులు కనిపెట్టి తండ్రికి నివేదించెను.

పిమ్మట ద్రుపదుడు తనపురోహితునంపి వారలనిమ్ముగా నెఱుంగ వేడెను. యుధిష్ఠిరు డతనితో "మీరాజు నభీష్టము నెఱవేఱెనని" వ్యంగ్యముగా పలికెను. ఆతరువాత చాతుర్వర్ణ్యోచితంబులైన రథంబులుగొనిపోయి, తండ్రియాజ్ఞానుసారము ధృష్టద్యుమ్నుడు పాండవులను తోడ్కొనివచ్చెను. ద్రుపదుండు వారలను యథోచితముగా గౌరవించి "మీరెవ్వరో కలయూపు ఎఱుగబలుకుడ" ని వేడెను.

"క్షత్రియులము పాండుప్రియపుత్రులము..." అని ధర్మజుడు ద్రుపదునికి తమసంగతియావత్తును విశదముచేసెను. ద్రుపదుడు ధృతరాష్ట్ర

దుర్యోధనులనిందించి, సామప్రియ భాషణంబుల నభీష్టసత్కారంబులను బూరించి పూజించి యొక్కనాఁడు ద్రౌపదిని అర్జునునకిచ్చి వివాహముగావింపవలెనని ప్రసంగించెను.

సంస్కృతమూలమునగూడ నిశ్లేషస్పష్టముగా గలదు.

ఆది. 195 - 18.

"తతఃకుంతీచ కృష్ణాచ భీమసేనార్జునా వపి
యమౌచ రాజ్ఞాసందిష్టం వివిశుర్భవనం మహత్"

19 - "తత్ర తేన వసన్ రాజన్ యజ్ఞసేనేన పూజితాః
ప్రత్యాశ్వ స్తతో రాజాసహ పుత్రైరువాచతమ్"

మత్స్యయంత్ర భేదన మైనతరువాత పాండవులు ద్రుపదగృహమున నెన్నాళ్ళుండిన పిమ్మట అర్జునునికి ద్రౌపదినిచ్చి వివాహము చేతుమని ద్రుపదుఁడు ప్రస్తావించెనో స్పష్టముకాలేదు. కాని మత్స్యయంత్రము కొట్టిననాడే పెండ్లికాలేదనుట నిశ్చయ మనుటకు పై వాక్యములను ఎత్తి వ్రాసితిని.

తెనుగుదేశమున పెక్కుభారత ముద్రితప్రతులలో పౌషమాసంబున నష్టమీరోహిణీనాఁడు ద్రౌపదీ స్వయంవరమని యున్నది. వివాహమునాడుకూడ రోహిణీనక్షత్రమేనట! ఆది. 7 - 281.

గీ॥ నేడు పుణ్యదినము నెమ్మితో రోహిణీ।
యుక్తుడై శశాంకుడున్నవాడు।
మంత్రవంతముగ క్రమంబున నేవురు।
పెండ్లియగుఁడు కృష్ణఁ బ్రీతితోడ॥

అని యున్నది. ఇదియేనాటి రోహిణి? మత్స్యయంత్ర భేదన మైన పిమ్మట నెన్నాళ్ళకు వచ్చిన రోహిణి? ఈ ప్రశ్నకు ఉత్తరము కనబడదు. వివాహవేళసంస్కృతమూలమున రోహిణి ప్రస్తావనయేలేదు.

ఆది. 198 - 5॥

తతో బ్రవీద్భగవాన్ ధర్మరాజ మద్యైవపుణ్యాహముతవః
పాండవేయాః। అద్యపౌష్యం యోగముపైతి చంద్రమాః
పాణిం కృష్ణాయా స్త్వం గృహాణాద్యపూర్వమ్॥

అని యున్నది. వ్యాఖ్యానములో పౌష్యం పుష్యాయయహితం బహు సంతతిప్రదమిత్యర్థః. సంస్కృతమూలమున నిట్లున్నదానిని మూర్చి ద్రౌపది వివాహము రోహిణీనక్షత్రమున జరిగినట్లు నన్నయభట్టేల వ్రాసియుండును? ధృష్టద్యుమ్నుడువచ్చి పాండవులసంగతి కనిపెట్టి తండ్రితో చెప్పుట; ద్రుపదపురోహితుడు వచ్చి పాండవులం జూచి పోవుట; చాతుర్వర్ణ్యోచిత రథములతోవచ్చి ధృష్టద్యుమ్నుడు పాండవులను తమగృహమునకు తోడ్కొనిపోవుట; పాండవులకు ద్రుపదునితోనైన సంవాదము; పిమ్మట నొకనాడు వివాహ ప్రస్తావన; ధర్మరాజునకు ద్రుపదునితోనైన సంవాదము; ద్రుపదుడు ఆలోచించి 'ఎల్లినిశ్చయింతమనుట' (ఆది 7 - 244); పిమ్మట వ్యాసుడు వచ్చుట; ద్రుపదుడు తనసంశయము వ్యాసునకెఱిగించుట ఆది 7 - 255; వ్యాసుని ప్రత్యుత్తరము.

"సీ॥ ధర్మతత్త్వజ్ఞుడీ ధర్మతనూజుండు ధర్మమార్గంబేల తప్పబలుకు।
దేవతామూర్తి యిద్దేవి మాధవియొ తానేటికిం గర యనృతంబు
వలుకు?।
వీరలపలుకులు వేల్పులమతమును నొక్కండ కావున నొండుదక్కి।
యియ్యేవురకుం గూతునిచ్చి వివాహంబుగావింపు"

మనిబోధించి, రహస్యముగా ద్రౌపది పూర్వవృత్తాంతమును కృష్ణద్వైపాయనుడు ద్రుపదున కెఱింగించెను. పిమ్మట పంచపాండవులకు పత్నిగా తనకూతునిచ్చి వివాహముచేయుటకు ద్రుపదుడంగీకరించెను. వివాహము యథావిధిగ జరిగినది. ఎప్పుడు జరిగినదనిప్రశ్న. మత్స్యయంత్రము నర్జునుడు తెగనేసినపిమ్మట, కృష్ణద్వైపాయనుడు ద్రుపదునింటికివచ్చి కర్తవ్యము బోధించునంతకు మధ్యకొన్నిదినములు వ్యవధానము అత్యావసరము. చైత్రశుక్లపంచమియు, రోహిణీనాడు మత్స్యయంత్రము భేదింపబడినది. మరునాడు మృగశిరాయుక్తమైన షష్ఠి. ఆనాడుద్రుపదుని యాజ్ఞానుసారము ధృష్టద్యుమ్నుడు చాతుర్వర్ణ్యోచిత రథములంగొనివచ్చి, పాండవులను రమ్మని యాహ్వానింపగా, క్షత్రియోచిత రథముల నెక్కి, కుంతీపాంచాలీ సహితముగా వారు ద్రుపదు

గృహమున కరిగిరి ద్రుపదుడు వారికి స్వాగతమిచ్చి వారి 'కులరూపు' ధర్మజువలన నెఱిగి, సంతోషించి, ధృతరాష్ట్ర దుర్యోధనుల నంపెంచెను. ఆమరునాడు ఆర్ద్రతో సప్తమితిథి - విశ్రాంతి దిన మనుకొందము. నాలుగవదినము పునర్వసుతో అష్టమికాని నవమికాని కావచ్చును. ద్రౌపది నర్జునునికిత్తునని ద్రుపదుడును, ఒక్క అర్జునునికే కాదు ఐదుగురకు నిమ్మని ధర్మరాజును వాదించుకొనిరి. కర్తవ్యము మరునాడు నిశ్చయింత మని ద్రుపదు డనెను. అంతలో వేదవ్యాసుడు వచ్చి ద్రుపదునితో రహస్యముగా మాటలాడి, పూర్వవృత్తాంతమంతయు తెలిపి, చూపి, పంచపాండవులకు పత్నిగా ద్రౌపదినిచ్చి పెండ్లి చేయుటకు ద్రుపదునిచేత నొప్పించెను. మరుచటిదినము దశమి, పుష్యమితో ద్రౌపదివివాహమని మూలభారతమున వ్యాసుడు వ్రాయుట యుక్తియుక్తముగా నున్నది. ఈవాక్యమును నిరాకరించి, అందుకు వ్యతిరేకముగా రోహిణినక్షత్రమున ద్రౌపది వివాహమని నన్నయ వ్రాయుటకు కారణమేమి ? ఆరోహిణి యేనాటిరోహిణి ? మత్స్యయంత్రము నేసినరోహిణినాటి పిమ్మట నెలనాటి రోహిణినాడా ? ద్రౌపది వివాహము ? ఇంకను మరికొన్ని నెలలనాడా ? ఇట్లు విలంబ మగుటకు కారణ మేమి ?

ఈవిధముగా పెక్కుశంకలకు కారణమగును - రోహిణితో ద్రౌపది వివాహమనువాక్యము. మూలమునందు పుష్యయోగమున ద్రౌపది పెండ్లియయ్యెననునది మార్చివైచి రోహిణినాడు వివాహము జరిగెనని వ్రాయుటకు నన్నయభట్టునకు ఏమియవసరము వచ్చినది ? ఈమార్పు నెట్లుసమర్థించుకోవలెను ? నాకు బోధపడలేదు. విజ్ఞులువిమర్శింపవేడుచున్నాను. కొండనుత్రవ్వి యెలుకనుపట్టినట్లు ఈ సవరణమేల ? దీని సమర్థించుటేల ? "నేడు పుణ్యదినము నెమ్మితో రోహిణీ, యుక్తుడై శశాంకుడున్నవాడు" అనుపద్యములో 'రోహిణీ' యనుటకు బదులుగా 'పుష్యమి' యనినచో ఛందోభంగములేదు; సందర్భములన్నియు బాగుపడును; జ్యోతిశ్శాస్త్రయుక్తముగానుండును. నన్నయ్య పుష్యమీ యనియే వ్రాసియుండును. రోహిణీ యనుటలో తప్పు గోచరింపక,

లేఖకప్రమాదము క్రమముగా దేశవ్యాప్తమై యసందర్భము నడించినది. పుష్యమీ యనుటచే మూలము ననుసరించియుండి సమస్త మును చక్కబడును గావున, "నేడు పుణ్యాదినము. నెమ్మితో పుష్యమీ యుక్తుడై శశాంకు డున్నవాడ"ని సవరణచేయుట మిక్కిలి యవసర మని విన్నవించుచు ద్రౌపదీ వివాహ నక్షత్రచర్చ చాలించుచున్నాను.

## ఖగోళదృష్ట్యా ద్రౌపది పంచపాండవ పత్నియని నిరూపించుట

ఖగోళదృష్ట్యా, మేషాది పండ్రెండురాసులలో కన్యారాశి ద్రౌపది యని ఇంతకుముందు పలుసారులు ప్రవచించియుంటిమి. ద్రౌపది, పాంచాలరాజు, ద్రుపదుని యజ్ఞకుండ సముద్భవ; అయోనిజ. కన్యా రాశియన్ననో ఇంద్రాగ్ని దైవత్యమైన విశాఖాగ్ని వేదికాసముద్భవ; అయోనిజ. మత్స్యయంత్రమునేసిన వీరుని పెండ్లాడుదునని ద్రౌపది ప్రతిజ్ఞ. అర్జునుడు మత్స్యయంత్రము తెగనేసెను. అయినను, అర్జునునే గాక, అతనిసోదరులు ధర్మజభీమ, నకులసహదేవులంగూడ ఆమె పెండ్లాడి, ఆ యైదుగురకును ఆమె ధర్మపత్నియైనది. ఈయంశముకూడ తేజోగ్రగణ్యములైన (First Magnitude Stars) నక్షత్రములతో మెఱయు ఖగోళము ఎంతో చక్కగా ప్రదర్శించుచున్నది.

స్థూలదృష్టికి మనకగపడుచు మింటమెఱయు చుక్కలు సుమారు ఎనిమిదివేలు ఉన్నవని మనమీసరికె తెలిసికొంటిమి. అందు కాంతి సంపదయందు అగ్రగణ్యములని యెన్నదగినచుక్కలు సుమారు ఇరువదిమాత్రముగలవు. పడమటిఖండముల జ్యోతిర్విదులు వానిని (First Magnitude Stars) అందురు. ఉత్తరఫల్గునీనక్షత్రము (బీటా లియో; డెనిబోలా) తేజోవిషయమున నగ్రగణ్యమైనదేనని గ్రీసు, రోము, అరేబియాలోనగు దేశములలో జ్యోతిర్విదులు ప్రాచీన గ్రంథములందు ప్రశంసించిరి. మూలభారతము రచింపబడునాటికిని, నన్నయ తెనుగుభారతము రచించునాటికినిగూడ ఉత్తరఫల్గుని తేజో గ్రగణ్యమైయుండియు, పిమ్మట తేజము మందగించి, కాంతిసంపద కొంత గోల్పోయి, రెండవతరగతి చుక్కలజట్టులోనికి దిగజారినది

(Deteriorated to a Second Magnitude Star). అంతకు పూర్వమీ ఫల్గుని తేజోగ్రగణ్యామే యయి మిక్కిలి మెఱయుచుండెను. ఫల్గునీ నక్షత్రములకు వేదములో అర్జునీ నక్షత్రములనియే పేరు (చూ. ఋ. X. 85 – 13) కన్యారాశిం బరివేష్టించియుండి, ఆమెచుట్టును తేజోగ్ర గణ్యములై మెఱయు చుక్కలైదు – (1) మఘ. (2) ఉత్తరఫల్గుని. ఇవి రెండును సింహరాశికి చెందినవి. (3 స్వాతి. తులారాశిలో మాణి క్యమువలె నెఱ్ఱగా మెఱయు నక్షత్రము. ఈమూడును ఉత్తరమున కన్యరాశి కుడిప్రక్క మెఱయునవి. కన్యకు దక్షిణముగా నెడమప్రక్క అశ్వతరమండలములోని జంటచుక్కలు మిక్కిలి మెఱయుచుండును. పై యైదింటిలో మఘానక్షత్రము ధర్మరాజు. మఘకు పితరు లధి దేవతలు. పితరులరాజైన యమునియంశమున జన్మించుటచేత యుధి ష్ఠిరుడు మఘానక్షత్ర స్వరూపుడన జెల్లును. ఉత్తరఫల్గుని యర్జునుడు. మీనరాశికి ప్రతిస్పర్థియై, మత్స్యయంత్రము నేసి ద్రౌపదిని పాండవుల నిమిత్తము సంపాదించిన పాండవసింహము అర్జునుడే. ఉత్తరఫల్గుని నాలుగుపాదములలో ఒకపాదముమాత్రము సింహరాశిలోనిది; తక్కిన మూడును కన్యరాశిలోనివి. అట్లగుటచేతనే కాబోలు ఫల్గునుడు నృత్య గీతప్రియుడు ; ఊర్వశిం దిరస్కరించి శప్తుడై యొక సంవత్సరము షండు డై యుండి విరటపురమున స్త్రీజనమధ్యమున ఉత్తరకును, తోడిరాచ కన్నియలకును నృత్యగీతముల నేర్పుకోవలసివచ్చెను. 3. స్వాతి – వాయుదైవత్యమైన నక్షత్రము; భీమసేనుడు. బక, కిమ్మీర, కీచకాదు లంజంపిన పోటుమానిసి. 4 – 5 అశ్వతరచుక్కలజత. అశ్వినీదేవతలు గార్దభవాహనులు. అశ్వతరమనగా కంచరగాడిద. దానిపై స్వారిచేయు వేల్పువెజ్జులు అశ్వినీదేవతలు. వారివలన మాద్రికి జన్మించినవారు నకులసహదేవులు. కాంతిసంపదయం దగ్రగణ్యములైన యీ యైదు నక్షత్రరాజములమధ్యను కన్య – ద్రౌపది – పంచపర్వతముల నడుమ నదింబోలె మెలగినది. ఇంద్రియంబులు విషయరతిం బరిగ్రహించినట్లు పంచపాండవు లామెను పరిగ్రహించిరి. నక్షత్రవేధ చేయువారికి ముందుగా తూర్పున సింహరాశి యుదయించుటయు పిమ్మట కన్య

ఉదయమగుటయు కనబడును. ద్రౌపది రుద్రపత్ని; దుర్గాంశ సంభూత: కన్య అగ్నికుండ సముద్భవయని చక్కగా వర్ణింపబడినది. కన్య దిగువ నున్నది తులారాశి. అడుగునతులారాశియు, దానిపై కన్యారాశియు కానవచ్చుటచేత, కన్య తులజయనిగూడ వర్ణింపబడినది. బొంబాయి రాష్ట్రములో తులజాపురమున సుప్రసిద్ధమైన భవానీదేవాలయమున్నది. తులజయైనభవాని శివాజీకి ప్రత్యక్షమై తనపేరున భవానీనామ ఖడ్గ మొసంగి మ్లేచ్ఛ వధకు శివాజీని పురికొల్పుటయు చరిత్ర విషయము.

విశేషించి, వైశ్యులు తులాజీవులు. తులజయైన కన్యకాపరమేశ్వరి కోమట్లకు కులదేవత. దుర్గకు కేతనము సింహము. ఈయంశమును శ్రీనాథ కవిసార్వభౌముడు శివరాత్రిమహాత్మ్యమునందలి యీదిగువ పద్యమున నెంతో చక్కగావర్ణించినాడు. (చూ. శివరాత్రిమహాత్మ్యము)

గీ॥ ప్రతిభ సతతంబు గొల్తురు భద్రకాళి
దసదినంబులు సింహకేతనమునిలిపి
జగతినేబదియారు దేశములవారు
హూణభూమికి దైవమీయుత్పలాక్షి. *

## దుశ్శాసనునిచే ద్రౌపది భంగపడుట

భారతము పంచమవేదము. 'భారతశ్రుతివిధాత' యైన వేదవ్యాసుడు భాగవతపీఠికలో 'భారతమిషమున పలికితి వేదార్థ భావమెల్ల' నని ప్రవచించియున్నాడు. ఋగ్వేదము జాగ్రతగా చదివిన వారికి మాత్రము ఆవాక్యార్థము చక్కగా బోధపడును. ఏవేదఘట్టము నుండి ఏభారతఘట్ట మావిర్భవించెనో కొంచె మోపికగా చదివినవారికి

* హూణభూమి యనగా Christian World) హూణశక మనగా క్రైస్తుని మృతి A. D. సంవత్సరవిధము. 1953 హూణశకవత్సరసంఖ్య. కన్యరాశిహూణభూమికి దేవత. ఏసుక్రీస్తుంగన్న (Virgin Mary) కన్యమేరీ అమ్మకూడ ఈమెయే. వేదయుగమునాడు అరుమతి, రోదసి: పిమ్మట రుద్రపత్ని. దుర్గ. భద్రకాళి; ద్వాపరమున ద్రౌపది; ఇటీవల ఏసుక్రీస్తుంగన్న కన్య (Virgin). 500 సంవత్సరముల క్రిందట శ్రీనాధుడు చెప్పిన సంగతి ఇటీవల కార్పెంటరు (Dr. Carpenter) మొదలగువారు స్థిరపరిచిరి.

భేరులతో స్వపురి కరుగుదెంచుచుండెను. ఆ శుభవార్త నాకర్ణించిన వెంటనే మహారాణి వీనస్ దేవాలయమునకువెళ్ళి, శిరోజములు తీయించి వైచుకొని, మ్రొక్కుబడి చెల్లించెను.

టాలెమీ మహారాజు విజయగర్వముతో పురప్రవేశముచేసి, అంతఃపురముజొచ్చి ప్రియురాలిం జూచుసరికి — ఏమున్నది? తల వాంచి బోడితలతో నామె యతని యెదుటబడెను. రాజు నివ్వెరపడి కారణమడిగెను. ఆవృత్తాంత మామెనోటనువిని, ఆమె పాతివ్రత్యమును మెచ్చుకొనెనుగాని, కురూపమునకు మిక్కిలి చిన్నవోయెను. రాజు, గుడికిపోయి, భార్య కేశములను చూడగోరెను. కాని గొఱిగిన వెంట్రుకలు ఏ వెంటమీదకు పోయినవో! దేవాలయములో నల్లే యుండవుగదా? పూజారిని బిలిపించి రాజు కేశములనుగుఱించి పృచ్ఛచేసెను. పూజారి మంచిసమయస్ఫూర్తిగలవాడు "మహాప్రభూ! పతివ్రతాతిలకము - మహారాణీగారి కేశజాలము భగవంతుడు తనసమక్షమున భద్రపఱచినాడు. చూడుడ"ని కన్యారాశి కుడిప్రక్క చికురజాలమువలె మెఱయుచున్న వేణీమండల దృశ్యము చూపించెను. ఇట్టి దేవతానుగ్రహమునకు రాజు మిగుల ప్రీతుడయ్యెను. అటుపిమ్మట ఇరాటాస్థినీస్ జోస్యులు ఈచుక్కలగుంపును (Coma Bernices) పేరుతో పడమటివారి చుక్కలపట్టీలో చేర్చెను.

వేణీమండలము కన్యారాశి ప్రక్కనే మెఱయు బహుసహస్రాబ్దములనుండి భారతీయులకు తెలిసియున్నది. ఈవిధముగా భారతసంహితయందు నితిహాస రూపమునను, ఖగోళమున నక్షత్ర రూపమునను, పాండవులకథ ద్రౌపదీ కన్యాస్వరూపముతోను, వేణీసంహార వివరములతోను. కూడుకొని, విననింపుగ, చూడసొంపుగ మింట తేజరిల్లుచు, దర్శనీయమై యొప్పుచున్నది.

కన్యారాశి తరువాతరాశి తులారాశి. కన్యారాశిప్రశంసఇంతటితో చాలించి, తులారాశిం బ్రశంసింపబోదము. తులారాశి శిబిచక్రవర్తి కథ నద్భుతముగా [illegible]వుచేయుచు నుడువీధిని చక్కగా మెఱయుచున్నది. కావున నమ్మహాత్యాగిని సందర్శింతము.

## ౧౫ - తులారాశి; శిబిచక్రవర్తి కథనము

అశ్విన్యాదిగాగల యోగతార లిరువదేడింటిలో, చిత్ర, స్వాతి నక్షత్రముల తరువాత వచ్చునది విశాఖ. అయ్యది జోడువేల్పులరిక్క: "విశాఖానక్షత్ర మింద్రాగ్నీ దేవతా" అని నక్షత్ర ఇష్టిశ్రుతి తెలుపుచున్నది. అగ్ని పావురరూపము ధరించెను; దానిం దఱుము కొనుచు డేగయై ఇంద్రుడు వెంటనంటి వచ్చుచుండెను. వచ్చివచ్చి, కపోతము శిబిచక్రవర్తి నాశ్రయించ శరణు వేడెను. శిబియా పావుర మును చేరదీసి యభయమిచ్చెను. అపుడు శిబికి శ్యేనమిట్లనియె: "సర్వ భూతంబులు నాహారంబున జీవించి వర్ధిల్లు నిదినాకు భక్ష్యంబుగాని నాడు బుభుక్షా వేదనం జేసి ప్రాణవియోగం బగునట్లయిన నాపుత్రులు భార్యయు జీవింపనేర రొక్కకపోతంబు రక్షించి పెక్కుజీవంబులకు హింసచేయుట ధర్మవిరోధంబు ... ఇక్కపోతంబు నాకు వేదవిహితం బైన యాహారంబు "శ్యేనాః కపోతాన్ ఖాదయంతి" యను వేద వచనంబుగలదు గావున నిది నాకాహారంబు గావలయు నిమ్మనిన దానికి శిబియిట్లనియె. ఆది. 3 - 229, 231

ఆది. 3 - 233. "... శరణాగత పరిత్యాగంబునకంటె మిక్కిలి యధర్మంబొండెద్ది? నీయాకలి దీనన కాని యొంట నుపశమింపదే? నీయత్నం బాహారార్థంబయ్యేనేని యిప్పుడివ్వనంబున మృగమహిష వరాహ ఖగమాంసంబులు దీనికంటె మిక్కిలిగాబెట్టెద నిక్కపోతంబు వలని యాగ్రహంబు విడువుము. దీని నేనెట్లును విడువననిన శ్యేనం బిట్లనియె.

(ఆది. 3 - 234)... ఇప్పక్షిఁబూని కావనీకు బుద్ధియేని...
దీని యంతనీమాంసంబు దూఁచినాకుఁబెట్టు తొలఁగకిపుడు.

235-చ॥ అనిన ననుగ్రహించితి మహావిహగోత్తమయంచు సంతసం॥
బున శిబి తక్షణంబ యసిపుత్రిక నాత్మశరీర కర్తనం
బనఘుడుసేసి చేసి తనయంగమునంగల మాంసమొల్లఁ బె
ట్టినను గపోతభాగమ కడిందిగడించుచు నుండెనత్తులన్॥

236. క॥ దానికి నచ్చెరువడి ధరణీనాథుడు తనువునందు నెత్తురుదొరగం
దానతుల యెక్కెనంతన్వాని గుణోన్నతికిమెచ్చి వాసవదహనుల్ ॥

శ్యేన కపోతరూపంబులువిడిచి నిజరూపంబులుజూపిరి. శిబిచక్రవర్తి ఇంద్రాగ్ని దేవతలు చేసిన అగ్నిపరీక్షకాగి, నిలిచి యాదేవతలం గెల్చిన ఋజుమార్గుడు. ధర్మమూర్తి సర్వసముడు. శాస్త్రదృష్ట్యా యా మహనీయుని సర్వసమత్వము నిట్లు నిరూపింతము. సూర్యుడు తులారాశిం జేరునప్పటికి భూగోళ ఖగోళ పరిస్థితులన్నియు నెట్లు సమగతి చెందునో ఇంచుక పరిశీలింతము. గ్రీష్మఋతు దినములలో పగలు దీర్ఘము; రాత్రికాలము చాలతక్కువ. హేమంతఋతు దినములలో :రాత్రిఎక్కువ; పగలుతక్కువ. రెండిటికిమధ్య తులా మాసమున దివారాత్రములు సమముగా నుండగల విషువత్పుణ్య కాలము సంభవించును. అదేవిధముగా నప్పటికి గ్రీష్మతాప మంతరించి చలి ప్రారంభింపక శీతోష్ణములు సమగతిచెందియుండును. గ్రీష్మ ములో జలాభావముచే బాధింపబడు లోకులకు జలసమృద్ధియై హాయి గలుగును. వర్షపాత వర్షరాహిత్యబాధలు సమములమగు; ఖగోళమున ద్వాదశ రాసులలో తులారాశి మధ్యనుండి, రాశివిభాగమునకు సమత నొసగుచున్నది. స్వాతివఱకు ఖగోళపు టుత్తరార్ధమున మెఱయు చుండు యోగతారలు, విశాఖకడవి-విశాఖలై, వేరొక శాఖా మార్గమున బోవుచున్నట్లు దక్షిణమువంక తిరిగును. విశాఖమొదలు, అనురాధ, జ్యేష్ఠాదినక్షత్రములు దక్షిణఖగోళమున మెఱయుచుండుట చేత నుత్తరదక్షిణ నక్షత్రవిభాగముకూడ విశాఖకడ సమగతిం జెందునని తోపగలదు. ఇట్లు భూగోళ ఖగోళములందన్ని విషయము లందును తులామాసమున సమగతి గోచరించును. కాబట్టి నక్షత్రముల కన్నిటికి విశాఖ యధిపతియని చక్కగా తెలుపబడెను. ఇట్టితులారాశికి శిబిచక్రవర్తి ప్రాణము వంటివాడు. సర్వసమత ఆమహనీయుని జీవ సూత్రము. అతనిని శరణుజొచ్చిన కపోతము నతడు రక్షించితీరును. ఆ కపోతమును తఱుముకొనివచ్చిన శ్యేనము మాత్రమూరకుండునా? అదిసామాన్య శ్యేనమా? వేదవిజ్ఞానమును పూర్తిగానెఱిగిన ఇంద్ర

శ్యేనము. ఈనాటి వైజ్ఞానికులకు తెలిసిన (Struggle for existence) జీవనార్థమైజరుగు పోరాటముసంగతి యాశ్యేనమునకు వేదప్రమాణ సహితముగా తెలిసియున్నది. "డేగ పావురమును తిని బ్రతుక వలసినది" "శ్యేనాః కపోతాన్ ఖాదయంతి" యని శ్రుతి ప్రమాణము నుగ్గడించుచు నాశ్యేనము (నార్టన్ బారిష్టరువలె) నిశితముగా తనపక్షమున వాదించినది. అరవిందఘోష్ పక్షమున బారిష్టరు త్యాగమూర్తి చిత్తరంజనదాసువలె శిబిచక్రవర్తి తాను శరణమునిచ్చిన కపోతపక్షమున నంతకంటె యుక్తియుక్తముగ వాదించెను. జీవనార్థమై పోరాటము ప్రకృతిసిద్ధము.

* గీ॥ "ఎట్టికష్టజంతువేనియు దేహంబు।
విడుచుచోట పెనగబడునకాదె।
సమ్మతించి చావజాలదు..."

శ్లో॥ అవశ్యం ప్రాణినాం ప్రాణారక్షితవ్యా యథాబలమ్॥ ♦

డేగకు పావురము ఆహారమే. కాని యీ పావురమును పట్టుదలతో తిననగాని నీ ఆకలి తీరదా? ఈపావురముకంటె నెక్కువ మాంసము పెట్టింతును. అదితిని, నీయాకలి బాపుకొనుమని శిబి డేగకు జవాబు చెప్పెను. "ఈపావురమును రక్షింప బుద్ధిగలదేని, నీశరీరమునుండి దీని యెత్తుమాంసము తూచియిమ్మ"ని డేగ షరతుపెట్టెను. శిబి యందు కంగీకరించెను. ఎంతమాంసము కోసిపెట్టినను, పావురమున్న (Scalepan) త్రాసు కుదుకమీదికి లేవక, దిగువనే వ్రేలాడెను.

తుదకు శిబి తానే స్వయముగా తులనెక్కెను. ఇంతటి మహాత్యాగమునకు ఇంద్రాగ్ను లోడిపోయి, తమస్వరూపములతో ప్రత్యక్షమై, శిబి ధర్మనిరతిని శ్లాఘించి, యతనికి నక్షత్రస్థానమిచ్చిరి. జౌశీనరుండగు శిబి తానుధర్మముకొఱకు ఎక్కిన తులతోకూడ ఖగోళమున మెఱయుచు ఇప్పటికి దర్శనీయుడై యొప్పుచున్నాడు. ఆరణ్య 131

* అనంతామాత్య; భోజరాజీయము IV —
♦ వాల్మీకిరామాయణము యుద్ధకాండము తొమ్మిదవసర్గ. 14 శ్లోకము.

34. శ్లో॥ ఉశీనరోపి ధర్మాత్మా ధర్మేణా వృత్యరోదసీ।
విభ్రాజమనోవపుషా ప్రారురోహాత్రి విష్టపమ్॥

భారతమిట్లు ఘోషించుచున్నది. గ్రీకులకు తులారాశి లేనేలేదు. వారి రాసులు పదునొకండే. తులచక్కలు గ్రీకు వృశ్చికరాశి డెక్కలలో నిమిడిపోయినవి. రెండురాసుల పొడుగుననున్న పెద్దతేలుకుట్టినకాని గ్రీకుల గొప్పయోధుడు (Orion) చావడు గనుక గ్రీకులు మనతులా వృశ్చికరాసులనేకముచేసియొక్క-రాసిక్రింద తయారుచేసికొనిరి. పిమ్మట రోమనుకవి (Virgil) తులారాశి నేర్పరించి 'లిబ్రా' (Libra) యని పేరిడెను. అయినను గ్రీకులకు అసలులేని తులారాశినిగూడ "Ocfourse" మనము గ్రీకులనుండి నేర్చుకొంటిమని తెలుపు "పండితోత్తముల" కును, ఎద్దీనెనన కొట్టంబున గట్టుమని యాజ్ఞాపించిన గ్రుడ్డిప్రభువులకును భేదమేమి? యని మాసవాలు, తీర్థయాత్రలు చేయుచు పాండవులు భృగుతుంగమను పర్వతమునకరిగి శిబికథ వినిరని భారతమున గలదు. శిబిచక్రవర్తితల్లి ఉశీనరాణి ప్రశంస ఋగ్వేదమందేగలదని తెలిసి కొంటిమి; ఇట్లు బహుసహస్రాబ్దములనుండి భారతీయులెఱిగిన తులాపతి శిబిని తక్కిన జాతులవారు మఱచినను, మన తెనుగువారు మాత్ర మాత్యాగమూర్తిని మఱచి లేదు. త్రాసు కుదుకులను,(Scale Pans)- తెనుగులు తక్కెడ సిబ్బు లనుచున్నారు. శిబిచక్రవర్తి ఎందులో నెక్కితూగి, స్వర్గమధిరోహించి, నక్షత్రరూపుడై మెఱయుచున్నాడో ఆత్రాసుకుదుకలను మనవారు 'తక్కెడ సిబ్బు' లనుచున్నారు. 'సిబ్బి' 'జిబ్బి' యనునవి సంస్కృత 'శిబి' శబ్దవికృతులు. మనమేమి తూచుకొనినను, శిబియౌదార్యమును నిత్యము స్మరించుచు, త్రాసు కుదుకలను సిబ్బులని ప్రతినిత్యము వ్యవహరించు కొనుచున్నాము. మూలమున దీర్ఘముగానున్న శ్యేన కపోతకథను మిక్కిలి సంగ్రహ పఱచి, నన్నయభట్టు, తర్కన్యాయ్యముల పాటించుచు, నతివ్యాప్తి యవ్యాప్త్యాది దోషముల పరిహరించి నిశితముగా పూర్వపక్ష సిద్ధాంతముల ప్రదర్శించి, స్వీయ విజ్ఞాననిరతిని కళాప్రపూర్ణతను ప్రకాశింప జేసినాడు.

**His narration of the Sibi story is short, s veet, and logical: his arguments on either side are powerful and to the point: He proved himself to be a perfect Master in his art and legal Science**

## అ జ గ రో పా ఖ్యా న ము

తులారాశిలోని స్వాతీనక్షత్రముతో సంబంధముగల విచిత్రగాథ యీ యజగరోపాఖ్యానము. ఇంద్రుడు వృత్రుని సంహరించి ఖగోళ భూగోళములలో నారకృసునిచే నరికట్టబడిన జలముల బంధన మెడలించి, జలసమృద్ధి గావించి లోకుల తాప ముడిపెను. కాని బ్రహ్మ హత్యాదోషము ఇంద్రు నావహించినది. ఇంద్రుడు స్వస్థానభ్రష్టు డయ్యెను. ఆస్థానమున నహుషుడింద్రుడయ్యెను. అధికార మదగర్వ ములచే వానికి కన్నును మిన్నును కనపడలేదు. ఇంద్రాణి, శచీదేవి కూడ తనప్రక్కనుండినగాని ఇంద్రత్వము సార్థకముగాదని వానికి తోచెను. వెంటనే నహుషుడామెను రమ్మనెను. ఋషీశ్వరులు మోయు పల్లకినెక్కి వచ్చినపక్షమున రావచ్చునని యా పతివ్రత షరతుపెట్టెను. నహుషుడు మునులంబిలిపించి తనపల్లకి మోయుమని యాజ్ఞాపించి తాను పల్లకిలో గూరుచుండెను. మునీంద్రులా పల్లకినెత్తుకొని మెల్లగా వచ్చుచుండిరి. శచీదేవితో సమాగమునకు ఉబలాట మెక్కువై నహుషుడు "సప్పన్-సప్పన్" "చప్పు చప్పున నడువుడ" ని త్వర పెట్టుచు, పల్లకిమోయుచున్న మునులను కాలితో తన్ని యవమా నించెను. "సర్పోభవ" "నీవు పెనుబాము వై పడియుండుము" ని యగస్త్యుడు నహుషుని శపించి పల్లకిని త్రివై చెను. ఇంద్ర పదభ్రష్టుడై యజగరమహాహియై నహుషుడు నేలగూలెను.

ఆశ్లేష సర్పదైవత్యమైన నక్షత్రము. ఆశ్లేషపిమ్మట మఘనక్షత్ర ములు ఆందోళిక – పల్లకిరూపమున మెఱయుచుండును. మఱియు విశేషమేమనగా మఘనక్షత్రములతో సప్తఋషులు ఉదయింతురు. ఈచుక్కలం బరికించువారికి మఘరూపమైన చుక్కలపల్లకిని సప్త ఋషులు మోయుచున్నట్లు తోపగలదు. తపశ్శాలుర నవమానించి నహుషుడు పెనుబామై ఆశ్లేష మొదలు స్వాతివఱకు వ్యాపించినట్లగ

పడును. ఈ మహాహిరూపము ఋగ్వేదమునందును, ఐతరేయ బ్రాహ్మణమునందును, భారతమునందును వర్ణింపబడినది. అగ్రూపుత్రుడు చీమలపుట్టలోపడి చావకుండ ఇంద్రుడురక్షించి, ఎప్పటియట్ల బాగుచేసి పైకితీసెననియు, వాడు ఒకసర్పమును పట్టుకొని పైకిలేచెననియు ఋగ్వేదము IV - 19 - 9 లో గలదు. ఆసర్పము ఈమహాహియేగాని మఱొకటిగాదు. ఐతరేయ బ్రాహ్మణము 6 - 1 లో నీక్రిందిగాథ వివరింపబడినది. దేవతలొకప్పుడు సర్వచరునామక సత్రయాగము చేయనెంచిరి; కాని చేయలేకపోయిరి. అపుడు కద్రూపుత్రుడగు అర్బుదుడను సర్పఋషి వారితోనిట్లనెను "దేవతలారా! హోత చేయవలసినక్రియ యొకటి మీరు చేయమఱచిరి. మీనిమిత్తము నేనది చేసిపెట్టెదను". దేవతలు 'అట్లేకానిమ్మ'ని సమ్మతించిరి. ప్రతిదినము మధ్యాహ్నమువచ్చి, యాసర్పఋషి, సోమరసము తీయుటకు సాధనములైన గ్రావములను స్తుతించు మంత్రములను పఠించుచుండెను. దేవతలుకూడ గ్రావస్తుతి చేయుచుండిరి. ఒకప్పుడు సోమరాజు దేవతలచేత సోమపానము చేయించెను. "మనరాజునొక విషసర్పము చూచుచున్నది; కన్నులకొక గుడ్డకట్టుదమ"ని కట్టిరి. యజ్ఞములో గ్రావస్తుతిమంత్రములు చదువునపుడు కన్నులకు గుడ్డలు కట్టుకొనుట నాటినుండి యాచారమైనది. పిమ్మట దేవతలు సర్పఋషి మంత్రములకు తమమంత్రములుకూడ చేర్చి గ్రావస్తుతి చేయుచుండిరి అపుడు మదమెక్కలేదు. పాప పరిహారమైనది. దేవతలు సాధించిన యీకార్యమును సర్పజాతియనుకరించి తమపాపములను పరిహరించుకొగలిగెను. ఈస్థితిలో పాపము పరిహరింపబడెను. గనుక పాములు ప్రాతపొరవిడిచి క్రొత్తచర్మమును పొందుచున్నవి. పైని వివరింపబడిన మహాహి, కద్రూపుత్రుడగు నర్బుదుడేకాని మరొకడు కాడు. సోమపాత్ర, అహిప్రక్కనే, ఖగోళమున నేటికిని కానవగుచున్నది. మూడవది, అమృతకలశము (Crater the Cup)నకుఁ గాపుగా ఘోరసర్పములు నిలుపబడెననియు, గరుడీ భుజంగముల కనులు గానరాకుండ, ధూళిరేపి భుజంగముల వంచించి అమృతకలశము

హరించెనని స్పష్టమగుచున్నది. నహుషుడజగర మగుటకుముందు ఖగోళమున గోచరించిన సర్పగాథలు సంగ్రహముగా తెలిసికొంటిమి. నహుషుడు దేవేంద్రాధికార మదగర్వమున క్రిందను మీదునుగానక, పతివ్రత, పరదార, ఇంద్రాణి నపేక్షించెను. మహాతపశ్శాలుర, సన్ముసీశ్వరుల పాదతాడితులంజేసి యవమానించెను. అందుకుఫలితముగా నింద్రపదభ్రష్టుడై పెనుబామై బహుకాలము పడియుండి, పిమ్మట పదివేల యేనుగులబలముగల భీముని గదలకుండ పట్టుకొని నిర్బంధించెను. ధర్మజుడు, నహుషుని ప్రశ్నలకు సదుత్తరములిచ్చి, శాపము మాన్పి, తమ్ముని విడిపించుకొనెను.

నహుషుని శాపవిముక్తి గ్రీష్మఋతువునందు జరిగెను. అప్పుడు సూర్యాస్తమాన మైనపిమ్మట తూర్పుటాకాశమున ముత్యమువలె చిత్రానక్షత్రమును పగడమువలె నెఱ్ఱగా స్వాతియునుజ్జ్వలముగా మెఱయుచుండు దినములవి. శ్రీనాథుడు వర్ణించినట్లు, ప్రొద్దుపోయిన పిమ్మట ఆరోజులలో "స్వాతి చిత్రలు తోరణస్తంభ యుగము" వలె తూర్పున నుజ్జ్వలముగా మెఱయుచుండును. అనంతరము వర్షఋతువు నన్నయ, అరణ్యపర్వము చతుర్థాశ్వాసము 136-141 పద్యములమధ్య వర్షాకాలమును చక్కగా వర్ణించియున్నాడు. పిమ్మట శరత్కాలవర్ణనము నందు కొని రెండుపద్యములు మాత్రము వ్రాయగలిగెను. అందొకపద్యమును - "భూసతికిన్ -" అను పద్యమును మనము ఈవఱకే సావకాశముగా విమర్శించితిమి. మిగిలిన పద్యముసు మరొకప్రకరణమున విమర్శింతము. నన్నపార్యుని ఖగోళవిజ్ఞానమును చక్కగా వ్యక్తముచేయు నొక్క ఒక ఘట్టముమాత్రము మిగిలియున్నది - గంగావతరణము. దానినిట పరిశీలింతము.

## 17. గంగావతరణము

భగవంతుడు మనకనుగ్రహించిన నేత్రసౌభాగ్యమును కేవల మధోదృష్టితో మట్టుపఱుపక, కొంతయూర్ధ్వ దృష్టికలవారమై తలయెత్తి నవరత్నములట్లు మింటమెఱయు నక్షత్రసాలాలతో

శోభించు నభోరమా వైభవము కనులారగాంచి యానందించుట జన్మకోక సాఫల్యము. ముత్యములట్లు మిలమిలలాడుచు మిణుకు నక్షత్రముల మధ్య, నురుగుతో కూడిన యేటివిధమున తెల్లతెల్లగ దోచుచు, నొకప్రక్కనుండి మరొకప్రక్కకు ప్రవహించు ధవళదృశ్య మొకటి ఖగోళపరిశోధకులకు కానరాగలదు. ఆవెల్లువయు నొక్కవిధమున నుండక, పెక్కుపాయలై, ఉత్తరదక్షిణ ఖగోళములను నాగపాశములట్లు పెనవైచుకొని చుట్టుచుట్టి యున్నట్లుకూడ చూచువారలకు స్పష్టముకాగలదు. ఇట్లు శాఖోపశాఖలుగా మింట వ్యాపించిన ధవళదృశ్యమునంతను పడమటిజోస్యులు పాలపుంత (Milky Way) యనుచున్నారు. భారతీయులు ప్రాచీన పాశ్చాత్యులకంటె ఖగోళమును నిశితముగను, సూక్ష్మముగను పరిశీలించి, భేదములను గమనించి, తారతమ్యముల నిర్ణయించి, అందుకనుగుణ్యముగా ప్రత్యేకనామములు పెట్టినారు. తెలియేటి దృశ్యమెచ్చటెచ్చట చిక్కనై, దట్టమై, సాంద్రతరముగ దోచునో ఆప్రాంతములను మనపూర్వులు పాలసముద్రము, క్షీరసాగరము, క్షీరోదమువని వ్యవహరించిరి; పాలవిఱుగువలె పలుచపలుచగా నగపడుచు, నురుగులుగ్రక్కుచు ప్రవహించు దృశ్యములను ఆకాశగంగ, దివిజగంగ, వియద్గంగ, మిన్నేఱు, తెలియేఱు మొదలగు నామములతో వ్యవహరించిరి. ఇందు పాలసముద్ర మేది? ఆకాశగంగయేది? యని స్పష్టముగా నిరూపించుకొనుట మనకు మిక్కిలి యవసరము.

అశ్విన్యాది, యోగతార లిరువదేడింటిలో విశాఖానక్షత్రము అనేక హేతువులచేత చాల ముఖ్యమైనది. వేదములలో విశాఖకు రాధయని పేరున్నది. విశాఖరాధ; విశాఖతరువాతి నక్షత్రము అనూరాధ. మాసములలో వైశాఖము రాధామాసము. విష్ణుభగవానుడు రాధాప్రియుడు. విశాఖమొదలుకొని, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణప్రాంతమంతయు చిక్కని పాలతో కూడుకొనియున్నట్లు దట్టమగు తెలుపుగలిగి, సాంద్రమై, గాఢధవళమై గన్పట్టుచున్నది. ఈప్రాంతమును "దుగ్ధశ్రీ" మని

ఋగ్వేద మెంతో చక్కగా వర్ణించుచున్నది. చూ. ఋ IX - 110 - 8
"దివఃపీయూషం పూర్వ్యం దుక్థ్యం మహోగహాద్దివ ఆనిరధుక్షత ఇంద్రమభిజాయమానం సమస్వరన్."

ఇంద్రుడు జ్యేష్ఠానక్షత్రాధిదేవత. జ్యేష్ఠరిక్క రోదసీ మధ్యమున నున్నది. ఆకాశమును త్రవ్వి, పెకలించి, లోతునుండి వెలికితీసిన క్షీరములను, అనాదిసిద్ధములై, స్వర్గ్యములై ప్రశంసార్హములైన క్షీరములను స్తుతించుచు వేదమంత్రద్రష్టలు నప్పుడే ఉదయమైన ఇంద్రుని ఉచ్చస్వరముతో కొనియాడిరి. క్రమముగా ఇంద్రసర్వోత్తమ భావమెడలి, వేదఋషులకు విష్ణుసర్వోత్తమత్వము రూఢియైనది. విష్ణువు క్షీరాబ్ధిశాయి. అతని పాదాంగుష్ఠనిష్ఠ్యూత దివిజగంగ. విష్ణు పాదమునుండి దిగునకు నుఱుక వియద్గంగా సంక్షోభముడిపి రాజహంస ప్రశాంతత ప్రసాదించి, నీరక్షీరవిభాగము గావించి, యిక నెమ్మదిగా ప్రవహింపుమని, విష్ణుపుత్రిక, గంగాదేవిని అంపినది. అటులై నిర్భంగ తరంగ డోలాలోల మరాళజాలయై దివిజగంగాభవాని, త్రిలోకాధార భూతయు, సకలపాపనివారిణియు, దేవాంగనా విహార కారణయునై, భృగుపరశు మండలముగడిచి, సారధినక్షత్రముల నతిక్రమించి, ఆర్ద్రానక్షత్రమును జేరుకొనుచున్నది.

ఇపుడిచ్చటి చిత్రమును గమనింపుడని పాఠకులను వేడుచున్నాము. ఇది R. vander R. Wooley అను పాశ్చాత్య జోస్యులు రచించిన 'నక్షత్రములకు తాళపుచెవి' (A Key to the Stars) అను గ్రంథము మీద వేయబడిన ముఖచిత్రము. ఇందు కుడితట్టున నున్నది ఎద్దు రూపము. అది బెదిరి, ఎదుటబడిన దేనినైన పొడిచిచ్చకుమ్మవచ్చు నట్లున్నది. దానితలమీదనున్న నాలుగుకొమ్ములును, రెండుకాళ్ళును, కుడికొసను మెఱయుచున్న కృత్తికలను గమనింపవలయును. ఇది వృషభరాశిస్వరూపము. రాశి వృషభమునకు కొమ్ములు నాలుగు (చత్వారిశృంగా). కాళ్ళుమూడు (త్రయోఅస్యపాద) [ఇక్కడి బొమ్మలో మూడవకాలు వెనుకకు ఉండిపోయినందున కనబడుటలేదు]. ద్వేశీర్షే రాశి వృషభమునకు శిరస్సులు రెండున్నట్లు ...గా

పరిశీలించినచో తేలగలదు. ఇట్టివృషభ రూపమున వెలయు రాశిలో మెఱయుచు, అంకెలు వేయుచున్న (కృత్తికరూపముననున్న) అగ్ని దేవునిపై వేదమంత్రము ప్రశంసించుచున్నది. ఎద్దునకు ఎడమతట్టున చిన్న చుక్కలుచుక్కలుగా కనబడు ధవళదృశ్యము ఫేనసహితమైన ఆకాశగంగ - గంగాదృశ్యమునకింకను ఎడమప్రక్కనొసను మెఱయునవి మిథునరాశిలోని పునర్వసు నక్షత్రములు. నభోరంగమున తేజోగ్రగణ్యములై మెఱయు నిరువదిచుక్కలలో మూడవవంతు ఏడుచుక్కలీ చిత్రములో గలవు. ఇట్లు ఉజ్జ్వలనక్షత్ర విరాజితమైన యీ ప్రాంతము నభోరంగమున నెంతయు దర్శనీయమై యొప్పుచున్నది. కావుననే 'ఫూలీ' దొర తన నక్షత్రగ్రంథమునకు ఈదృశ్యమే ముఖపత్రముగా నుండదగినదని యెంచి యీచిత్రమును ముద్రించినాడు.

శరీరనిర్మాణక్రమమును (Physiology and Anatomy) బోధించు విజ్ఞానశాస్త్రమునకు కంకాళము (Skeleton) వలె, నక్షత్రపరిశీలన కీచిత్రము మొదటిమెట్టుగా నుపకరింక వచ్చును. అస్థిపంజరమువలెనిది యనాకర్షణీయమును, భయంకరమునుగాదు; కాని ఇందుగల జ్యోతిర్విషయములు పొడిదుమ్ములవంటివి; అంతే; అంతమాత్రమే. (Dry bones of science). ఏమన, నిందు భావములేదు; రసములేదు; చూడ సొంపై, విననింపై చమత్కార విలసితమై, సమస్తజనాహ్లాదకారణమైన కవిత్వసౌరభముగాని, కావ్యశ్రీగాని ఇందుగోచరింపవు. అందుచేతనే పడమటివారి వైజ్ఞానిక గ్రంథములు ద్రవ్యార్జనపరులై పరీక్షలకు చదువుకొను విద్యార్థులనేగాని ప్రజాహృదయముల నాకర్షింపజాలకున్నవి.

భారతీయ వేదమంత్రద్రష్టలును, పౌరాణికులును, వైజ్ఞానికకవులు, పొడిదుమ్ములవంటి వైజ్ఞానిక సత్యములకు వారు రసపుష్టిప్రసాదించి, భావగాంభీర్యమునుపెంచి, కవిత్వసౌరభముతోనించి, శ్లాఘ్యమైన కావ్యరచన గావించి, జనసామాన్యమునుగూడ దనిపి ధన్యులైనారు. పాశ్చాత్య వైజ్ఞానికులీ విషయమున చాల వెనుకబడియున్నారు.

ఫూలీదొరగారి ముఖచిత్రములో కుడిప్రక్కనొక బెదురుగొడ్డున్నది;

దానిప్రక్క నెటనుండియో వచ్చి దిగజారుచు, పాలవెఱుగువలె దోచు ధవళ దృశ్యమున్నది. ఆ తెలుపు లేఱు కొంత దిగువకు ప్రవహించి, ఓరియన్ యోధుని బాహువుకడ నరుణకాంతులతో తేజరిల్లు నక్షత్ర రాజమునంటుచున్నది. ఈ తెలియేఱునకు నావల, యెడమభాగమున, మిధునరాశి నక్షత్రములతో పునర్వసు చుక్కలు మెఱయుచున్నవి. ఈ ప్రాంతములనుగూర్చి పడమటి జోస్యులకు తెలిసిన విజ్ఞానమంతయు నింతే. జనసామాన్యమునకు వారు తెలుపగలదంతయు నింతమాత్రమే.

భారతీయులీ పాలనుఱుగుదృశ్యమును, పాలసముద్రము (Milky Way) నుండి కేటించి ఆకాశగంగయనిరి. ఈదివిజగంగకు జన్మస్థానము విష్ణుపాదము. ఈసంబంధము భావించుకొనినపుడు ఈదివజగంగ విష్ణుదేవునికూతురు. 'శ్రీగంగసత్పుత్రివై' యని చాటువు. ఈ మిన్నేఱు, రాజహంస, అప్సరస, భృగుపరశు సారథిమండలములను క్రమముగా నతిక్రమించి తుదకు, ప్రవాళ కాంతులతో తేజరిల్లు నార్ద్రానక్షత్రమును చేరుకొనుచున్నది. ఆర్ద్ర రుద్రదైవత్యము. ఈయంశముల నాధారము చేసికొని భారతీయ కవిలోకము దివిజ గంగాభవానిని ఇట్లు స్తుతించుచుందురు :-

సీ॥ "బ్రహ్మాండ భాండసంపత్తికుక్షి నిగల్గు పద్మనాభుని పదాబ్జమునబుట్టి।
అఖిలలోకాధ్యక్షుడై మించి విహరించు శివుజటాజూటాగ్ర
సీమనిలిచి"

ఇక్కడి చిత్రమీయంశములను స్పష్టము చేయగలదు. ఈసంబంధ విశేషములచేత గంగాదేవి ఈశ్వరునిభార్య; విష్ణుదేవునికి ఈశ్వరుడు అల్లుడు; ఈశ్వరునికి విష్ణుమూర్తి మామగారు. ఈశ్వరుడు తనశరీరార్థ మిచ్చుకొనిన ధర్మపత్ని గిరిజ; పార్వతి అంతకుముందే శివునికి కలదు. గౌరికిని, గంగకును సాపత్నీకలహములున్నవి. సవతుల కొట్లాటకు తెనుగుజనసామాన్యము అత్యాదరముతో చదివి యానందించు చుండును. గంగావతరణమును వర్ణించు ప్రత్యేక సంస్కృతగ్రంథము లున్నవి. నన్నయభట్టారకుడు తెనుగుభారతము అరణ్యపర్వ తృతీయాశ్వాసమునందును, బమ్మెరపోతరాజు భాగవత నవమస్కంధము

నందును గంగావతరణమును వర్ణించిరి. అవిగాక తెనుగున ప్రత్యే కముగా గంగావతరణ కావ్యములు, కథలు, పాటలు, పదములు ఎన్నెన్నో గలవు. వీనినింబట్టి చూడగా, మనదేశమున, సమస్తజనులకును గంగావతరణకథ ఎంతప్రీతికరమో స్పష్టమగుచున్నది.

ప్రజామోదము ననుసరించి, రాజా రవివర్మ గంగావతరణ చిత్రమును రచించియున్నాడు గంగాభవాని యాకాశమునుండి యవతరించు చుండ, ఈశ్వరుడు ఆమెను తనకపర్దమున నందుకొనిన దృశ్యము నతడెంతో చక్కగా చిత్రించినాడు; సపత్నీభావములో గౌరి గంగను కన్నెత్తిచూచుటయు హృద్యముగా చూపినాడు; కాని అందొక్క తప్పుగలదు. బొమ్మకుడివైపు చూపవలసిన ఎద్దును రవివర్మ ఎడమ తట్టున వేసి చూపినాడు. ఆలోపమును సవరించి, ఖగోళదృశ్యము ననుసరించి గంగావతరణచిత్రము రచించి యీదిగువ చూపితిమి. ఈసందర్భమున మనము ముఖ్యముగా గమనింపవలసిన సంగతు లేమనగా: గంగావతరణ దృశ్యమున ముఖ్యమైన ఘట్టములు రెండు (౧) విష్ణుపాదమున గంగ ప్రాదుర్భవించుట మొదటిఘట్టము. (౨) పిమ్మట దివిజగంగ హరు జటాజూటమును చేరుకొని, యామహా దేవుని మౌళిని ధరింపబడుట రెండవఘట్టము. ఈరెండుదృశ్యములను ఖగోళము ననేక కాలమున సందర్శించుటకు వైశాఖశుక్లసప్తమి మిక్కిలి యనుకూలమైన దినము. ఆనాడురాత్రి తొలిజాములోపున తూర్పుటాకాశమున విష్ణుపాదమునందు గంగఉద్భవించుట చూడ గలము. అటనుండి యాగంగ, రాజహంస, అప్సరస, భృగుపరశు సారథిమండలముల మీదుగా ప్రవహించి, పడమట నిక త్వరలో నస్తమింపబోవు నార్ద్రనక్షత్రమును చేరుకొనుట కనులారజూచి మనము ఆనందింపగలము. ఆసంగతులను గమనించి మనపంచాంగ కర్తలు వైశాఖశుద్ధసప్తమీ దినమున గంగోత్పత్తియనియు, గంగా వతరణమనియు ఖండించి వ్రాయుచున్నారు వారట్లు వ్రాయుటకుగల కారణములను వివరించి తెలుపుటకు ఇంతదూరము వ్రాయవలసి వచ్చినది. పూలీదొరగారి గ్రంథముఖచిత్రముపైని వ్రాసిన రెండవ

ఘట్టమును మాత్రమే చూపును. ఆక్రింది రెండవచిత్రము రెండుఘట్టములను ఏకకాలమున చూపగలదు. వైశాఖశుద్ధ సప్తమినాడు ఖగోళమున మనము కనులారచూడగల దృశ్యమే ఇందుచూడగలము. వైశాఖశుక్లసప్తమి నాటికంటె ఆమరునాడు ఈదృశ్యము నాలుగు మినిట్లుముందుగా తూర్పుటాకాశమున నుదయించును పదునైదు దినముల పిమ్మట నొక గంటముందు దీనింజూడగలము. మృగశిర కార్తె దినములలో సూర్యాస్తమానము కాగానే, తూర్పుటాకాశము మొదలు పడమటి యాకాశమున త్వరలో నస్తమింపబోవు నార్ద్రా నక్షత్రమువఱకు గంగావతరణ దృశ్యమును, అందలి రెండుఘట్టములను, వివరములతోసహా నభోరంగమున చక్కగా చూడగలము. మేఘచ్ఛన్నముగాని కృష్ణపక్షదినములలో నీదృశ్యము ఎంతో అద్భుతావహమగుచుండును. రవివర్మగారి చిత్రములోగల తప్పులను సంస్కరించి తయారుచేసిన ఇచటి యాడవ చిత్రమును, వూలీదొరగారి ముఖచిత్ర పటముతో తైపారువేసి జాగ్రత్తగా కనిపెట్టుచో, పాశ్చాత్య, భారతీయ, వైజ్ఞానములకుగల తేడాలు పాఠకులు చక్కగా కనిపెట్ట గలరు. పొడిదుమ్ములవంటి పాశ్చాత్య విజ్ఞానాంశములను తత్పూర్వము అనేకవేల సంవత్సరముల క్రిందటనే కనిపెట్టి, మన మంత్ర ద్రష్టలును పౌరాణికులును, వానికి ప్రాణముపోసి, రసపుష్టినించి మాధుర్యమునుపెంచి జీవకళలతో సమస్త జనామోదకరముగా కావ్యముల రచించి ధన్యులైరి. వూలీదొరగారి (Wo :ley) ముఖపత్ర నిర్జీవప్రతిమలు ఎన్నియైనను, పురాణోక్త విధమున సంస్కరించి రాజా రవివర్మ జీవకళలతో చిత్రించిన గంగావతరణ దృశ్యముతో నాటివచ్చి సర్వజనాదరణీయములు కాగలవా? యని ప్రశ్నించెదము. నన్నయ్య మొదట సంస్కృతమూలము ననుసరించి భారతావతరణము నీక్రింది విధమున తెనిగించెను :— ఆది 1 - 76.

ఉ॥ ఇంబుగ సర్వలోక జనులెవ్వనియేని ముఖామృతాంశుబిం।
బంబున నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణరం।
ధ్రంబున నంజలిందవిలి త్రావుదురట్టి మునీంద్రలోకవం।
ద్యాంబరముం బరాశరసుతుం బ్రణమిల్లి కృతంబు భక్తితోన్॥

శ్రీమద్రామాయణము వాల్మీకి వదనారవింద గళితమనినట్లే భారతము కృష్ణద్వైపాయనముని వదనారవింద గళితమని పైపద్యము వక్కా ణించుచున్నది. ఈపద్యము రచించుటకుముందే ఆది. 1 - 72 రచనలో నన్నయ్య కృష్ణద్వైపాయనునకు విష్ణుత్వమారోపించి, విష్ణుపాదము నుండి విజయగంగ ప్రాదుర్భవించినట్లే భారతపుణ్యస్రవంతి, వేదవ్యాస మునీంద్రుని పాదసంభవమని వర్ణించియున్నాడు. ఈభావము మూల భారతమునలేదు. జ్యోతిర్విదుడైన నన్నయభట్టారకుని స్వాతంత్ర భావము; రమణీయరూప కాలంకార సంశోభితము: ఆది 1 - 72.

ఉ॥ సాత్యవతేయ విష్ణుపదసంభవమై, విబుధేశ్వరాబ్ధిసం
గత్యుపశోభితంబగు జగద్విదితంబగు భారతీయ భా
రత్యమలాపగౌఘము నిరంతర సంతత పుణ్యసంపదు
న్నత్యభివృద్ధిసేయు వినినం గొనియాడిన నెల్లవారికిన్.

విష్ణుపాదమున నుద్భవించిన దివిజగంగ, విబుధ + ఈశ్వర + అబ్ధి సాంగత్యములను వరుసగా పొందినది. విబుధ, ఈశ్వరులకు ఆకాశ గంగతోకలిగిన సాంగత్య విశేషములను పైన చూచితిమి. శంభుని శిరమునుండి జారిపడి దివిజగంగ సముద్రసాంగత్యము నెట్లుపొందెనో చూడవలసియున్నది. ఇది గంగావతరణ కథనమునందలి మూడవ ఘట్టము. భగీరథుడు ఈఘట్టమునకు కారణభూతుడు. సగరసుతులు యజ్ఞాశ్వముకొఱకు వెతుకుచుబోయి, అరువదియైదువేలమంది సాగర ముగ్రద్రవ్వుచు, కపిలుంజూచి, యాతని సమీపమున నాగాశ్వముం గని యతడు చోరుడని హేళనచేసిరి. కోపించి యామహర్షి చూచు నంతలో వారందరును భస్మరాసులైపడిరి. వారికి సద్గతులు కల్పించు నిమిత్తము, సగరవంశజుడైన భగీరథుడు బహుకాలము తపస్సుచేసి, ఈశ్వరుని, గంగను మెప్పించి, గంగను భూలోకమునకు తెప్పించెను. నన్నయభట్టారకుడు వర్ణించిన గంగావతరణ మీఘట్టమునకు సంబం ధించినది. ఆది 3 - 82, 83, 84.

82. మ॥ ఇలకున్ గంగతరంగ సంహతులతో నేతెంచె నాశాంతరం
బుల నాకాశముగట్టుచుం దగ మహాభూత ప్రపంచంబుతో

జెలువై యుండఁగ దాని నీశ్వరుఁడు దాల్చెన్ సంగతోత్తుంగ పిం
గళజూటాగ్రమునందుఁ బద్మదళసంకాశంబుగా లీలతోన్ ॥

83 సీ॥ సురమునిసిద్ధ ఖేచరవరుల్ వచ్చియచ్చెరు వందిచూడంగ వారు
శిరంబు।
నందుండి భువనైక వందితసురనది, ధరణీతలంబున కరుగుదెంచి
కలహంసగతియు నిర్మలఫేన హాసంబు నాకీర్ణమీన విలోకనములు
నాలోలపవన వాచాలిత కల్లోలలసిత మృదూక్తులు నెసగుచుండ
బ్రీతితో భగీరథుడను దూతచేత।
నీతయై మహాముని పరిపీత రిక్త
మగు సరిత్పతి గూడి యాసగరజులకు॥
బ్రీతిగావించి నించెనీరాతతముగ

84. క॥ సాగరులకు సద్గతిగా।
సాగరమునకట్లు సలిల సంపూర్ణముగా।
భూగతయై భాగీరథి।
భాగీరథకీర్తి భువనపంక్తుల నిలిపెన్॥

లోకమాన్య బాలగంగాధరతిలకుగారు సాహిత్య దర్పణమునుండి ఎత్తివ్రాసిన శ్లోకరత్నము నిటవ్రాయుట ఈసందర్భమున నవసర మనిపించుచున్నది.

“నేదంనభోమండలమంబురాశిర్నైతాశ్చతారానవఫేనభంగాః।
వియద్వ్యాపీతారాగణ గుణితఫేనోద్గమరుచిః ప్రవాహోవారమ్యః
పృషతి లఘుదృష్టః శిరసితే జగద్వీపాకారం జలధివలయం తేనకృత
మిత్యనేనైవోన్నేయం ధృతమహిత దివ్యం తవ వపుః॥

ఇట్లు అనాదికాలమునుండి ఎల్లవారికి నానందాశ్చర్యములం గూర్చు నీవ్యోమగంగ, కారణాంతరములచే! వ్యాకుల చిత్తుడైన భర్తృహరికి మాత్రము, వివేకభ్రష్టసంపాతములకు ఉదాహరణమైనది.

" మ॥ ఆకాశంబుననుండి శంభుని శిరంబందుండి శీతాద్రి శు।
శ్లోకంబైన హిమాద్రినుండి భువి భూలోకంబునందుండి యు
స్తోకాంభోధి పయోధినుండి పవనాంధోలోకముం జేరె గం।
గా కూలంకష పెక్కుభంగుల వివేకభ్రష్ట సంపాతముల్ ॥

మతివలెనే గతియందురు. ఎవరి మనశ్శరీర తత్త్వానుసారము వారివారి కీవిశ్వము ఆయావిధముగనే గోచరించుట సహజము

ఇంతవఱకు, నన్నయభట్టారకుని జ్యోతిర్విజ్ఞాన విశేషములం దేట పఱుచు ఘట్టములను కొన్నింటిని విమర్శించితిమి. మూలభారతమున లేని సంగతుల నెన్నింటినో క్రొత్తగా చేర్చి నన్నయ్య తెనుగు భారతమును రమ్యతరము గావించిన సందర్భములను నా యోపిన కొలది సంగ్రహించి మీయెదుట బెట్టితిని. మూలగ్రంథముననున్న జ్యోతిర్విశేషములను కొన్నింటిని మఱచియో, పొరపడియో నన్నయభట్టు తెనుగున వ్రాయక విడిచిపెట్టెను. అట్టిదొక్కవిషయము మాత్రము ఇట వ్రాసి యీప్రకరణమును ముగించెదను. కుమారాస్త్ర విద్యాసందర్శన రంగములోని విషయమిది. సంస్కృత భారతము 135 అధ్యాయములో నీక్రింది శ్లోకముగలదు.

304 పంచభిర్భ్రాతృభిః పార్థైర్ద్రోణః పరివృతో బభౌ।
పంచతారేణ సంయుక్తః సావిత్రేణేవచంద్రమాః ॥

హస్తానక్షత్రమునకు అధిదేవతసవిత. సవితృదేవతాకమైన హస్తా నక్షత్ర సహితుడైన చంద్రుని యుపమానము. "హస్తాపాణినాం పంచ" హస్తానక్షత్రము ఐదు వ్రేళతో కూడుకొనిన అరచేయివలె ఏదునక్షత్రములుకలది. కుమారాస్త్ర విద్యాసందర్శన రంగమందు ధనుర్విద్యాపారంగతుడైన యర్జునుడు, నలుగురు సోదరులతోను, ద్రోణగురువరేణ్యునితోను కూడుకొని, చంద్రసహితమై, పంచతారా విశిష్టమైన హస్తా నక్షత్రములవలె మెఱయుచున్నాడని యర్థము. ఇంతచక్కని యుపమానమును తెనుగున వ్రాయక నన్నయ ఏల విడిచెనో నేనూహింప జాలకున్నాను. బహుశా మఱచియుండును.
ప్రమాదో ధీమతామపి "

## 18. ఆ హా ర ప్ర క ర ణ ము

క॥ కోటాన కోటులైనను।
కూటికిసిరిరావు దేవకోటులురారా
పాటించి యజ్ఞవాటికి।
కూటికిమారెళ్ళ కొండగుణరత్ననిధీ॥

"అహమన్నం ప్రదాస్యామి, అన్నం చాదిత్యమయంబు". సమస్తప్రాణులకును ఆకలివేళకు అన్నమత్యవసరము. దేవ, మానవ, జంతు, క్రిమి, కీటకాది ప్రాణులన్నియు, జీవధారణమునకు అన్నముపై నాధారపడియున్నవి. అన్నముపెట్టి ఇన్నింటిని పోషించుదాత సూర్య భగవానుడు. కావున విజ్ఞులు అన్నమాదిత్య మయమని ప్రవచించిరి. (ఆరణ్య, 1 - 39 ఋగ్వేదములో అన్నసూక్తము లనేకము లున్నవి. ఉపనిషత్తులు "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" అన్నము పరబ్రహ్మ స్వరూపమని తెలిసికోవలెనని ఘోషించుచున్నవి. హవిర్భాగముల నాశించి యజ్ఞవాటికకు దేవతలును, సంతర్పణశాలలకు మానవులును పోవుటకు కారణము అన్నకాంక్షయే. బ్రతికి యున్నప్పుడే కాక, చచ్చినపిమ్మట కూడ పితరులు బుభుక్షావేదనకు పాల్పడుదు రనియు, మృతదినమున వారి కన్నమిడుట అవసర మనియు, భావించుకొని భారతీయులు, తద్దినములు పెట్టి, పితృస్థానమున కూర్చుండ బెట్టిన భోక్తలకును పితృదేవతలతో కూడవచ్చిన విశ్వేదేవస్థానమున కూర్చుండబెట్టిన భోక్తలకును మృష్టాన్న ప్రదానము గావించు చుందురు. దేహధారణ చాలించి పరలోక గతులైనవారికి గూడ ఆహారమింత యావశ్యకమైనపుడు, దేహధారులై యైహిక యాత్ర గావించు ప్రాణులకు అన్నమెంత యవసరమో వివరింప బనిలేదు. అంగుళప్రదేశములో కోటానకోటులు సూక్ష్మజీవులు వసించుచున్నవి. మహాకాయ విశిష్టములైన నడవి యేనుగులు ఖడ్గమృగములు లొట్టిపిటలు లోనగు భూచరములును, శింశుమార మహాగ్రాహ తిమి తిమింగలాది జలచరములును భూగోళముపై కలవు. ఇంతటి గొన్ని

నూటయేబది యడుగుల పొడవుగలవి యున్నవి - ఇన్నింటికిని వలయు నాహారమంతయు ప్రత్యక్షముగానో, పరోక్షముగానో సూర్యసంభవమే యని తెలిసికొనుట గొప్పవిజ్ఞానసత్యము నెఱుగుటయగునని వక్కాణింతును. సూర్యుడిచ్చు తేజోష్ణ విద్యుత్ కాంతశక్తుల మూలముగా నీప్రాణికోట్లు జీవింప గలుగుచున్నవి. వెనుకటి దినములలో సూర్య కాంతి ప్రసరింపగా జీవింపగల్గిన వృక్షజీవులు, దారువులు లోనగు వానిలో సూర్యసంభవములైన శక్తులు డాగి ఇమిడియున్నవి. అడవులు, చెట్లు, చేమలులోనగు వృక్షజీవులు చాలకాలము నేలలోపూడియుండి యుండి రాక్షసిబొగ్గుక్రింద మారును. నేటిమానవులీబొగ్గునుకాల్చి రైలు ఎంజినులను ఇతర యంత్రములను నడుపుచు నిత్య వ్యాపారములను సాగించుచున్నారు. మన దేహధారణ కవశ్యకమైన భోజనాదికము పచనము చేసికొనుటకు నిత్యమువాడుకొను కట్టెలును, వంట చెఱకును, బొగ్గులును సూర్యరశ్మి ఫలితములే. భూమిమీద నెవరెప్పుడు ఏపని చేయుటకైనను కావలసిన క్రియాశక్తి (Energy) యు, ఏకార్య నిర్వహణమునకైన నవసరమైన సామర్థ్యమును సూర్యుడనుగ్రహించినవే. గతకాలములో సూర్యునికిరణము లీభూగోళముపై ప్రసరించి నప్పుడు, అచ్చటి వృక్షజీవులాకిరణ గర్భితశక్తుల నందుకొని, పట్టి భద్రము చేయగలిగెను. ఆనాడు వృక్షజీవులట్లు సంగ్రహించుట మూలముగా వందు నిక్షిప్తములైన శక్తిసామర్థ్యములను ఈనాడుమనము నిత్యము నుపయోగించు కొనుచున్నాము. ఆనాటి చెట్లు చేమలు తమలో నిలువచేసి దాచిపెట్టుకొనిన రశ్మిశక్తులు బ్యాంకులో నగదు నిలువల వంటివి. అవసరమును బట్టి మనము వానిం గైకొని వాడుకొను చున్నాము. ఓషధులపైని, వృక్షజీవులపైని సూర్యరశ్మి ప్రసరించుట చేతనే నమస్తజంతుకోట్ల ప్రాణధారణకును, మానవ కోటుల ప్రాణ ధారణకును అవశ్యమైన ఆహారమంతయు లభించుచున్నది - ప్రొద్దున సూర్యునితో మానవులును నిద్రనుండి లేచుచున్నారు. సూర్యాస్తమించిన తరువాత మానవులును, పనులు చాలించుకొని విశ్రాంతి కోరుగు చున్నారు. ప్రత్యక్షముగానో, పరోక్షముగానో, మన జీవితములో

ప్రతి క్షణమును సూర్యునిపై నాధారపడియున్నది. ఇట్టి విషయము లనేకములు బహుభంగుల యోజించి మన పెద్దలు "సూర్యాత్మ జగతః" అనిరి.

సూర్యుడు ఎనిమిదిలక్షల అరువది నాలుగు వేల మైళ్ళవ్యాసమును, ఇరువదిరెండు లక్షలమైళ్ళు చైవారమును గల గొప్ప గోళము. ఆగోళము మహాగ్ని మయము; తీవ్రార్చులతో మండు వాయు పదార్థములు, ధాతుసంబంధముగల ఆవిరులు, లోనగువానితో కూడు కొని యున్నది. పరిమాణమున సూర్యగోళము భూగోళము కంటె పదమూడు లక్షలరెట్లు పెద్దది. సూరుడొక చిన్న నక్షత్రము. నక్షత్రములు బ్రహ్మాండ సూర్యులు. "సప్తదిశో నానాసూర్యాః." భూమిమీద నేడు దిక్కులను నక్షత్ర రూపమున మెఱయు సూర్య గోళములెన్నో గలవు.

తక్కిన సూర్యులమాట యటుంచి, మనసూర్యుని గురించి మనము తెలిసికోవలిసిన విశేషములున్నవి. స్థూలదృష్టికి సూర్యుడు తూర్పున నుదయించి పడమట నస్తమించుచున్నట్లు గపడును.

విశేషించి, ప్రతిదినమును సూర్యుడు ఒకేబిందువుకడ నుదయించి నట్లగపడడు. సూర్యోదయబిందువు దినదినమును మారుచుండును. జూన్ 21 వ తేదీ మొదలు నీబిందువు దక్షిణమునకు దిగజారుచున్నట్లు తోపగలదు. డిసెంబరు 21 వ తేదీని, ఉదయబిందువు దక్షిణపు కొసను చేరుకొని, ఆనాటినుండి దిశమార్చి యీ బిందువు ఉత్త రమున కుపక్రమించు చున్నట్లు తోపగలదు. ఇందుకొక యుప మానమును పేర్కొనవచ్చును. పెద్దగడియారములలో లంబముగా వ్రేలుచు, టిక్కుటక్కుమనుచు నూగులాడు పెండ్యులము ఒక కొనను చేరి దిశమార్చి రెండవప్రక్క నూగులాట సాగించునట్లే — సూర్యుడును డిసెంబరు 21 తేదీవఱకు దక్షిణదిగ్గామియై యచట నాగి, దిశమార్చి ఉత్తరదిగ్యానము నారంభించినట్లు స్ఫురింపగలదు. ఉత్తరదిక్కునకుపోవుచు సూర్యుడు గడుపుకాలము ఉత్తరాయణము. ఆరునెలల పిమ్మట ఉత్తరదిగ్గమనము చాలించి, దిశమార్చి దక్షిణ దిగ్గమనము సాగించుకాలము దక్షిణాయనము.

ఉత్తరాయణకాలమున సూర్యాతప సూర్యోష్ణములు క్రమక్రమముగా విజృంభించుచు, నిశితములగుచుండును. ఆ తాపమునకు తట్టుకోలేక సమస్తజలాశయములందలి నీరు నిగిరి, యావిరిరూపమున పై కెగిసి పోవుచుండును. పిమ్మట దక్షిణాయనమున నీనీటియావిరంతయు వర్ష రూపమున క్రిందికిడిగి, సమస్తజీవుల కాప్యాయన మొనరించి, యోషధులను, సస్యములను పెంచి, పంటలపండించి, యాహారసమృద్ధి గావించును. ఈవైజ్ఞానికాంశములను, నన్నయ్య, ఆరణ్య 1-38, 39 రచనలలో సంగ్రహముగానిట్లు వర్ణించినాడు :

ఆరణ్య 1-38.

గీ॥ భూతరాశిదొల్లి పుట్టి బుభుక్షాభి
తప్తమయిన జూచి తద్భయంబు
నపనయింప గడఁగి యదితి సుతాగ్రణి
గమలబాంధవుండు గరుణతోడ॥

1-39 ఉత్తరాయణగతుండై యుర్వీరసంబు పరిగ్రహించి దక్షిణాయనగతిం బర్జన్యభూతుండై యోషధులం బడసి రాత్రులయందుఁ జంద్రకిరణామృతంబునం జేసి వానిం దడుపుచు వర్ధించి యందన్నంబు పుట్టించి ప్రజాప్రాణధారణంబు సేయుటంజేసి యన్నంబాదిత్యమయంబని యెఱింగి, తొల్లి భీమ, వైన్య, కార్తవీర్య నహుషాదులు యోగిసమాధి నిష్ఠితులై సూర్యభజనంబున నన్నంబు బడసి యాపదలవలనం బ్రజలసముద్ధరించిరి గావున ... ”

ఇట్లు సమస్తజీవకోట్ల ప్రాణధారణ కవశ్యమైన యన్నమును, తేజోష్ణ విద్యుత్కాంతశక్తులను స్వకీయకిరణప్రసారణముచే లోకులకు సూర్య భగవాను డనుగ్రహించుచున్నాడు.

సూర్యమండల భూమండలముల మధ్యదూరము సకుటున తొమ్మిది కోట్ల ఇరువది తొమ్మిది లక్షల మైళ్లు. సెకెండుకు ఒకలక్ష ఎనుబది యారువేల మున్నూట యిరువది మైళ్ళు చొప్పున సూర్యకిరణములు సూర్యమండలమునుండి వెడలి భూమండలము చేరుకొనుసరికి సుమారు ఎనిమిది మినిట్ల ఇరువదిసెకండ్లు పట్టును.

సూర్యకిరణములు చూచుటకు తెల్లగా మెఱయు చున్నట్లు కన బడునుగాని, నిజముగానందు సప్తవర్ణములుగల కిరణముల సంపుటి గలదు. అలంకారభాషలో నీ సప్తవర్ణములు సప్తాశ్వములని తెలుప బడినవి - సూర్యు డాకారణముచేత సప్తాశ్వు డనబడు చున్నాడు - నన్నయభట్టు, సూర్యుని సప్తాశ్వుడని తఱుచుగా పేర్కొనుచుండును. గరుడుడు, తల్లితోపాటు కద్రూదేవికి దాసుడై, ఆమె సంతానమును మోసి యాడించుచుండువాడు. ఒక్కనాడు గరుడు డీపన్నగముల నెత్తుకొని "సప్తమారుత జవంబున సప్తాశ్వ మండలంబు దాక నెగ సిన"... ఆది 2 - 43.

సూర్యుని రథమునకీ యేడుగుఱ్ఱములును పగ్గములతో బంధింప బడ లేదు. పన్నగములతో బంధింపబడినవి. ఏల? సూర్యకిరణములు ఋజుగతి (Straight lines) ని పోవుట లేదు. తరంగ గమనము (Wave motion) తో వెడలుచున్నవి. ఈ వైజ్ఞానిక సత్యములు వ్యక్తము చేయుటకుసూ ర్యరథమునకు గుఱ్ఱములు, పన్నగముల వలన కట్టబడినవని పెద్దలు తెలిపిరి. "రథస్యైకం చక్రంభుజగ నమితా సప్త తురగాః" అని సూర్యరథమునుగూర్చి చాటుశ్లోకము.

## 19. జీవశాస్త్రము - సంతాన శాస్త్రము

వంశ, కుల, గోత్ర, సంఘములు వృద్ధిపొందుటవలన జాతి యభి వృద్ధి పొందగలదు. మానవజాతి నశింపకుండ నిలుచుటకు ప్రతి వంశమును సంతానలాభము బడయుచుండ వలెను. సంతాన హీనులు పున్నామ నరకమునబడుదురు. అట్టి ఘోరవిపత్తు తటస్థింపకుండ దంపతులు గర్భవాసపుపంట గనవలెను. పూర్వయుగములలో పుణ్య దంపతులు యథాకామ్యముగ నిచ్చవచ్చినట్లు సంతానము బడయ గలుగుచుండిరి. అట్లు బడయుటకువారు శాస్త్రసమ్మతములైన ప్రక్రి యలను బాగుగా నెఱిగియుండిరి. ఆ ప్రక్రియల నవలంబించి యథా విధిగా పూర్తిచేసినవారి కభీష్టసిద్ధి కలుగుచుండెను. పాంచాలరాజు ద్రుపదుడు, తన్నవమానించిన ద్రోణుని సంహరింపగల కుమారుడును

పటుపరాక్రమముచే తనచిత్తము నాకర్షించిన యర్జునుని పెండ్లాడగల కూతురును తనకు కలుగవలెనని గాఢముగా సంకల్పించి, శాస్త్ర వేత్తలు ఉపదేశించిన క్రమమున దీక్షతో ఆయాప్రతిక్రియలను యథావిధిగ నిర్వర్తించి తుదకు దృష్టద్యుమ్నుని, ద్రౌపదిని గని సఫల మనోరథుడయ్యెను.

సత్యవతికి శంతనువలన విచిత్రవీర్య చిత్రాంగదులను కుమారు లిరువురు గలిగిరి. విచిత్రవీర్యుడంబికను, చిత్రాంగదు డంబాలికను వివాహమాడిరి. సంతానములేకుండ నాయిరువురును చనిపోయిరి. వంశక్షయమగునని సత్యవతి చాలభయపడెను. పరాశరు ప్రసాదమున నామెకు తొలిచూలున జన్మించిన వేదవ్యాసునితో యోజించి, యప్పటి లోకాచారము ననుసరించి దేవరన్యాయమున నంబికాం బాలికలకు పుత్రభిక్షపెట్టి, వంశాభివృద్ధి గావింపుమని సత్యవతి వ్యాసుని నియోగించెను. విచిత్రవీర్యునిభార్య అంబికకు, వ్యాసుడు పుత్రోత్పాదనము గావించువేళకు నాయమ భయపడి కన్నులు మూసుకొనెను. ఆమెకు పుట్టినకొడుకు పదివేలయేనుగుల బలము కలవాడయ్యెను, మాతృదోషమున నంధుడయ్యెను. ఆపుట్టుగ్రుడ్డియే ధృతరాష్ట్రుడు.

సత్యవతి యందులకు వగచి, కనులెంతమాత్రము మూయవలదని కట్టుదిట్టముచేసి, రెండవకోడలి నంబాలికను శయనగృహమున కనిచెను. కనులు మూయలేదుగాని అంబాలిక గర్భధారణ సమయ మున భయమున వెలవెలబోయెను. అందుకుఫలితముగా నామెపుత్రుడు పాండుడయ్యెను. మరొకసారి అంబికను సత్యవతి సంతానోత్పత్తికయి నియోగించెనుగాని ఆమె భయపడిపోయి, తానాశయన గృహమునకు పోజాలక తనస్థానమున తనదాసినంపెను. నాటిరాత్రి దాసి నిర్భ యముగా వ్యాసునితోగడిపి, గర్భవతియై, నిర్భయుడగు విదురుని గనెను.

పుణ్యదంపతులు వంశాభివృద్ధికోరి శయనగృహము చేరువేళకు వారిమనస్సులలో నెట్టికలతలు నుండకూడదు. కులపాలిక భర్తను

కూడు వేళ దంపతులానందమయులయి యుల్లాసముతో నుండవలెను. వారి పరిసరమంతయు 'నానందో బ్రహ్మ' యని యుండుట యవసరము ఆపుణ్యముహూర్తమునగాని, పిమ్మటగాని, స్త్రీ హృదయము ఏమాత్రమును కలత చెందరాదు. భయము, జుగుప్స, దిగులు, సంక్షోభము లోనగునవెంత మాత్రమును గర్భవతి హృదయమున పొడచూపకూడదు. అట్టివి పొడచూపుట మాతాశిశువుల కుపద్రవమును, వంశమునకు హానియు కలిగించుట నిక్కవము. గృహలక్ష్మియు, వంశాభివృద్ధికి ముఖ్యకారణమునైన కోడలిని, అత్తలు, నాడుబిడ్డలును ఏదో మిషమీద మిక్కిలి ఏడ్పించుచుండుట తెనుగు గృహములలో మామూలైనది - గర్భవతులు కొండలెక్కరాదని, సముద్రము చూడరాదని, గ్రహణములు చూడకూడదని, ఇట్టి సద్విధులు నిర్ణయించుటలో మన పెద్దలు చూలింతల మనస్సు కలతబడరాదని తెలిసికొని, వారిమనస్సులసంరక్షించుటకే ఇట్లేర్పరిచిరని స్పష్టముకాగలదు. గర్భవతులను సాధించి, కోడంట్రముపెట్టి, యేడ్పించి, మనస్సు క్షోభింపజేసినవారు తత్ఫలముల ననుభవించుట మనము నిత్యము చూచుచునేయున్నాము.

మృగ, పక్షి, సరీసృప, క్రిమికీటకాదిజీవులయందు, మనుష్యులలో వలెనే, స్త్రీపురుషజాతుల సంయోగముచేతనే సంతానోత్పత్తి యగుచుండును. జంగమములైన జంతుకోట్లలో పైక్రమమునకు అంతరాయములేకుండ సంతానోత్పత్తి కాగలదు. స్థావరములైన చెట్లు, చేమలు, మొక్కలు, మ్రాకులులోనగు నోషధులలోనిది యెట్లు జరుగుచున్నదో జీవశాస్త్రవేత్తలు నిర్ణయించి తెలుపుచున్నారు. విజ్ఞాన నిరతుడగు నన్నయ్య యా సంగతుల నిట్లు వివరించినాడు:

ఆది.3-223 "మఱియుం గర్భయోనియందు ఋతుపుష్పరససంయుక్తంబగుచు రేతంబు గాడ్పుచేతం బ్రేరితంబయి కలసిఁ సందుఁ బంచతన్మాత్రలు పొడవై క్రమంబున నవయవంబు లేర్పడి, లబ్ధజీవులై యుద్భవిల్లి, శ్రోత్రంబుల శబ్దంబును నేత్రంబుల రూపంబును, ఘ్రాణంబున గంధంబును, జిహ్వానురసంబును, మనంబునసర్వంబును నెఱుంగుచు..."

ఇందు 'గాడ్పుచేతం బ్రేరితంబయి' యను వాక్యమునకు కొంచెముగా వ్యాఖ్యానమవసరము. వరిచేను గోముగా పెరుగుచుండ, నం

దొక్కొక్క మొక్కలో పుష్పమునుంబోలిన స్త్రీ యవయవమును, బీజ గుణ విశిష్టమైన రజస్సు — ఒకానొక పొడియు పరిపక్వమగుచుండును. వీనిసంయోగకాలము సంభవమగువేళకు తూర్పునుండి గాలి రేగి, యా పొడివంటి బీజద్రవ్యమును వెదజల్లి స్త్రీ యవయవముల కందిచ్చి, యీవిధముగా సంయోగము గావించును. అందువ ఫలితముగా వరి చేలు పొట్టలతోనుండును. పిమ్మట వెన్నులు గింజలు నేర్పడి పంట పండుచుండును. ఇందు స్త్రీ పురుష సంయోగము గాలిమూలముగా జరుగుచున్నది.

కొన్ని పుష్పములందలి తేనె నాశించి, తేనెటీగలు వ్రాలినపుడు పుప్పొడి వానికాళ్ళకంటుకొనును. అటనుండి వెడలి మరొక పూవుమీద నవి వ్రాలినపుడు ఆ పుప్పొడి యీపుష్పమునందలి స్త్రీ యవయవముల కంది ఆమూలముగా గర్భధారణ కాగలదు. ఈవిధముగా ఈగలు, తుమ్మెదలు, పతంగములు, కీటకములు, సీతాకోకచిలుకలు మొదలగు నవి, తామెఱుగకయే, ప్రకృతిలో స్థావరములైన స్త్రీ పురుషజీవులకు పరస్పరసంయోగము కలిపి, కాయలు, పండ్లు పంటలు ఫలింపజేయు చుండుట చూడజూడ విస్మయమగు చుండును. జీవశాస్త్రమునుగూర్చి నన్నయ వైజ్ఞానికగ్రంథము వ్రాయలేదుగాని, ఆశాస్త్రబీజములను సందర్భానుసారముగా సంగ్రహించి భారతమున చేర్చెనని చెప్పుట కభ్యంతరములేదు.

ఈఘట్టమునందే సంస్కృతమూలమున ( ఆది. 189 – 11 లో) జీవ భేదములను గూర్చి యీక్రింది శ్లోకముకలదు :-

11 – ధాతాయథామూం విదధీతలోకేధ్రువంత థాహంభవ తేతిమత్వా ।
సంస్వేదజా అండజాఉద్భిదశ్చ సరీసృపాః క్రమయోఽథాప్సు మత్స్యాః ॥

ఇందు Egg-born, Plant-seed born, Sweat-born, reptiles, fish అనుతరగతుల జీవులు పేర్కొనబడినవి – నన్నయ యీసందర్భ మున వీనిందెలుపలేదు. కాని అరణ్య 3 – 13. దేవతలు వైకుంఠ మునకుబోయి శ్రీవిష్ణుభగవానుని స్తుతించుపట్టున, మూలభారతమున లేకున్నను, నన్నయ్య యీ వాక్యముల జేర్చినాడు :-

"దానవుం జంపితివి; అండజ, జరాయుజ, స్వేదజ, ఉద్భిజ్జంబులనం బరగిన చతుర్విధ భూతంబుల రక్షించుచున్న జగద్రక్షకుండవు."

సంస్కృత మూలమున తెలుపబడిన సరీసృపమత్స్యజీవులు అండజములు; కావున వానిని ప్రత్యేకముగా మరల పేర్కొనక, నన్నయ్య, జరాయుజములను ముఖ్యముగా వక్కాణించి పేర్కొన్నాడు. జరాయుజములను జీవులు మావివలన పుట్టినవి - మనుష్యులు ఆవులులోనగు జీవులు జన్మించిన మావి పడిపోవును. (After - birth). అంతవఱకు నామావి గర్భస్థప్రాణి నావరించి రక్షించుచునే యుండును ఈకారణముచేత మానవులు జరాయుజములనబడు జీవవర్గమునకు చెందినవారగుదురు. జీవవర్గ వివరణములో వ్యాసుడు పేర్కొనక విడిచిన జరాయుజములనుచేర్చి, నన్నయ శాస్త్రీయ వర్గీకరణము గావించెను.

మనుష్యజాతిలో స్త్రీ గర్భవతియైనపిమ్మట నాలుగుమాసములు గడచువఱకు గర్భస్థశిశువు పురుషుడో, స్త్రీయోనిరూపింపరాదనియు, అనంతరము కొడుకు కావలెనను వారు కొడుకును, కూతురు కావలెనను వారు కూతురును కనుటకు కొన్ని సాధనములనుచేసి ప్రాప్తకాములు కావచ్చుననియు పెద్దలవలన వింటిని. మఱ్ఱిచిగుళ్ళను, రావిచిగుళ్ళను, మరికొన్ని వస్తువులనునంపుటిచేసి శుభదివసమునమంత్రములు చదువుచు, గర్భవతి పాపిటప్రదేశమును మెల్లగానంటుచు, సీమంతోత్సవ మనబడు గృహ్యాకర్మగావించుట మూలముగా కోరిన శిశువును పొందవచ్చునని చెప్పెదరు. వేదములన్నను, వేదచోదిత కర్మలన్నను పూర్తిగా రోతపుట్టియున్న యీ దినములలో సీమంతోత్సవము నామమాత్రావశిష్టమైపోయినది. మాలింతరాండ్రకు ఏడవమాసమున గాజులసంబరము వలెనే, ఏడవమాసమున పూలసంబరమను పేరునపూలు ముడిపించువేడుకక్రింద మారినది. కాని వేదచోదితమైన యీ సీమంతోత్సవము ఈనాడు సామాన్యముగా ప్రజ లనుకొనునంతటి యవివేక కార్యము మాత్రము కాదు. శిశువు యొక్క స్త్రీత్వ పురుషత్వముల నిశ్చయించి, యాప్రాణియొక్క భావిజీవిత విధానమును నిర్ణయముచేయగల గృహ్యాకర్మ సీమంతము. (It determines the sex of the child in the womb

and its entire future) ఈ విషయమైన శాస్త్ర పరిశోధన చాల అవసరము. Serious scientific research regarding the true importance of Simantam is an urgent necessity – in as much as male or female children can be had as desired. ఈ గుహ్యాకర్మ, కోరిన సంతానోత్పత్తికి దోహదమై తోడ్పడ గలదని వేదసాంప్రదాయములందు నమ్మకము గలవారి విశ్వాసము.

నాకు తెలియవచ్చిన మరొక్క యంశము నిటవ్రాసి ఈ ప్రసంగమునుండి విరమింతును.

గర్భవతులైన స్త్రీలు, గర్భిణులుగా నుండు కాలమున పులుపు పదార్థము లెక్కువగా తినుచుండిన పక్షమున స్త్రీశిశువులను ప్రసవింతురనియు, కారము నెక్కువగా తినుచుండినపక్షమున పురుష శిశువులను కందురనియు జర్మను పరిశోధకులు నిశ్చయించినటు పత్రికలలో ప్రకటింపబడినది. నూటికి తొంబదియేడుగురు గర్భవతుల విషయములో పైనివ్రాసినట్లు జరిగెననికూడ ఆపత్రికలు ప్రకటించినవి. ఆప్రకటనయొక్క నిజానిజములు బహుకాలమనేకులు ఈదృష్టితో శోధించి నిర్ణయించినగాని నిర్ధారణచేయజాలము.

## వృక్షములు కూడ జీవులనుటలో విశేషము

సంస్కృత భారతమునందును, నన్నయరచించిన తెనుగు భారతమునందును, ఓషధులును, వృక్షములునుగూడ స్థావరములైనను ప్రాణులేయని ప్రవచింపబడినది. నిన్న మొన్నటిదాక పాశ్చాత్య వైజ్ఞానికులకు ఈవిజ్ఞానవిశేషము తెలియదు. వేలకొలది సంవత్సరముల క్రిందటనే, భారతీయులు, ఓషధులను, వృక్షములను ఉద్భిజ్జ జీవవర్గమున జేర్చుట చూడజూడ వారలీవిజ్ఞానవిషయమున నెంత ముందునకు పోగలిగినది స్పష్టమై విస్మయ మొనవింపగలదు.

ఇటీవల భారతీయ వైజ్ఞానికోత్తముడు – జగదీశచంద్రబోసు – చాలగొప్ప పరిశోధనలచేసి, మానవులకువలెనే వృక్షములకుగూడ కష్టము, సుఖము, సంతోషము, విచారము, మొదలగు నంతఃకరణ

ప్రవృత్తులతోఁ గూడిన చైతన్యముకలదని జగద్వంద్యముగా ఋజువు చేసినాడు.

బహుప్రాచీన కాలమందే మనవారు వృక్షౌషధులను జీవవర్గమున జేర్చి ప్రశంసించిరి. అందువలన నానాడు వారి విజ్ఞానమెంత యున్నత స్థితికివచ్చెనో మనకు బాగుగా ఋజువగుచు మన కానందాశ్చర్యముల గూర్చుచేకాక, తఱచినకొలది, ప్రాచీనసంస్కృతిలో నింకను ఏమేమి విశేషములు గుప్తముగా నున్నవో తెలిసికోవలె నను నభిలాష గాఢ మగుచున్నది.

## 20. శిల్పశాస్త్ర యంత్రశాస్త్రములు

వెనుకటి ప్రకరణములో నన్నయ తెలిపిన జీవశాస్త్ర సంతాన శాస్త్ర వివరములను విమర్శించితిమి. ఈప్రకరణమున భారతమున వర్ణింపబడిన శిల్పయంత్రములనుగూర్చి తెలిసికొందము.

దేవతలకు విశ్వకర్మ శిల్పి; యంత్రవేత్త. రాక్షసులకు మయుఁడు శిల్పి; యంత్రజ్ఞుడు. శిల్పవిద్యయందును, యంత్రమర్మజ్ఞతయందును, మయజాతివారు ఇతరశిల్పులను యంత్రజ్ఞులను తలదన్నిన ప్రావీణ్యము కలవారు. రావణాసురుభార్య మండోదరి తండ్రియగు మయుడు ప్రత్యేకముగా తయారుచేసి రావణునికిచ్చిన 'శక్తి' యారక్కసుడు లక్ష్మణునిపై ప్రయోగింపగా, శ్రీరాముడు ప్రతిక్రియ, చేయలేక పోగా, లక్ష్మణుడు నేలగూలెను. 'అలోలక్ష్మణా' యని యేడ్చి యేడ్చి, పిమ్మట హనుమంతునిచే సంజీవి తెప్పించి, పోసి, రాముడు తమ్ముని బ్రతికించుకొనెను. వింధ్యపర్వత సీమలలో మయశిల్ప విశేషములను వాల్మీకిరామాయణమున వర్ణించెను. మయుడొక్క మనుష్యుడుకాడు. అదియొకజాతి. దక్షిణ భరతఖండవాసులతో పడక మయులు పైదేశములకు వలస బోవుచుండిరి. ఈజిప్టులో పిరమిడ్లు నిర్మించిన శిల్పులు తెనుగు, తమిళ, మయజాతులు. అమెరికాలో మయశిల్పము లిటీవల (Harvard) హార్వర్డు యూనివర్సిటీ పరిశోధకుల మూలముగా బహిర్గతములైనవి – వివరములు (Modern Review) పత్రికలో ప్రకటింపబడినవి– మయజాతుల జ్యోతిర్వి

జ్ఞాన మత్యద్భుతము. అధికమాస, క్షయమాసాది సంస్కారముల కవసరములేక ఆ మయుల పంచాంగములు సరిగా కాలము సూచించు నట! వివరములు తెలియవు.

మనమిపుడు ముఖ్యముగా ధర్మరాజునకు మయుడిచ్చిన సభా విశేషములను తెలిసికోవలెను. బిందుసరమున భద్రపరుపబడిన యుపకరణములతో మయుడా సభ పదునాలుగునెలలు నిర్మించెను. ఎనిమిదివేల రాక్షసకింకరులు, మహాకాయులు మహాజవసత్త్వ సంపన్నులు అంతరిక్షచరు లాసభను మోసితెచ్చి ధర్మరాజునకు ఇచ్చిరి. ఇంద్రప్రస్థమున పురామయుత్రవ్వి నిర్మించిన సభకాదది. బహుదూరమున నిర్మించి, మోయించి తెచ్చి, యింద్రప్రస్థమున నీసభ ప్రతిష్ఠింపబడెను. ఒక ప్రదేశమున మేడకట్టి దానిని వేరొకచోట ప్రతిష్ఠచేయునేర్పు ఈకాలమున నేశిల్పులకును, యంత్రజ్ఞులకునులేదు. మయసభా విశేషములుకొన్ని సభా 1-: 0, 1:, 12-13 రచనలో చూడగలము. సుయోధనునకు హృదయశల్యమైన యీ సభా విశేష ములను కొన్ని వానినోటనే విందము:- సభా 2:-139, 140. "ధారుణిపట్టి యపూర్వ సభారచనలు గలవె ? - 139, 140. నిర్మల స్ఫటికశిలా నిర్మితంబై శశిప్రకాశంబై వివిధరత్న సువర్ణమణి ప్రభాభాసురంబైన యాసభ చూచుచుం గ్రుమ్మరువాడ హరినీల బద్ధ సిద్ధమణిస్థలంబు జలాశయంబుగా వగచి పరిధానోత్కర్ష ణంబు సేసి విమలమణి శిలాతలబుద్ధి నుదక పరిపూర్ణంబయిన బావి సొచ్చి కట్టినపుట్టంబు దడియంద్రెళ్ళిన నన్నుంజూచి వృకోదరుండు నగియె నంతయునెఱింగి ధర్మరాజ చోదితులైన కింకరులు నాకుం బరిధానంబులు దెచ్చియిచ్చిరి. మఱియు వివృత ద్వారంబు సంవృత ద్వారంబని చొరకొల్లక సంవృత ద్వారంబు వివృతద్వారంబని చొరం బోయి తత్కవాట స్ఫటికశిల ఘటితలలాటుండనైన నన్ను ననేక సహస్రవిలాసినీ పరివృతయయియున్న ద్రౌపది నగియె నంత నకుల సహదేవులు పఱతెంచి యిదె వాకిలి యిట వచ్చునది యని నన్నుఁ దోడ్కొనిపోయి రట్టి సభా" ప్రలంభంబు నాకు హృదయశల్యంబయి

యున్నది. ఇందు వర్ణింపబడినట్లు 'దూడలు వేసిన' ఘనుడు కౌరవరాజు దుర్యోధనుడు. వానినిట్లు ముప్పుతిప్పలుబెట్టి మూడు చెఱువులనీళ్ళు త్రాగించిన దానవశిల్పి, మయునిశిల్ప కళాకుశలత్వమును మనమెంత మెచ్చుకోవలెను ? –

## స్వయంలేఖినీ యంత్ర యుక్తులు

మన తెనుగునాటి పెద్దపట్టణములలో నీటికుళాయిలుగల యిండ్లలో నెలకింతనీరు వాడుకయైనదని తమకుదామై దెలుపు 'మీటరు' యంత్రములున్నవి. విద్యుత్ శక్తిని వాడుకచేయు యిండ్లలో నెలకెంత విద్యుత్తు వాడుక చేయబడెనో తెలుపు యంత్రములున్నవి. ధర్మరాజు రాజసూయము చేసినప్పుడు లక్షమంది బ్రాహ్మణులు భోజనము చేయగానే, తనకుతానై మ్రోయు శంఖమొకటి యచట ప్రతిష్టింపబడెను.

(A self - registering Conch). సభా 2 – 115.

గీ॥ ఒక్కలక్ష భూసురోత్తముల్ గుడిచిన।
మొనసితనకు దాన మ్రోయుశంఖ।
మొక్కనిమిషమైన నుడుగక మ్రోసెన।
య్యధ్వరోత్సవంబు నన్నినాళ్ళు॥

## భేరులు తమంతట తాము మ్రోసి శత్రువులరాక నెఱింగించుట

జరాసంధుడేలిన మగధదేశమునకు రాజధాని గిరివ్రజపురము. ఆపట్టణము చుట్టును మహాపర్వతములైదు చుట్టి రక్షించుచుండుటచేత దానికి గిరివ్రజమని పేరువచ్చెను. గౌతమమహాముని యనుగ్రహము వలన నాపురమున శత్రులు ప్రవేశింప నేరరు. 'తొల్లింటి మాగధులు మానుషాదంబను ఋషభంబు వధియించి దాని చర్మంబున మూడు భేరులు నిర్మించి రవి యిప్పురంబు వింతవారు సొచ్చునప్పుడు అమ్మోసి శక్తింజేసి మ్రోయు" ఎద్దుచర్మముతో తయారుచేసిన భేరులు రిపు ప్రవేశవేళ తమకుతామై మ్రోయుననిన పాఠకులు నమ్మకపోవచ్చును.

కృష్ణదేవరాయలవారు విజయనగరమున కట్టబడిన విఠలస్వామి ఆలయమున చిన్నచిన్న రాతి స్తంభములు గలవు. అందొక్కొక్కటి యొక్కొక్క స్వరము చొప్పున సరిగమాది సప్తస్వరములును చక్కగా పలుకుచుండును. రాతిస్తంభములచే సప్తస్వరములను పలికించి పాట పాడించిన శిల్పిశక్తి నేమనికొనియాడవలెను? రాతిచే నింతపని చేయించిన భరతశిల్పి ఋషభచర్మముచే భేరులు తయారుచేసిన నవి తమకు తామై మ్రోయుట ఏమి యబ్బురము?

## చాక్షుషి

అంగారపర్ణుండను గంధర్వుడు అర్జునునిచే నోడింపబడి చిత్రరథుడై యిట్లు పలికెను:— ఆది. 7 - 51.

"ఇది మొదలుగాఁ జిత్రరథుండ నయ్యెద. నీ పరాక్రమంబునకు మెచ్చితి, నీతోడి సఖ్యంబు నాకభిమతంబయిన యది నాతపంబునం బడయంబడిన చాక్షుషి యను విద్య నీకిచ్చెద దీనిం దొల్లి మనువు వలన సోముండు వడసె, సోమునివలన గంధర్వపతి యయిన విశ్వావసుండువడసె వానివలన నేనుంబడసితి నెవ్వండేని మూడులోకంబులం జూడనిచ్చగించు నాతండు దన యిచ్చకుం దగ నీవిద్య పెంపున సర్వంబునుంజూచు నేముదీనంజేసి కాదె మానవులకు విశిష్టులమై, దానవుల చేత శాసింపంబడక జీవించెద మిది కాపురుష ప్రాప్తంబై ఫలియింపదు." ఈనాటికింకను పరిపక్వస్థితికి రాని దూరదర్శన విద్య ప్రాచీన భారతీయులకు కొందరికి తెలిసియుండెననిన నవీన వైజ్ఞానికులు పెదవి విరిచి, శంకాన్వితస్వాంతులై సాభిప్రాయముగా మందహాసము చేయుదురు. అట్టివారికి మేమొక్క విన్నపము చేయుదుము. మనయెదుట నగ్నిగుండముల నడుచుచుపోవు వారి కాళ్ళు గాలవు. కొందరుయోగులు కలకండవలె ఘోరవిషముల తినుచుందురు; గంధకికామ్లము (Sulphuric acid) ను కాఫీవలెనే త్రాగి చెక్కుచెదరక యుందురు. ఈ యోగులను విషాగ్నులేల బాధింపవు? ఈనాడు మనకు తెలిసిన భౌతికవిజ్ఞానమున కతీతమైన యోగవిజ్ఞానము గలదు. దానిం దెలిసికొనుటకు

ప్రయత్నింపక, పరిశోధనలు చేయక, ఊరక హేళనచేయుట విజ్ఞాన వేత్తలకు తగినపని కాదు. పరిశోధించి నిజము తెలిసికొని ప్రతిష్ఠించుట వారి కనీసధర్మము. అట్లుచేయజాలనివారు మాకు తెలియదని దండము పెట్టి యూరకుండుట మేలు. హేళనమాత్రముచే ఎన్నడును విజ్ఞానాభివృద్ధి కాలేదు; కాజాలదు.

## వాయువిమానములు - విమానయానము

బహుయుగముల క్రిందటనే వ్యోమయానము భరత ఖండమున పరిపక్వ స్థితికి వచ్చియుండెను.

దేవతల కందరకును ఎవరి విమానములువారికి ప్రత్యేకముగా నుండెడివి. కుబేరుని పుష్పకమును రావణుడు లాగు కొనెను. శ్రీరాముడు రావణునిజంపి లంకనుండి యయోధ్యకు సమస్త పరివారముతో పుష్పక విమానమునెక్కి వెడలెను. ఎంద రెక్కినను చోటుచాల దనుమాట లేక పుష్పకము విస్తరించుచునే యుండెను. భారతకథకును, రామరాజభూషణుని వసుచరిత్రకును మూలపురుషుడు చేదిరాజైన ఉపరిచరవసువు. ఇంద్రుడు ఈ చేదిప్రభున కిచ్చిన విమానమును భారత మిట్లు వర్ణించుచున్నది.

ఇంద్రః ఉవాచ: 63 - 13, 14

13. దైవోప భోగ్యం దివ్యం త్వామాకాశేస్ఫాటికం మహత్ ।
ఆకాశగం త్వాం మద్దత్తం విమాన ముపపత్స్య తే।

14. త్వమేకస్సర్వ మర్త్యేషు విమాన వరమాస్థితః
చరిష్యత్యుపరిస్థోహి దేవో విగ్రహవానివ ॥

కనకరత్నమయంబైన దివ్యవిమానంబు; తద్విమానారూఢుండై, యుపరిలోకంబునం జరియించుటం జేసి, యుపరిచరుండను నాబరగి...

ఉపరిచరుడు తన విమానముతోకూడ నక్షత్రరూపుడై దక్షిణాకాశమున మెఱయుచున్నాడు. 1752 లో దక్షిణసముద్రములపై నౌకాయానము చేయుచు నీచుక్కల గనిపెట్టిన (Lacai le) దొరకు కూడ ఇందు ఉపరిచరశిలమైన విమానరూపము గోచరించి ఆయతము

వచ్చునట్లు - లాటిన్ భాషలో (Caelum) అని నామకరణముచేసి, యత డీచుక్కలగుంపును పడమటివారి నక్షత్రపట్టిక చేర్చెను - విమాన రూపముగలిగి వ్యోమచరము లైనట్లుగపడు ఉపరిచరవసు నక్షత్రరూప మిచట చూడనగును.

మనపూర్వులకు అనేకవేల సంవత్సరములకు పూర్వము తెలిసి యుండిన ఉపరిచరవసు - నక్షత్రసమూహము రెండువందల యేండ్ల క్రిందవఱకు పాశ్చాత్యులకు తెలియదు. పిమ్మట 1752 లో (La Caille) లాకెయిల్ దీనికి (Caelum) అని పేరుపెట్టెను. ఆమాటకు (Heavens) స్వర్గము అని అర్థము. - మనవారి - ఉపరిచరశబ్దము ఇందువలన ధ్రువ పడుచున్నది.

## సర్ప విజ్ఞానము

ఋగ్వేదమునందును, భారతమునందును సర్పజాతిం గుఱించి యనేకాంశములు తెలుపబడినవి. కద్రూవినతల • పన్నిదములో సాపత్న్య విరోధభావమేకాదు; మఱియొక విశేషము అందు నిగూఢ ముగానున్నది. పన్నగములా? లేక మానవ, విహంగములా యీభూమి కధిపతులు ? ఎవరేలవలెనను పెద్దసమస్య అందు ఇమిడియున్నది-సింహ శార్దూలాది వన్యమృగములు విశేషప్రయాసము లేకుండ మానవునకు లొంగి వశమయినవి. కద్రూ, కర్కోటకులవంటి పాపజాతి పన్నగ ములకును, మానవజాతికిని పోరు ఇంకను చల్లారలేదు. తక్షకుడు పరీక్షిన్మహారాజును గఱచి చంపుటయు, జనమేజయుడు సర్పయాగము చేయుటయు Struggle for Power పన్నగ మానవజాతులలో మహీ మండలమున కధిపతులై యేలవలసిన వారెవరను పోరాటమునకు నిదర్శనములు. ఈతగువు ఇంకను పరిష్కారముకాలేదు. బుసలు కొట్టుచు పడగవిప్పియాడు భుజంగమునుజూచి దిగులుపడక ఎదిరించు మానవులసంఖ్య చాలతక్కువ. తలప్రాణము తోకకువచ్చినను మానక, తుదవఱకు పోరుసాగించు సర్పము, మహావీరుల శౌర్యస్థైర్య ములను స్ఫురింపచేయుచుండును. పరీక్షిన్మహారాజునకు తక్షకునివలన భయము లేకుండ బ్రతికింతునని కశ్యపుడను బ్రాహ్మణుడు వచ్చుచుండ,

దారిలో తక్షకుడు కపటవిప్రవేషము ధరించి కశ్యపుని కూడముట్టి, ఆగమన ప్రయోజనము నెఱిగి, ఇట్లనియె :- ఆది. 2 - 187.

వ. నీమందులు నీమంత్రంబులు నాయందు నీకుంబనిసేయవు; క్రమ్మఱి పొమ్ము; కాదేని నీవచూడ నివ్వటవృక్షంబుగఱచి నావిషానలంబున భస్మంబుసేసెద నోపుదేని దీని సంజీవితంబు జేయుమని తక్షకుం డావృక్షంబుఁ గఱచిన

188...అవ్వటతరువు భస్మమయ్యెఁ దక్షణంబ

189. కశ్యపుండు నాభస్మచయంబుఁ గూడఁద్రోచి తనమంత్రతంత్రశక్తిం జేసి యెప్పటియట్ల వృక్షంబు జేసిసంజూచి తక్షకుం డతివిస్మయంబంది...మునీంద్రా! పరిక్షితుం డిచ్చు ధనంబుకంటె నాయం దధికధనంబు గొనిపొమ్మనిన ... కశ్యపుండు తక్షకువలన ననంతంబైన యర్థంబుగొని గ్రమ్మఱిచనియె." - ఇంతవఱకు సంస్కృత మూలమునగలదు. ఈక్రింది వాక్యములు తెనుగు భారతమున నన్నయ జేర్చెను :-

189. "ఇట్లు విజనంబైన విపినాంతరంబుననైన యయ్యిరువుర వృత్తాంతంబు మీరెట్లెఱిగితిరం చేని వినుము.

190. గీ. ఇప్పురంబున బ్రాహ్మణుం డింధనార్థ
మేగియున్న యావృక్షంబునెక్కి దాని
తోన దగ్ధుడై మఱిదానితోన లబ్ధ
జీవుడైవచ్చి జనులకు చెప్పెదీని."

ఇది అసాధారణ వృత్తాంతము. కాని సర్వసాధారణముగా విషోరగ దష్టులైనమానవులు ప్రమద్వరవలెనే నేలగూలి యసువులుబాయుదురు.

## ఆ యు ర్దా న ము

ప్రమద్వర భర్త రురుడనువాడు పత్నీవియోగమున శోకక్రాక్రోశించుచుండ నాకాశంబుననుండి యొక్కదేవదూత వాని కిట్లనియె ఆది. 1 - 150. "అమ్మా కాలవశంబుననైన ధానిదీర్ఘ నెవ్వరికిం దరంబుగాదు. ఒక్కయుపాయంబుగలదు. చేయనోపుదేని చెప్పెద

వినుము నీయాయుష్యంబునం దర్ధంబు ఇక్కన్యకునిమ్మనిన రురుండట్లు చేయుదునని తన యాయుష్యంబునందర్ధంబక్కన్యక కిచ్చిన నక్కోమలి దొల్లింటికంటె నధికశృంగార సమన్వితయై విమనిర్ముక్తయయ్యె."

ఈనాటి రోగచికిత్సాలయములో వికలాంగముల పరిహరించి, వాని స్థానములందు మంచియంగముల నతుకుటకలదు. మనుమని మొట్టిచెవి తీసివైచి, వాని యవ్వానికి దానముచేసిన తనమంచిచెవి నచ్చట శస్త్రచికిత్సకు లతికిరి. బలహీనుల నిమిత్తము రక్తప్రదానము గావించుటకు (Bloob Banks) నెత్తురుకొఠీలు చికిత్సాలయములలో ప్రతిష్ఠింపబడినవి. దీనికిపైమెట్టు ఆయుర్దాయ ప్రదానము. మహాత్మా గాంధిగారి కొకప్పుడు ప్రాణముమీదికిరాగా ఒకయోగి తన యాయుర్దాయములో శేషము గాంధీగారికాతాకు మార్చి తాను మరణించె ననియు, అప్పటినుండి గాంధిగారి ఆరోగ్యము బాగుపడి ఆయన పునర్జీవితుడయ్యెననియు నప్పటిపత్రికలలో ప్రకటింపబడెను. ప్రత్యక్షముగా ఋజువుచేయజాలని విషయములను వైజ్ఞానికు లంగీకరింపరు. ఈనాటి వైజ్ఞానికు లెరుగని యోగవిషయములనేకములు పతంజలి మొదలగు మహానీయులెఱుగుదురు. పాశ్చాత్య వైజ్ఞానికులు పోవుచున్న పోకడలనేపోక, భారతీయ వైజ్ఞానికులు భారతమునగల యపూర్వవైజ్ఞానిక విశేషములను పరిశోధించి, యాథార్థ్య మెఱిగి, లోకమునకు ప్రకటింపవలసిన బాధ్యత తమపై గలదని గుఱుతింతురు గాక.

## పాములకు రెండు నాలుకలు

"పాపవ్యవసాయులు చెయ్వులర్థవంతము లగునే? అను నీతి సత్యమునన్నయ మొదటనే తెలిపియున్నాడు. కద్రూకర్కోటకుల దుర్మంత్రమున దాసియైనవినత దాస్యమును, వినతాపుత్రుని దాస్యమును, వాయుటకు, వినతాపుత్రుండు, గరుత్మంతుడు అమృతభాండము భుజంగులకు అందియ్యవలసి వచ్చెను. గరుడుడు ఇంద్రుని భంగపఱచి యమృతము తెచ్చి, నేలపెట్టకూడదని దర్భలూ చాపవలె పఱచిఅందుపై నాభాండమునుంచి తనకును తల్లికిని దాస్య విముక్తి యైన దనిపించు

కొని, వెడలిపోయెను. గరుడుని వెనుకనే వచ్చుచున్న ఇంద్రుడు వైనతేయుని గాస్యవిముక్తి కాగానే అమృతభాండము నపహరించి కొంపోయెను. అమృతభాండ స్పర్శచే దర్భలు పవిత్రము లైనవి - ఉరగులు అమృతం బుపయోగింపం గానక దాని యున్నస్థానం బని దర్భలు నాకిన నాలుకలు రెండుగా వ్రయ్యుటంజేసి నాఁటంగోలె ద్విజిహ్వాలుం డాఁబరగిరి. (ఆది 2-119). మానవులలో సత్యము, మాటనిలకడ పాటింపని నీచులను విషనాగులవలె రెండు నాలుకల వాండ్రండ్రదురు.

## భుజగములు వాయుభుక్కులు

వినతయెడ కద్రూకర్కోటకులు చేసిన కపటమునకు దుఃఖించి శేషుడు తల్లిని, తోడబుట్టినవారిని, వదిలిపెట్టి తపస్సున కరిగెను:- సంస్కృత భారతము 36 - 2.

" తేషాంతుభగవాన్ శేషః కద్రూంత్యక్త్వామహాయశాః
ఉగ్రంతపః సమాతస్థే వాయుభక్షోయతవ్రతః॥ "

శేషుడు విష్ణుభగవానుని మడుగు పాన్పు. నన్నయ వర్ణించినట్లు " దుస్సహాతరమూర్తికిన్ జలధిశాయికి పాయకశయ్యయైన యయ్యహిపతి దుష్కృతాంతకు డనంతుడు " - శేషమూర్తి. శేషునిప్రక్కనే స్వాతి నక్షత్రమున్నది. స్వాతివాయుదైవత్యము. తఱుగు విఱుగులేని వాయుసంపద శేషునిప్రక్కనే కలదు. కాబట్టి శేషుడును, నాగ జాతియు వాయు భుక్కులైరి. శ్రీనాథుడు నైషధమున నీయంశ మును కడురమ్యముగా నిట్లువర్ణించినాడు.

గీ॥ అమృతమధురంబులగు గాడ్పులానియాని
బొజ్జపెంచిన పెనుపాప సెజ్జమీఁద
పాల మున్నీటిలో శౌరి పవ్వళించు.

శృంగార నైషధము 5 - 47.

# సర్వోత్కృష్టమైన ప్రేమ

ఇంద్రునివరమున గరుత్మంతుడు భుజంగభుక్కు; అయినను భగవత్ సన్నిధానమున ప్రేమతప్ప మరొకభావము పొడచూపుటకు తావు లేదు. విష్ణుభగవానునికి శేషఫణము లాతపత్రములు; శేషుని శరీరము మడుగుబాన్పు. గరుడుడు ఆ.దేవదేవుని పాదసేవకుడు. శేషగరుడుల మధ్య ప్రేమభావముతప్ప మరొకభావములేదు. బుద్ధభగవానుడు, ఏసుక్రీస్తు, గాంధీమహాత్ముడు, రవీంద్రనాధుడు మొదలగు మహా మహులు ఏప్రేమయొక్క ఉత్కృష్టత గమనించి వారివారి జీవిత సందేశములను ప్రవచించి యుండిరో ఆప్రేమసందేశమునే నన్నయ కణ్వాశ్రమవర్ణన మిషమున లోకమున కందిచ్చినాడు. సంస్కృత మూలమున లేకున్నను, నన్నయకదొక ఆటంకముకాదు. ఆర్షసాం ప్రదాయ ప్రవక్తకుడగుట నన్నపార్యుడు “అహింసాపరమోధర్మః” అను వాక్యార్థము మఱువరాకుండ దృష్టాంతపూర్వకముగ కణ్వా శ్రమమున నిరూపించి ధన్యుడయినాడు: ఆది - 4 - 21, 22 - కణ్వా శ్రమమొక విశ్వవిద్యాలయము. పుణ్యానదీతీరంబునఁ దద్దయు రమ్యం బైన నరనారాయణ స్థానంబునుంబోలె జగత్పావనంబగుచున్న కణ్వ మహాముని యాశ్రమంబు గనియందు.

22. సీ॥ శ్రవణసుఖంబుగా సామగానంబులు సదివెడు శుకముల చదువుదగిలి।
కదలక వినుచుండు కరులయుఁ గరికర శీతలచ్ఛాయఁ దచ్ఛీకరంబు।
కణములచల్లని గాడ్పానపడి వానిఁజెంది సుఖంబున్న సింహములయు।
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి పెట్టు నీవారాన్న పిండతతులు।
కడఁగి భక్షింపనొక్కటఁ గలసియాడుచున్న యెలుకల పిల్లులయొండు సహజ।
వైరి సత్త్వంబులయు సహవాసమపుడు సూచిమునిశక్తి కెంతయు జోద్యమంది”

కణ్వుఁడు ప్రేమమూర్తి. జననీజనకులుభయులచే పరిత్యక్తయై, "శకుంత సంరక్షితయై, చెలగి లేవనేర్చు చిఱుతుకదాని" నెత్తితెచ్చి పెంచిన కరుణాసముద్రుడు. అతని యాశ్రమమున విరోధ విద్వేషములకు తావులేదు. విష్ణుసాన్నిధ్యమున, శేషగరుడులు, కణ్వాశ్రమమున, నెలుకలకు పిల్లులకు, నేనుగులకు సింహములకు మధ్య ద్వేషములు లేవు. ఆశ్రమమంతయు ప్రేమమయము. Example is better than precep అని ఇంగ్లీషులో చక్కని సామ్యమున్నది. ధర్మప్రసన్నములు ఊరక చెప్పుటకంటె చేసిచూపుట మేలు. ప్రేమకన్న నితరము లేదని పలుమారుచెప్పి యూరకుండుటకంటె దృష్టాంతపూర్వక నిరూపణ ప్రవచనములనంత ఫలప్రదములగునని నన్నయ్య యెఱిగి కణ్వాశ్రమ విశేషములిట్లు వర్ణించి ధన్యుడైనాడు.

## Man's Selfish Greed

బుద్ధభగవానుడు, క్రీస్తు, నన్నయభట్టారకుడు, గాంధిమహాత్ముడు మొదలగు విశాలహృదయు లెవరెంతమంది యెన్నివిధముల బోధించి నను మానవునిలో స్వార్థము మాత్రమంతరించదు. మానవస్వభావము కుక్కతోకవలె చక్కబడదు. ఇద్దరుభార్యలు నైదుగురు కొడుకులు గల యయాతికి కామభోగేచ్ఛలయందు తృప్తికలుగక, తనకు యౌవనమునిచ్చిన కొడుకునకు తనయనంతరము రాజ్యాధికారమిత్తు ననెను. కడపటికొడుకు పూరు డందు కంగీకరించెను. ఆనాటివైద్యులు ఏతంత్రము నవలంబించి యేశరీరగ్రంథుల (Glands) నేమిచేసిరోగాని, యయాతి వార్ధక్యము పూరునకును, పూరుని యౌవనము యయాతికిని ప్రాప్తింపజేసిరి. ఈనాటివైద్యులు పరిశోధనలుచేసి ఇదియెట్లు సాధింపవచ్చునో తెలిసికొందురుగాక !

యయాతియొక్క కుమారుని యౌవనమునుమాత్రమే కాంక్షించెను. కాని స్వార్థమునకు మితమేమున్నది ? ఆశాపాశమునకు అంత మెక్కడ ? రావణకీచకుల స్త్రీకాంక్ష, దుర్యోధనాదుల రాజ్యకాంక్ష లోకోపద్రవహేతువులైనవి. లోకములో దురంతములకు స్వార్థ కాంక్షలే ముఖ్యకారణములు. స్వార్థముతో పాపచింత; పాపచింతతో

సాధుబాధ; పాపవ్యవసాయుల చేతలు ఫలప్రదములు కానేరవు, పాపశీలురు తాము నశించుటేగాక, తమమూలముగా నుత్తముల కెందరికో హింసగలిగింప చేయుదురు. దుర్యోధనుని మూలముగా పుణ్యశ్లోకులు భీష్మద్రోణులకు ప్రాణహాని వాటిల్లె. (This is the tragic fact of the world, which is often pointed out by Great men of letters - like Vyasa, and Shakespeare.)

## జీ వ శా స్త్ర రీ త్యా యు ద్ధ మ త్య వ స ర ము

జెర్మనీదేశీయుల స్వార్థము మూలముగా గత నలుబది సంవత్సరములలో ప్రపంచమహాయుద్ధములు రెండుసారులు జరిగినవి. జెర్మను వైజ్ఞానికులు జీవశాస్త్రదృష్ట్యా ఈయుద్ధములు తప్పవని బాహాటముగా ప్రకటించి అమాయకు లనేకులకు అత్యంతముగా బాధలు తెచ్చిపెట్టిరి. కురుక్షేత్ర మహాసంగ్రామముకూడ భగవత్సంకల్పానుసారము జీవశాస్త్రావసరములనుబట్టియే జరిగెనని తోచుచున్నది. ఆది. 7 – 266. " అట్లవైవస్వతుండును నైమిశారణ్యంబున సత్రయాగదీక్షితుండై ప్రాణిహింసకు నోపకుండుటంజేసి మానవుల ప్రాప్తమరణులై వర్తించుచున్న... 267 ... ఆతండంతము నొందించు దొంటియట్టుల జనులన్ "

భారతయుద్ధారంభమున నర్జునుడు మోహావిష్టుడై జనులసంహారింప నోపక యున్నప్పుడు శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు భగవద్గీతల నుపదేశించి విశ్వరూపమును ప్రదర్శించెను. పరస్పరస్పర్థచే మహానదులు సముద్రమును చొచ్చుచున్నట్లే కౌరవపాండవ పక్షపాతులై కురుక్షేత్రమున సమావేశమైన యోధులందఱును త్వరమాణులై విశ్వరూపుని నోటంబడిపోవుచుండిరి, అర్జునుడా దృశ్యమును చూచి మిక్కిలి భయపడి " దేవా! నీవెవరు? వీరందరు నీనోట బడిపోవుచున్నారు. కారణమేమియని యడుగగా, శ్రీకృష్ణపరమాత్మ కాలోస్మి లోకక్షయకృత్ప్రవృద్ధోలోకాన్సమాహర్తు మిహప్రవృత్తః " నేను కాలుడను. వీరందరకు కాలము సరిపడినది. కనుక సంహరించుచున్నా నని ప్రత్యుత్తరమిచ్చెను.

## ప్రజాక్షయ కారణములగు మహాయుద్ధములకు స్త్రీయే మూలము

పదునెనిమిది యక్షౌహిణుల సైన్యము పదునెనిమిది దినములలో కురుక్షేత్రమున హతమయ్యెను. ఈ మహాయుద్ధమునకు ద్రౌపదియే కారణము. ఆమె మహాశక్తి స్వరూపిణి - రుద్రపత్ని - దుర్గాంశ సంభూతురాలని కొన్నిగ్రంథములలో గలదు. ఈయర్థముధ్వనించు వాక్యము మూలభారతమున గలదు.

ఆది 187 - 8... జిగీషమాణా ద్రుపదాత్మజాం తాం

చకాశిరే పర్వతరాజ కన్యాముమాం యథా దేవగణాస్సమేతాః

దేవాసురులకు అమృతము సరిగాపంచి యిత్తునని నమ్మజెప్పుచు మోహిని రాక్షసుల కన్యాయము చేయుటచే దేవదానవ యుద్ధము జరిగినది - సీతాపహరణము మూలముగా రామరావణ యుద్ధమైనది. జగదేకసుందరి హెలెను (Helen) ను పారిసనువాడు అపహరించుటచే ట్రోజాన్ మహాయుద్ధమైనది. వాల్మీకి రామాయణము రచించినట్లే హోమరుమహాకవి గ్రీకుభాషలో 'ఇల్లియడ్' మహాకావ్యము రచించి ట్రోజాను యుద్ధము నభివర్ణించెను. భారత రామాయణములు భారతీయులకును, ఇలియడ్ గ్రీకులకును సమగ్రశాస్త్ర రత్నాకరములు.

యుద్ధవిషయములు విజ్ఞానవిషయములు కావనియు, నన్నపార్యుని విజ్ఞాననిరతి విమర్శించుపట్టున నివియప్రస్తుతములు (irrelevent) అనియు కొందరు పాఠకు లాక్షేపించవచ్చును. కాని యీయాక్షేపము సరికాదు. ఏమనగా యుద్ధతంత్రము (Military Science); రాజ్యతంత్రము (Political - Science) కాబట్టి ఇవికూడ విజ్ఞానవిషయములనియు, వీనిని ప్రశంసింపక విడుచుట దోషమగుననియు మాసమాధానము.

## రాజ్యతంత్ర విజ్ఞానము

రాజ్యతంత్రవిజ్ఞానము ప్రకటించు తావులలో నన్నయభట్టారకు డసాధారణప్రజ్ఞ ప్రదర్శించినాడు. మయసభోపవిష్టుడైన ధర్మరాజుంజూచి నారదు డడిగిన ప్రశ్నలలో నద్వితీయ రాజకీయ ప్రతిభ

గోచరించుచున్నది. అందును సంస్కృతమూలమున సంగ్రహముగా నంటి విడిచిన ముఖ్యాంశములను, తెనుగుప్రజల మేలుగోరి నన్నయ ఎంతచక్కగా వివరించి వ్రాసెనో పాఠకుల కెఱిగించుట యత్యావశ్యకము. సభా 5 - 22

"బలాబలేన సమ్యక్ త్వం చతుర్దశ పరీక్షసే?" అనిమాత్రము సంస్కృతమూలమున కలదు. కాని యారాజదోషములు పదునాల్గును ఏవేవో తెలుపక, యాదోషములసంఖ్య పదునాలుగని మాత్రము మూలమునగలదు. తెనుగుప్రజల మేలుకోరి, రాజనరేంద్రుడు "కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థ మేర్పడ తెనుగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్" అని నన్నయను కోరియుండెను. కాబట్టి నన్నయ పదునాల్గు సంఖ్య యుగ్గడించి యూరకుండక ఆదోషములనిట్లు వివరించి తెలిపినాడు: సభా 1 - 55

"మఱియు నాస్తిక్యంబు+అనృతంబు, ప్రమాదంబు+ఆలస్యంబు, అనర్థజ్ఞులతోడం జింతనంబు, క్రోధంబు, దీర్ఘసూత్రత, యెఱుకగలవారి నెఱుంగమి, యర్థంబులయం దనర్థకచింత, నిశ్చితకార్యంబులు సేయమి మంత్రంబులు రక్షింపమి, శుభంబులు ప్రయోగింపమి విషయంబులం దగులుట యనబఱగిన పదునాలుగు రాజదోషంబులం బరిహరింతె" యని యడిగిన నారదునకు ధర్మరాజిట్లనియె"

## నా ర దు డు

నేడు రేడియోమూలముగా నిర్వర్తింపబడుచున్న దైనందిన కార్యక్రమమంతయు నాడు నారదునిద్వారా జరుగుచుండెను. భారతశ్రుతి విధాతయైన వేదవ్యాసుడే బ్రహ్మమానసపుత్రుడగు నీనారదు నిట్లుప్రశంసించి యున్నాడు. భాగ 1 - 91, 92

"మునీంద్రా! నీవు సూర్యునిభంగి ముల్లోకంబులం జరింతువు; వాయువుపగిది సకలజనులలో నన్మెలగుదువు... దిక్కులమెట్టితివి — మహాప్రబోధముల తుదముట్టితివి" ఇప్పటి రేడియోవలెనే నారదుడు ముందుగా వార్తాహరుడు. రాజ్యప్రవర్తకులకు వార్తాప్రాముఖ్యము,

నారదుడు ధర్మరాజునకు స్వయముగానిట్లు తెలియజెప్పినాడు:
సభా 1 - 50

గీ॥ వార్తయందుజగము వర్తిల్లుచున్నది
యదియులేనినాఁడ యఖిలజనులు
నంధకార మగ్నులగుదురుగావున
వార్తనిర్వహింపవలయు బతికి ॥"

ఒకచోటి వార్తావిశేషములు మరొకచోట తెలుపుచుండుటచేత, అనుకూలముగా కలహాములు ప్రాప్తించుటచేతను, నారదుడు కలహభోజనుడనబడుచున్నాడు. 1914 లో మొదటి ప్రపంచయుద్ధము, రేడియోవార్తల మూలముగానే, జర్మనీ, ఫ్రాన్సు, రష్యా, ఇంగ్లండు దేశములమధ్య నతిత్వరలో ప్రాసగి, మహాగ్నిజ్వాలవలె ప్రపంచమంతటను చుట్టుముట్టినది.

రెండవది-నారదుడు సంగీతకళానిధి. ఏయంతఃపురమునకైన నిస్సంశయముగా పోవుచుండువాడు.

మూడవది, కర్తవ్యోపదేశము, భావోపన్యాసము, కార్యనిశ్చయము లోనగు నన్నికార్యములలో నారదుడు సమస్తజనులకు తోడు పడుచుండువాడు. ఈ సందర్భముల నన్నింటిని పట్టి చూడగా నాటి నారదుడే నేటి రేడియోరూపమున వెలసినాడా? యని తోపగలదు. తపస్స్వాధ్యాయ నిరతులు, యోగయుక్తులు నైన మహామునులు వర్తమానపరిస్థితులనేగాక భూతభవిష్యత్తులనుకూడ చక్కగా తెలిసికొనగల్గుచుండిరి. నేటివిజ్ఞానము ఆ యున్నతస్థితికి రాలేదు.

## అశ్వహృదయము

పూర్వకాలమున నొక ప్రదేశము నుండి మరొక ప్రదేశమునకు పోవలెనన్న వడిగల గుఱ్ఱములనుబూన్చిన రథముల నెక్కి ప్రయాణము సాగించెడివారు. అశ్వముల మనస్తత్త్వమెఱిగి, వానిని వశము చేసికొని, వాయువేగముతో వానిని నడుపగల సారథులుండిరి. ఇంద్రుని సారథి మాతలి యశ్వవిద్యావిదుడు. శాలిహోత్రుడు నట్టివాడే

నలుడు కాలవశమున బాహుకుడను మారుపేరుతో నయోధ్యరాజు ఋతుపర్ణుని కొలువున నుండెను. అయోధ్యనుండి విదర్భ తొమ్మిది వందలమైళ్ళకు పైమించినదూరమున నుండెను. దమయంతి ద్వితీయ స్వయంవరనిమిషమున ఒక్కనాటిలో బాహుక ఋతుపర్ణులు విదర్భకు పోవలసిన వారైరి. అయినను, అశ్వహృదయ విదుడగు నలుడు ఋతుపర్ణుని సాయంకాలమునకు విదర్భ చేర్చెను. పంచపాండవులలో నకులుడు అశ్వశాస్త్రప్రవీణుడు. అజ్ఞాతవాసకాలమున విరటుని యశ్వశాలాధికారియై నకులుడు కాలము గడపెను. నకులునిగూర్చి చిత్రమైన కథగలదు. ఇంద్రప్రస్థమునుండి తక్షణమే ద్వారకకు పోవలసిన యవసరము కలిగెను. ఆవేళకు జోరునవాన కురుయుచున్నను ఆగక, నకులుడు గుఱ్ఱమునెక్కి చినుకునకునుచినుకునకుమధ్య కాళీప్రదేశముల మీదుగా గుఱ్ఱమునునడిపించి, యొక్కచినుకైన మీదపడకుండ పొడి దుస్తులతోనే ద్వారకచేరి, కార్యము నిర్వహించెనట! అశ్వవిద్య క్షీణించినది. నల నకులులబోలు నాశ్వికులు నేడు లేరు. గతశతాబ్దమున మహారాష్ట్రయోధులు తమ గుఱ్ఱములకు నల్లమందు వేసి దినమున కెనుబదిమైళ్ళు పోగలిగెడివారని చరిత్రగ్రంథములందు గలదు. మోటారుకారులు వచ్చినపిమ్మట గుఱ్ఱముల యవసరము బొత్తిగా తగ్గిపోయినది. అయినను స్వాతంత్రభారతదేశమున నశ్వవిద్య నశింపకుండ పునరుజ్జీవింపజేయుట వాంఛనీయము.

## అక్షహృదయమను గణితవిద్య

బాహుకఋతుపర్ణులు అయోధ్యనుండి విదర్భకరుగుచుండ దారిలో నొకచోట గొప్ప విభీతకవృక్ష మొండెను. దానింజూచి ఋతుపర్ణుడు బాహుకున కిట్లనియె :— ఆరణ్య. 2 - 173.

సీ॥ ఎల్లవారు నెఱుగ రెల్లవాసనిభిన్న
విషయములెల్లవారు విద్యలందు
దొడరి యేనెఱుంగుదును దృష్టిమాత్రన
సకలమైన వస్తుచయము సంఖ్య.

174. ఇవ్విభీతకంబున ఫలపర్ణ సముదాయ సంఖ్యఁ జెప్పెద విను మీరెండు శాఖలంగల పర్ణఫలంబులు పదివేల నొక్కండు దక్షిన శాఖలం గలయవి రెండువేలుం దొంబదేను ననిన బాహుకుండు విని వీని నెన్నికాని నిశ్చయింప నేరనని తన రథంబు నిలిపి యా వృక్షం బాకణంబ యురులం ద్రోచి యయ్యిశాఖల యాకులుం బండులు నెన్నిన ఋతుపర్ణుండు చెప్పినయన్ని యయిన నచ్చెరువడి యవ్విద్య నాకు నుపదేశింపవలయునని యడిగిన ఋతుపర్ణుండిట్లనియె.

175. క॥ ఇది యక్షహృదయ మనగా
విదితంబగువిద్య దీని విధ్యుక్తముగా
మదినెఱుఁగు నరుఁడుసంఖ్యా
విదుఁడగు దుష్కృతకళంక విముక్తుడగున్

176. చ॥ సకలగుణప్రసిద్ధుఁడగు సర్వహితుండగుఁజూవెయంచు బా
హుకునకు ! బ్రీతితోడ విధియుక్తముగా నుపదేశ మిచ్చె న
త్యకుటిలబుద్ధి నక్షహృదయంబు కరంబు రయంబుతో విద
ర్భకు జనువేడ్కఁజేసి ఋతుపర్ణుఁడు పూర్ణమనః ప్రసన్నుడై ॥

దేశమునలేని విద్యలును, ప్రజలెరుగని విద్యలును ఉన్నట్టు బడాయి చెప్పుకోవలసిన యవసరము వ్యాసునికిగాని నన్నయకుగాని లేదు. నశించిన యీ ఘనవిద్యలను పునరుజ్జీవింపచేయుట మన కనీస ధర్మము.

## వ్యతిరేకశక్తులు - మండలపరిభ్రమణము

గతిశాస్త్రము (Dynamics) గణితశాస్త్రములో నొక భాగము. అందలి సిద్ధాంత మొకటి కిరాతార్జునీయ ఘట్టమున చక్కగా విశదము చేయబడినది - అరణ్య 1 - 302

వ॥ అంత నీశ్వర చోదితుండై మూకుండను దైత్యుండు సూకర రూపధరుండై బీభత్సు భేదింపసమకట్టి పయింబఱతెంచిన

305. చ॥ పటువిశిఖంబునం ద్రిదశపాలతనూజుఁడు పంది నేసె ము
న్నటఁ బరమేశ్వరుండును రయంబున దానిన రేసె నిట్టు లా

కట్టఁ బడియెన్ హరార్జునుల ఘోరశరంబులు పందిపై గుభ్భు
త్తటముపయిన్ వడింబడు సుదగ్రమహాశనులట్లు మ్రోయుచున్

306. క॥ హరుశరమును నరుశరమును
సరి నిరుపక్కియలు దాకి జవ మరి శర సం
భరమునఁ దిరిగె వరాహము
శరనిధిమథనమున దిరుగు శైలమపోలెన్॥

సూకరరూపుడగు మూకదైత్యునికి, ఒకప్రక్కనుండి అర్జునుడేసిన బాణమును, ఎదుటిప్రక్కనుండి ఈశ్వరుడేసిన బాణమును తగులగా నారక్కసుడు సముద్రమథనవేళ గిరగిరతిరుగు మందరపర్వతమట్లు నటునిటు తిరుగజొచ్చెను.

## ౨౧. హనుమద్భీమసంవాదము - అందలి విజ్ఞానవిశేషములు

ఇంతవరకును వెనుకటి ప్రకరణమున, శిల్పయంత్రాది ప్రకీర్ణ విషయ విజ్ఞానాంశములను గూర్చి సంగ్రహముగా విమర్శించి చూచితిమి. హనుమద్భీమసంవాదాత్మకమైన యీ ప్రకరణమున, మరికొన్ని విజ్ఞానాంశములను గూర్చి ముచ్చటించుకొందము.

### హనుమద్భీమసంవాదము

సౌగంధిక హరణార్థము భీముడు గంధమాదనాంతరమున పోవుచు నొక్క కదళీమండమధ్యమున దారికడ్డుగా పండుకొనియున్న కపిసత్తముడు హనుమంతుని జూచెను. హనుమంతుడు త్రేతాయుగమున వాయుదేవుని యంశమున జన్మించినవాడు. భీముడు ద్వాపరమునాటి వాడు; మహాగర్వి; తనంతటి బలశాలి మరొకడులేడని మదించి సంచరించుచుండెను. వృద్ధకపికి నిద్రాభంగముచేసి లేపవలెనని భీముడు ధ్వనితో సింహనాదముచేసెను. హనుమంతుని సమీపించుచు భీముడాతని తేజోమూర్తిని చూచెను. సంగ్రహరచనా శీలుడగు నన్నయ తెనిగింపక విడిచిన యీ తేజోమూర్తి మూలభారతమున నిట్లు వర్ణింపబడెను - అరణ్య 146 - 77

"విద్యుత్సంపాత దుష్ప్రేక్షం విద్యుత్సంపాత పింగళమ్
విద్యుత్సంపాత నినదమ్ విద్యుత్సంపాత చంచలమ్ "

ప్రకృతిలో వాయువిద్యుత్తులకు గల సన్నిహిత సంబంధమును బట్టి ఋగ్వేదమున మరుత్తులు తేజోఘనులని పలుతావుల వర్ణింపబడిరి - మరుదంశసంభూతుడైన హనుమకూడ మెఱుపువలె దుర్నిరీక్ష్య తేజుడు, పింగళవిశిష్టవర్ణుడు, చపల నినదసహితుడు. ఇట్టి స్థితిలో నిద్రాభంగమున కోర్వక ననాదరంబున కపివరుడు సోపాలంభనముగా భీముని కిట్లనియె :- ఆరణ్య 3 - 321 - 22

" గీ॥ అతి జరా రోగభయమున నలసిమొలసి
యొదిగి సుఖనిద్రమై నిట్టు లున్నవాని
గడుమదంబున నేమియు గరుణలేక
యేలబోధించితయ్య నీవెఱిగి యెఱిగి

322) వ. తిర్యగ్జాతులు ధర్మవెఱుంగవుగాక సర్వభూతదయాస్వరూపంబైన ధర్మవెఱింగెడువారు మనుష్యులు కారె యిట్టి మనుష్యజన్మంబువడసి వృద్ధోపసేవసేయవుగాకేమి ? ధర్మువెఱుంగక నిర్దయుండవై మాబోటిపెద్దమృగంబులకు భయంబుగగర్జిల్లితివి-నీవెవ్వండవు? "
మానవులు సృష్టికి తలకట్టువంటివారు. "Roof and crown of things." అని మానవులను Tennyson మహాకవి వర్ణించియుండెను. సృష్టికి తలకట్టైనమానవుడు ధర్మము రక్షించి దయాపరుడుగావలయు _ అట్లుగాక 'కంచెయేచేనుమేసి' నట్లు వ్యతిరేక ధర్మాచరణపరుడు గారాదు. " అని హనుమంతుడు చీవాట్లు పెట్టినను భీముని చెవికెక్కలేదు. మద గర్వములు మందము గాలేదు. "హనుమంతునియెదుట కుప్పిగంతులు" అనులోకోక్తి పుట్టుటకు కారణమగువిధమున మాటలాడి భీమ భినయింపసాగెను. కాలితో హనుమానునితోక కదల్పలేకపోయెను తుదకు రెండుచేతులతో పట్టి సత్తువపూనపనిచేసికూడ భీముడాతనితో రవంతయైన కదల్పజాలకపోయెను ; ముచ్చెమటలు పట్టినవి - పదివేల ఏనుగులబలముగల భీముడు కపిసత్తముని తోక కదల్పలేక లజ్జించెను.

గర్వభంగమైనది. చేతులుజోడించి, క్షమింపవేడి, కలహాపు కపినడిగి తెలిసికొనెను.

ఇక్కడ మనము నేర్చుకోవలసిన విజ్ఞానవిషయము జీవజాతుల రూప బల లక్షణములు యుగయుగమున మారుచుండును గాని ఎప్పటికి నొకేవిధమున నుండవు. ఇప్పటి యేనుగకు మూలపురుషు డనదగునది మహాకాయముగల యొక విచిత్రజంతువు. అది ఎనుబదియేండ్లకుగుల పొడవున నుండెను. ముందునను వెనుకనుకూడ దానికి పెద్దతోకవంటి యంగముండెను- కాలక్రమమున ముందుతోక తొండముగా పరిణమించినది; వెనుకతోక, తోకయైనది. ఎన్నో జాతుల జీవులంతరించినవి. వాని శల్యములను, అస్థిపంజరములనుబట్టి శాస్త్రవేత్తలు వాని యాకారవివరములను నిర్ణయింప గల్గుచున్నారు.

ఈమధ్య నలుబదియేండ్లక్రిందట హిమాలయపర్వత ప్రాంతములు త్రవ్వి శోధించగా విచిత్రమైన వృషభముయొక్క అస్థిపంజరమొకటి బయల్పడెను. దానికి నాలుగుకొమ్ములు, మూడుకాళ్ళు, రెండుతలలు నుండెను. కృత్తికా నక్షత్రాగ్ని రూపుడైన హవ్యవాహనుని కాశ్రయమైనరాశి వృషభమును ఋగ్వేదము "చత్వారిశృంగా త్రయో అస్యపాదా ద్వేశీర్షే" అని వర్ణించుచున్నది. ఆనాడట్టి వృషభములుండెడివి- ఈనాడులేవు. యుగచర్యనుబట్టి అంతరించినవి- ఈశాస్త్రదృష్ట్యా ఋగ్వేదముచదివి యర్థముచేసికోలేనివారు పై మంత్రమునకు వ్యాకరణార్థము చెప్పుకొని తృప్తిపడుచున్నారు. ఆయుగము యొక్క శాస్త్రవిజ్ఞానమంతయు వేదమున క్రోడీకరింప బడినది. ఆవిజ్ఞానార్థము తెలియకపోవుటచే వేదమునందు కొన్నిసూక్తములు దురవగాహములగుచున్నవి. సరియైన తాళపుచెవులుపెట్టి తెఱచినగాని వేదపేటిక తెఱువబడదు. యుగభేదములనుబట్టి జీవకోటులలో రూప భేదము, ఆకార భేదము, అంగభేదము, పరిమాణ భేదము లోనగు మార్పులనేకములు సంభవించుచుండునని మనము బాగుగా గుర్తించవలసియున్నది. ఈక్రిందిపద్య మీయర్థమును చక్కగా వ్యక్తము చేయుచున్నది.

ఆరణ్య - 3 - 334 కాలావస్థాతదాహ్యన్యావర్తతేసాన సాంప్రతామ్
క॥ అక్కాలంబున రూపం
బిక్కాలమువందుజూప నెట్లగు
గాలంబొక్కవిధంబున నుండక
పెక్కువిధంబు లనవచ్చు భిన్నావస్థన్ ॥

హనుమద్భీమ సంవాదములో భారతయుద్ధ సమయమున హనుమంతు డర్జును రథధ్వజముగా నుండిన విషయము చాల ముఖ్యమైనది.

ఆరణ్య 151 - 17. "విజయస్య ధ్వజస్థశ్చ...

నన్నయ ఆరణ్య 3 - 353. "అనిసవిని భీమసేనునకు హనుమంతు డిట్లనియె నన్ను రణరంగంబునం దలంచునది నీయందు సౌహృదంబున నాహవంబులో నతిరథుండైన యర్జును రథధ్వజంబునందుండి మీబల పరాక్రమంబులు జూతునని భీముఁగౌఁగిలించుకొని ...

## 22. ధ్వ జ వి చా ర ణ

విజయుడు హనుమద్ధ్వజుడగుటకు కారణములను స్పష్టముగా తెలుపు పైవాక్యములు మనము వ్రాయుచున్న యీగ్రంథమునకు ప్రాణతుల్యములు. భారతము రచించునపుడే, వ్యాసుడు చరిత్రాత్మకమైన కథాదృష్టితోనేగాక, జ్యోతిశ్శాస్త్ర దృష్టితోగూడ వీక్షించి సంస్కృత భారతము రచించెను. భారతారంభమున సంభవ పర్వములోనే యేభారతవీరులు ఏయే దేవతాంశ సంభూతులో స్పష్టముగా వివరింపబడినది. మఱియు నేయే దేవతలకు ఏయేనక్షత్రములతో సంబంధముగలదో నక్షత్రేష్టిలోనగు వేదప్రమాణములు వక్కాణించు చున్నవి. అందుమూలముగా నొక్కొక్క భారత యోధున కేయేనక్షత్రములతో సంబంధముకలదో తేటతెల్లమగు చున్నది. ఒక్కొక్క యోధుని ధ్వజవివరములు ఈ జ్యోతిర్భావములకు ఉపబలముగా నుండుటయేగాక జ్యోతిశ్శాస్త్రపరముగా భారతకథాన్యాయమును చక్కగా ధ్రువపఱుచుచున్నవి- వ్యాసుని రచనలలో నేవేని లోపములున్నను; నన్నయ్య వానిని సంస్కరించి పూర్తిచేసి, భారతకథకును జ్యోతిర్దృశ్యములకును అభిన్నత చేకూర్చి ఐక్యతను ప్రసాదించెను. ఈయద్వైతసిద్ధి నిరూపణమునకు ఆయాయోధుల ధ్వజవిమర్శనము దివ్యమైన సాధనము. మనము పూర్వ ఫల్గునీ, ఉత్తరఫల్గునీ నక్షత్రములని చెప్పుకొను రిక్కలకు వేదమునందు

అర్జునీనక్షత్రములని యేపేరు. ఉత్తరఫల్గునీనక్షత్రము, అర్జునుడు. ఉత్తర ఫల్గునికి హస్త, చిత్తానక్షత్రములు ఎగువనున్నను దక్షిణదిశకు వ్రాలి, సరిగా పైనున్నట్టు కనబడవు. ఉత్తరఫల్గునికి సరిగా మీదనున్నది స్వాతి. స్వాతిచుట్టునుగల చుక్కలు వానరరూపమును స్ఫురింపజేయు చుండును. ఋగ్వేదములో నీవానర రూపమునకు వృషాకపియని పేరున్నది. ఈజిప్టు, చీనాదేశముల ప్రాచీన జ్యోతిశ్చిత్రములలో చిత్రసమీపమున వానరరూపము రచింపబడి యున్నది. రామాయణ కిష్కింధాకాండమున వాల్మీకి, లంకకుపోవ నుద్యమించు హనుమంతుని వర్ణించుచు, 'స్వాతేః పంథా ఇవాంబరే' (కిష్కింధ 67 - 20) అని సాభిప్రాయముగా తెల్పినాడు. స్వాతిచుట్టు నుండు నక్షత్ర వానరరూపమును స్మరించుకొని వాల్మీకి పైయుపమానము కూర్చె ననుట నిశ్చయము. ఇటీవలి భారతీయ జ్యోతిష్కులు కన్యారాశిని "ససస్య దహనా ప్లవగాచకన్యా" యని వర్ణించుచున్నారు. ఉత్తర మూడుపాదములు+హస్త+చిత్ర రెండుపాదములు ఇవన్నియు చేరి కన్యరాశి యనబడుచున్నవి. కన్యచేతిలో కొందరు నక్షత్రవిదులు పుష్ప మాల యున్నదని భావించిరి. మరికొందరు ఆమె చేతులలో వరి వెన్ను లున్నవని భావనచేసిరి. కాబట్టి కన్యారాశి ససస్య యనదగియున్నది. కన్యారాశిదిగువ నింద్రాగ్ని దైవత్యమైన విశాఖాగ్ని గుండమున్నది. కాబట్టి దహనార్థము సరిపడినది. పిమ్మట కన్యారాశి ప్రక్క ప్లవగము కలదని పైశ్లోకము నిరూపించుచున్నది. ప్లవగమనగా వానరము. ఇట్లు ప్రాచీనకాలమునుండి, నేటివఱకును స్వాతి ననుసరించి వానర రూపము కలదని జ్యోతిర్విదులకు స్పష్టముగా తెలిసియున్నది. ఉత్తరఫ సి - అర్జునిపై - వానరరూప నక్షత్రము లుండుటచేతను, స్వాతి వాయుదైవత్య మగుటచేతను, అర్జునుడు హనుమద్ధ్వజుడని జ్యోతిశ్శాస్త్రదృష్ట్యా సిద్ధాంతము చేయనగుచున్నది. ఇంతదూర మాలోచించి, జ్యోతిర్విదుడు వేదవ్యాసుడు అర్జునుడు కపిధ్వజుడు హనుమద్ధ్వజుడని చక్కగా వర్ణించినాడు. విశేషించి, స్వాతీనక్షత్రము భూతేశ మండలములోనిది. (భూతేశ శబ్దము పడమటిజోస్యుల నోళ్ళలోబడి నలిగి 'బూటీస్' (Bootes) అనబడుచున్నది) వ్యాసుడీ భూతవిశేషములను కూడ సంస్కృత భారతమున పలుతావుల స్పష్టముగా వర్ణించి యున్నాడు.

విరాట. 46 – 3, 4.

3. "ధ్వజంవానర లక్షణమ్
మనసాచింతయామాస ప్రసాదం పావకస్యచ ॥

4. సచతచ్చింతితం జ్ఞాత్వాధ్వజే భూతాన్యవేశయత్
సపాతకం విచిత్రాంగం...

విరాట 53 - 28 ..

"అమానుషాణాం సర్వేషాం భూతానాం ధ్వజవాసినామ్"
అర్జునుడేకాదు. కౌరవయోధుల ధ్వజములన్నియు ఖగోళ దృష్ట్యా, జ్యోతిశ్శాస్త్రము ననుసరించి సమకూర్పబడినవే. ఈయంశము నిరూపించుటకు, ఉత్తర గోగ్రహణార్థ మరుదెంచిన కౌరవయోధులధ్వజములను సంగ్రహముగా పరిశీలింతము.

అర్జునుడు గోగ్రహణసమయమున తన రథచోదకుడైన యుత్తరునకు కౌరవవీరుల ధ్వజముల నీక్రిందిపద్యమున వివరించి తెలిపినాడు.
విరాట 5 - 4

సీ॥ కాంచనమయవేదికా కనత్కేతనోజ్జ్వలవిభ్రమమువాడుకలశజుండు
సింహలాంగూల భూషిత నభోభాగ కేతు ప్రేంఖణమువాడు
ద్రోణసుతుడు
కనకగోవృషసాంద్ర కాంతి పరిస్ఫుట ధ్వజసముల్లాసంబువాడుకృపుడు
లలితకంబుప్రభాకలిత పతాకావిహారంబువాడు రాధాత్మజుండు
మణిమయోరగ రుచిజాలమహితమైన పడగవాడు కురుక్షితిపతి
మహోగ్రశిఖరఘనతాళతరువగుసిడమువాడు సురనదీసూనుడేర్పడఁ
జూచికొనుము.

## ద్రోణుడు వేదికాధ్వజుడు

ద్రోణాచార్యులు కుంభసంభవుడు – కుంభరాశినుండి జన్మించినవాడు. ధనిష్ఠ రెండుపాదములు+శతభిషము+పూర్వాభాద్ర మూడు పాదములు. ఇవన్నియుచేరి కుంభరాశి. ద్రోణుడు కుంభమునుండి జన్మించెను. కుంభముపై రాశి, మీనము. పూర్వాభాద్ర ఒకపాదము+ ఉత్తరాభాద్ర + రేవతి చేరి మీనరాశి – ఇందు ఉత్తరాభాద్రకు అధిదేవత అహిర్బుధ్న్యుడు (నక్షత్ర ఇష్టి). అతడే గార్హపత్యాగ్ని (ఐతరేయబ్రాహ్మణము III – 3 - 36) "అహిర్బుధ్న్యోయ దగ్నిర్గా

హూత్యా పత్యోగ్నినై వాసు... ద్రోణునిపై గార్హపత్యాగ్ని వేదిక యుండుటచే, ద్రోణుడు వేదికాధ్వజుడు కాకతప్పదు.

## అశ్వత్థామ సింహలాంగుల ధ్వజుడు

ద్రోణుని కుమారుడు అశ్వత్థామ. పుట్టగానే ఉచ్చైశ్శ్రవము వలె అఱచుటచేత అశ్వత్థామయైనాడు. పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములు ఉచ్చైశ్శ్రవము. ఆప్రక్కనే చిన్నగుఱ్ఱము రూపున నున్న చుక్కలు అశ్వత్థామ. అశ్వత్థామ నక్షత్రములపై మీనరాశి చేపలమధ్య మెలికలుగల పాశ మున్నది. అందు కొంత భాగము సింహము తోకరూపమున నుండుటచేత అశ్వత్థామ సింహలాంగూల ధ్వజుడైనాడు.

## కృపుడు గోవృషధ్వజుడు

కృపుడు గోతమునికి జనించినవాడు. గోతముడు గోధనవిశిష్టుడు. శ్రవణమున కావల ధనిష్ఠగలదు. గోలోకమచ్చట గలదు. "యత్ర గావో భూరిశృంగా అయాసః" అని ఋగ్వేదము ప్రసంసించినది. ధనిష్ఠ ప్రాంతమున నక్షత్రరూపమున మెఱయు వృషభములను చీనాదేశపు మహాత్ముడు — కన్‌ఫ్యూషియస్ (Confucius) రెండువేల ఐదు వందల సంవత్సరములక్రిందట నిట్లువర్ణించెను. "Brilliant show the Draught oxen But they do not serve to draw our carts". ధనిష్ఠప్రాంతమున (మైసూరు ఎడ్లవంటి, ప్రశస్తమైన ఎడ్లు మెఱయు చున్నవి; కాని అవి మనబండ్లకు పూన్చుకొనుటకు అందుబాటులో లేవు భారతము శాంతి, అనుశాసనిక పర్వములలో గోవులు - గోలోకము - వీని వివరములు చాలగలవు. కాని జ్యోతిర్లోకమున ధనిష్ఠప్రాంతమున నుజ్జ్వలముగా గోవృషరూపమున మెఱయు నక్షత్రములు గలవని నిరూపించుటకు పైనివ్రాసిన వేదాది ప్రమాణములు చాలును. ఆగోవృషనక్షత్రములనుబట్టి కృపునిధ్వజము గోవృష శోభితమయ్యెనని చెప్పగలుగుచున్నాము.

## కర్ణుని ధ్వజము ఏనుగు

"లలిత కంబు ప్రభాకలిత పతాకావిహారముగల వాడు కర్ణుడు" కంబు శబ్దమునకు ఏనుగు అని యర్థముకలదు.* కర్ణుడు పూషుడను సూర్యుని

* Apte. Skt-Eng Dict. Page 335 Column 2 कम्बु= an elephant.

పుత్రుడు. రేవతీనక్షత్రమునకు నధిదేవతపూషుడు. ఖగోళమున సింహారాశికెదురుగా నక్షత్రరూపముగల ఏనుగ గలదు. గజేంద్ర మోక్షణకథ కాధారభూతమై మకరముచే బహుకాలము పీడింపబడిన గజేంద్రుడు నక్షత్రరూపమున వెలుగుచు కానవచ్చుచున్నాడు. ఈదంతావళమే కర్ణునికి ధ్వజము.

## దుర్యోధనుడు ఉరగకేతనుడు

ఋగ్వేదమున శింశుమారమనబడెడి ఘోరజలజంతువు వర్ణింపబడి నది - శింశుమారములిపుడు నశించినవికాని ఉన్నప్పుడవి ప్రాణిభీకరము లైన ఘోరజంతువులు. శింశుమారస్వరూపమునిచ్చుటి చిత్రము పాఠ కులకు వ్యక్తము చేయగలదు. ఇంతటి పెద్దచుక్కలగుంపు ఆకాశమున మరొకటిలేదు. దురాశ, క్రౌర్యము నను దుర్గుణములకు ఈనక్షత్ర స్వరూపముగల శింశుమారము పుట్టినిల్లు. రామాయణార్థములో ఈ గుంపుచుక్కలు రావణునిలంక. భారతార్థములో నీచుక్కలు దుర్యో ధనాది కౌరవబృందము. ఈచుక్కలగుంపును పడమటిజోస్యులు Cetus అందురు. ఈగుంపుమీదుగా అశ్విన్యాది నక్షత్రములున్నవి-వీధీవిభాగ పద్ధతిని, అశ్విని భరణి కృత్తికలు నాగవీధి యగునని విష్ణు, వాయు, మత్స్యాదిపురాణములన్నియు నేకకంఠమున వాకొనుచున్నవి - ఆకార ణముచేత దుర్యోధనుడు ఉరగకేతనుడు కాకతప్పదు.

## భీష్ముడు తాలధ్వజుడు;

"మహోగ్రశిఖర ఘనతాళతరువగు సిడమువాడు సురనదీసూనుడు" భీష్మునిధ్వజము ఒకపెద్దతాటిచెట్టు. ఏమి? భీష్మునికి తాటిచెట్టుతప్ప మరొక ధ్వజము కుదరలేదా? అని విమర్శకులు ప్రశ్నింతురు. కుదర లేదు; కుదరదు అని మాప్రత్యుత్తరము. భీష్ముడు అష్టవసువులలో నొకడు. వసిష్ఠుని హోమధేనువును తస్కరించి, శప్తుడై, గంగాదేవి కుమారుడై జన్మించినాడు. "ధనిష్ఠానక్షత్రం వసవః" అని నక్ష త్రేష్టి. ధనిష్ఠనక్షత్రములకు వసువులు అధిదేవతలు. ధనిష్ఠనక్షత్రములు ఎనిమిది; వసువులుకూడ ఎనమండ్రు. అందరిలో కడపటివాడు భీష్ముడు. ధనిష్ఠపైనక్షత్రము శతభిషము - అయ్యది వరుణాదైవత్యము. వరుణా సంజాతవారుణి. (చూ. సం. భారతము ఆది 66-54.

"వరుణస్యభార్యా యాజ్యేష్ఠా శుక్రాద్దేవీప్రజాయత।
తస్యాః పుత్రం బలంవిద్ధి సురాంచసురనందనీమ్॥"

సురసంజ్ఞికము తాళవృక్షమగుటచే భీష్మునకు తాళవృక్షము ధ్వజము కావలసివచ్చెను.

## 23. భీష్ముని బ్రహ్మచర్యము

తాళధ్వజుడగుటయేగాక భీష్ముడు బ్రహ్మచారియగుటకును ఖగోళ దృష్ట్యా కారణ మగపడుచున్నది.

బ్రహ్మచారి యననెవడు ? కన్యకును, మిథునమునకును గూడ దూరమున నుండవలసినవాడే బ్రహ్మచారియగును. భీష్ముడు ధనిష్ఠయైనచో, ధనిష్ఠకు రాశిమిథున మెంతదూరముననున్నది ? కన్యారాశి ఎంత దూరమున నున్నది ? లెక్కింతము. మృగశిర రెండుపాదములవఱకు వృషభము. అటుపై నిగదా మిథునము ? ధనిష్ఠకు మిథునము తొమ్మిది యిండ్లదూరము – ౧ శతభిషము ౨ పూర్వాభాద్ర ౩ ఉత్తరాభాద్ర ౪ రేవతి ౫ అశ్విని ౬ భరణి ౭ కృత్తిక ౮ రోహిణి, ౯ మృగశిర ½ – మిథునము. తొమ్మిది యిండ్లదూరములో భీష్మునకు మిథునమున్నది. అట్లే కన్య (చిత్తార్ధమునుండి, ధనిష్ఠకు – ౧ స్వాతి ౨ విశాఖ ౩ అనురాధ ౪ జ్యేష్ఠ ౫ మూల ౬ పూర్వాషాఢ ౭ ఉత్తరాషాఢ ౮ శ్రవణము ౯ ధనిష్ఠార్ధము – ఇట్లు కన్యకును, మిథునమునకును తొమ్మిదేసి యింత దూరముననున్న భీష్ముడు బ్రహ్మచారిగాక తప్పదు. ఈవిధముగా ప్రతిముఖ్యవిషయ సందర్భమునందును భారతకథకును అందలి పాత్రలకును, జ్యోతిర్విశేషములకును ఎడతెగని సంబంధము గనబడుచున్నది. దేశకాలముల వలెనే భారతకథకును జ్యోతిర్విషయములకును అవినాభావసంబంధము కలదు. జ్యోతిర్విజ్ఞానము వినా భారతకథ లేదు.

ద్వ్యర్థికావ్యమును రచించుకవికి, తన రచనల కాస్పదములైన కథలు రెండింటియందును దృష్టివిడువక ప్రసరించుచుండ వలెను. దేనిమీద మందమైనను రచనకుంటువడునుగాని సరిగా నడువదు. రాఘవపాండవీయము రచించిన పింగళిసూరనకు అందు ప్రతిపద్యమును, ప్రతి గద్యమును రచించునపుడు రామాయణ భారతకథలు రెండును మనోనేత్రము నెదుట ప్రత్యక్షముగా తోచుచుండెను. అట్లే హారిశ్చంద్ర నలోపాఖ్యాన కర్తకు, హరిశ్చంద్ర నలమహారాజు లిద్దరి కథలును, కృష్ణార్జున చరిత్రకర్తకు సుభద్రాహరణ, పారిజాతాపహరణ కథలును, విడువక మనోవీథి నెట్టయెదుట గోచరించుచునే యుండెను.

అదేవిధముగ వ్యాసభట్టారక, నన్నయభట్టారకుల కిరువురుకు, భారత కథమీఁదను, ఆకథను నక్షత్రాక్షరములతో ప్రదర్శించుచున్న ఖగోళ దృశ్యములమీఁదను బఱపుచుండిన వీక్షణములు యేవేళను నిశితములై యుండెనేగాని మందముగా లేదనుట నిక్కువము. నన్నయభట్టు శరత్కాలమును వర్ణించుచు వ్రాసిన తుదిపద్యములు రెండును పైని వ్రాయబడిన వాక్యములు సత్యములని నిరూపింపగలవు. అందు 'భూసతికిన్ దివంబునకు' ననుపద్యము నీవఱకే విపులముగా చర్చించితిమి. ఇకతుది పద్యమును విమర్శింతము.

## 24. నన్నయభట్టు రచించిన తుదిపద్యము

ఉ॥ శారదరాత్రు లుజ్జ్వలలసత్తర తారకహారపంక్తులున్
చారుతరంబులయ్యె వికసన్నవ కైరవగంధ బంధురో
దారసమీర సౌరభముదాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూరపరాగ పాండురుచిపూరములన్"

రాజనరేంద్రుని యాజ్ఞానుసారముగా నన్నయభట్టారకుడు "బుద్ధి బాహువిక్రమమున దుర్గమార్థజల గౌరవ భారతభారతీ సముద్రము" నీదుచు తెనుగున భారతము రచించుచున్నాడు. అరణ్యపర్వకథ నడుచుచున్నది. నహుషాజగరము బారినుండి భీముడు విముక్తిగనినాడు. క్రమముగా గ్రీష్మ, వర్ష ఋతువులు గడిచినవి. శరదాగమనమైనది. వాణీహిరణ్యగర్భదంపతుల శోభను వారి వాహనమైన హంస గతి పెంపొందింప జేయుచున్నది. అదేవిధముగా ద్యావాపృథివీ దంపతుల శోభను శరచ్చంద్రజ్యోత్స్న అతిశయింప జేయుచున్నది. ఇట్టి శర ద్రాత్రులందు నక్షత్రహారపంక్తుల తేజస్సు వృద్ధిపొందినందున నవి యత్యుజ్జ్వలముగా ప్రకాశించుచు మనోజ్ఞతరములై చూపట్టుచున్నవి- చంద్రోదయమునకు సమ్మోదముతో వికసించిన తెల్ల కలువల సువాసనలనెల్ల మొదలకు గొనిపోవుచు గంధవహుడు స్వేచ్ఛా విహారను. గావించుచున్నాడు. తాపహారుడు సుధాంశుడు చల్లగా వెదజల్లుచున్న కర్పూరపరాగపాండురుచిపూరములలో నీనవకైరవ సౌరభములు లీనమై హాయింగూర్చుచున్నవి- కమ్మనితావులు నన్నపార్శ్యని ఘ్రాణేంద్రియమునకు పండువు చేయుచున్నవి. శరచ్చంద్రుని జ్యోత్స్నావైభవముతో లసత్తరములగు నక్షత్రహార పంక్తులతో నుల్లసిల్లు నభోరంగము ఆకవితల్లజునికి నేత్రోత్సవము

గావించుచున్నది- నన్నయ్య నభోరమణీమణీ గుణమయ పాశబద్ధుడై కదలనేరక పోయెను; తన్నివేశితమానసుడై తన్నెఱుగలేక పోయెను; నభోరమణీ రూపామృత పానముచే నతని నయనములనిమిషత్వము నొందిన, వానినతడా నభోరమణియందే నిలిపి చైతన్యము గోల్పోవుచుండెను.

తెనిగింపబడక మిగిలియుండిన భారతపర్వములామహాకవి యున్న ప్రమాదావస్థ గుఱితించుకొని, యాతనిం జేరవచ్చి "మాకేమి సెల"వని దీనముగా నడుగుకొనుచున్నట్లు అతనికపుడు భావింప నయ్యెను. "పరపూరితంబులై వెలయగలరని" యతడు ప్రత్యుత్తర మీయబోయెను. కాని కాలమేదీ?

"పరపూరితంబులై" యనుమాటలు వెడలువఱకు మాత్రమే ముఖ్యప్రాణుడా దేహమున నిలిచి, వాక్యము పూర్తిగాక ముందే వెడలిపోయెను. ఆర్షసాంప్రదాయ ప్రవర్తకుడు, పరమ పావనమూర్తి, నన్నయకవీంద్రుని పరిశుద్ధాత్మ తనకత్యంత ప్రియమైన జ్యోతిర్లోకమున కంతలోనెగసి యందు లీనమైపోయెను. తెనుగు భారతము పూర్తిగాకుండనే నన్నపార్యుడీ విధమున తన భౌతికశరీరమును త్యజించెను. భారతశేషమునందలి పర్వములు నన్నయచెప్పినట్లే 'పరపూరితంబు' లయ్యెను. నన్నయ తుదిపద్యమునకీ తుదిమాటలు చేర్చినపుడు పద్యమిట్లు పూర్తియగుచున్నది.

ఉ॥ శారదరాత్రు లుజ్జ్వల లసత్తరతారకహారపంక్తులున్
చారుతరంబులయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీర సౌరభముదాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూర పరాగపాండురుచి పూరములం బరపూరితంబులై ॥

## పూ జ్య పా దు డ గు న న్న య

"అమలిన తారకాసముదయంబులం బ్రశంసించుచు భారతము తెనిగింపబూని ఉజ్జ్వలలసత్తరతారకహారపంక్తులతో ప్రకాశించు శరత్కాల నభోరమావైభవము తిలకించుచు, ననిమిషుండవై జ్యోతిర్లోకముం జేరి యమరత్వముచెంది ధన్యుడైనాడు! ఏరీ? నీయట్టి జ్యోతిర్విదులీ తెనుగునాట?

సరస్వతీ పవర్ ప్రెస్ - రాజమహేంద్రవరం